# సిద్ధ యోగి పుంగవులు

రచన

**గబ్బిట దుర్గాప్రసాద్**

ప్రచురణ:

**సరసభారతి**

ఉయ్యూరు: కృష్ణాజిల్లా

**Siddha Yogi Pungavulu**

by **Gabbita Durga Prasad**

First published: **April 2013**

Copies: 1000

Price. Rs.**80/-**

Cover Design: **Kalasagar**

Dtp: **Ramya Bharathi, Vijayawada**

For Copies:-

**Gabbita Durga Prasad**
President, "Sarasabharathi"
H.No.2-405, Sivalayam Street,
Near Raja gari kota, Vuyyuru- 521 165
Krishna Dist. Phone:08676- 232797
Cell: 9989066375
e-mail: gabbita.prasad@gmail.com
sarasabharati.vuyyuru@gmail.com
http/sarasabharati.wordpress.com
http/suvarchalanjaneyaswamy.wordpress.com

Printed : **Bhavani Offset printers** vja-2

# అంకితం



మంత్రోపదేశం పొందిన మాతృమూర్తి

**స్వర్గీయ మైనేని సౌభాగ్యమ్మ**

**(కుమ్మమూరు, కృష్ణాజిల్లా) గారికి...**

# మా మాట

**"స**రసభారతి" సాహిత్య సాంస్కృతిక సంస్థ ప్రచురిస్తున్న ఈ పదవ పుస్తకం "సిద్ధయోగి పుంగవులు" ముద్రణకు పూర్తిగా ఆర్థిక సహాయాన్ని అందించిన వారు ఆత్మీయులు, ఉయ్యూరు వాసి, ప్రస్తుతం అమెరికాలోని అలబామా రాష్ట్రంలో హన్స్ విల్ నివాసి శ్రీ మైనేని గోపాలకృష్ణగారు. వారికే ఈ గ్రంథాన్ని అంకితమివ్వాలని నేను భావించాను. ఆ విషయం వారికి తెలియజేశాను. కాని వారు తమ జీవితాలను తీర్చిదిద్ది, తమ కుటుంబ సభ్యులను ఉన్నత స్తితిలోకి రావటానికి కారణభూతురాలైన తమ తల్లిగారు స్వర్గీయ మైనేని సౌభాగ్యమ్మగారికి పుస్తకాన్ని అంకితమిస్తే తమకు ఎంతో సంతృప్తిగా ఉంటుందని వెంటనే తెలిపారు. వారి మాతృ శ్రీమీద వారికి ఉన్న గౌరవం, ఆదరణ, ఆరాధనకు నేను ఎంతో ఆనందంచి వెంటనే అంగీకరించాను. గోపాలకృష్ణగారు సరసభారతికి గొప్ప అభిమాని, అండా దండా కూడా. నాకు హితులు, సన్నిహితులు మార్గదర్శి. వారి శ్రీమతి సత్యవతిగారు ఆయనకు నిజంగా సహధర్మచారిణి. వారిద్దరూ జీవికా జీవులు. వారి సంతానం కూడా యోగ్యులై తండ్రికి తగ్గ వారనిపించుకొన్నారు. పెద్ద కుమారుడు-హన్స్ విల్‌లో స్పేస్ సెంటర్‌లో డిఫెన్స్ ఫిజిసిస్ట్. భార్య రమ-కుమార్తెలు శ్రేయ, సరీన. చిన్న కుమారుడు-రవి. "బన్యన్ ట్రీ కాపిటల్" అనే ఆర్థిక సంస్థకు ప్రెసిడెంట్ మరియు సలహాదారు. భార్య శ్రీమతి కవిత-ప్రఖ్యాత డాక్టర్. కుమారుడు కిరణ్ కుమార్తెలు రియా, కరీనా. నలభై ఏళ్లుగా అమెరికాలో ఉన్నా ఉయ్యూరుమీద వారందరికీ ఇప్పటికీ మక్కువ ఎక్కువే. గోపాలకృష్ణగారు తమ తలిదండ్రులు మైనేని సౌభాగ్యమ్మ వెంకట నరసయ్యగార్ల పేరభూరి విరాళాన్ని అందించి దక్షిణ భారతదేశంలోనే మొట్టమొదటి ఎ.సి.గ్రంథాలయం ఉయ్యూరులో ఏర్పడటానికి కారణమైనారు. అలాగే మచిలీపట్నంలోని కృష్ణా విద్యాలయానికి తెలుగుశాఖ గ్రంథాలయ అభివృద్ధికి 20,000 రూపాయల విరాళాన్ని అందజేసిన

వదాన్యులు. జన్మభూమి మీద వారికి ఉన్న మమకారానికి నిదర్శన. దాని ప్రారంభోత్సవానికి కుటుంబ సమేతంగా అమెరికా నుంచి వచ్చి పాల్గొన్నారు. అలాగే వారి అమ్మగారంటే అమితమైన ఆరాధన. అందుకే వారి మాటకు కట్టుబడి ఈ పుస్తకాన్ని గోపాలకృష్ణగారి తల్లిగారు స్వర్గీయ మైనేని సౌభాగ్యమ్మగారికి మనస్ఫూర్తిగా అంకితమిస్తున్నాను.

శ్రీమతి మైనేని సౌభాగ్యమ్మగారు 1900లో కృష్ణాజిల్లా గుడ్లవల్లేరులో జన్మించారు. తండ్రిగారు చాపరాల నాగయ్యగారు. తల్లి చుక్కమ్మగారు. సౌభాగ్యమ్మగారిని ఉయ్యూరు దగ్గర ఉన్న కుమ్మమూరు గ్రామ మునసబు, వ్యవహర్త భూస్వామి, వ్యాపారి, రాజకీయ నాయకులు అయిన మైనేని వెంకట నరసయ్యగారికిచ్చి వివాహం జరిపించారు. ఆమె గృహిణిగా భర్తకు చేదోడు వాదోడుగా ఉండి అతిథి అభ్యాగతులను ఆదరిస్తూ, సంతానాన్ని చక్కగా చదివిస్తూ వారి ఆలనా పాలనా చూసుకొంటూ గడిపారు. భర్త ఎప్పుడూ తీరికలేని పనులలో ఉండటం వల్ల వీరిదే బాధ్యత ఎక్కువ. అదేమీ కష్టంగా ఆమె భావించలేదు. అంతటిని సునాయసంగా, మనస్ఫూర్తిగా కుటుంబ బాధ్యతలను నిర్వహిస్తూ అందరికి తలలో నాలుకలాగా మెలగేవారు. ఊరిలో మంచి పేరు ప్రఖ్యాతులుండేవి. గాంధీజీ కుమ్మమూరు వచ్చినప్పుడు ఆమె దర్శించి పులకించారు. పిల్లలకు చూపించి వారిని మహాత్ముని ప్రభావానికి లోనయ్యేట్లు చేశారు. ఆదర్శవంతమైన సాధారణ జీవితమే గడిపారు. పిల్లల విద్యాబుద్ధులకే అధిక ప్రాధాన్యతనిచ్చేవారు. “అక్షరం ముక్క రాకపోతే ఎందుకూ పనికి రారు” అని చెప్పేవారట. ఆమె పెట్టిన విద్యా భిక్షే తమను విదేశాల్లో గౌరవంగా జీవించటానికి కారణమైనదని గోపాలకృష్ణగారు గర్వంగా చెప్పుకొంటారు.

వెంకట నరసయ్య, సౌభాగ్యమ్మ దంపతులకు ముగ్గురు కుమారులు, అయిదుగురు కుమార్తెలు. కుమారులు సూర్యనారాయణ, రాజశేఖర్ (తాతయ్య), గోపాల కృష్ణగార్లు. కుమార్తెలు అన్నపూర్ణాదేవి, కనక దుర్గాదేవి, భారతీ దేవి, సత్యవాణిగార్లు. పెద్ద కుమార్తె అన్నపూర్ణాదేవి గారిని డాక్టర్ చదివించారు. ఆమె రాచకొండ విశ్వనాథశాస్త్రిగారి తమ్ముడు నరసింహశర్మ అనే సహాధ్యాయుని ప్రేమించి వర్ణాంతర వివాహం చేసుకొంటే, ఆనాడే అభ్యంతర పెట్టక మనస్ఫూర్తిగా ఆశీర్వదించి



సంస్కారవంతమైన దంపతులు అనిపించుకొన్నారు మైనేని దంపతులు. ఆ ఇద్దరు ఎంతో అన్యోన్య దాంపత్యాన్ని అనుభవిస్తున్నారు. అలాగే అందరు విద్యలో వృద్ధి పొంది జీవితాలలో స్థిరపడ్డారు. కుటుంబ బాధ్యత అంతా సౌభాగ్యమ్మగారే నిర్వర్తించారు. ఎవరికీ ఏ లోటు రానీకుండా, ఆస్తిని కాపాడుకొంటూ పిల్లల భవిష్యత్తుకు సోపానాలు నిర్మిస్తూ ఆధ్యాత్మిక చింతనలో జీవితాన్ని ధన్యం చేసుకొన్నారు. ఆమెకు భక్త రామదాసు కీర్తనలంటే మహా ఇష్టం. కబీరు దాసు కీర్తనలు శ్రావ్యంగా పాడేవారు. త్యాగయ్య అంటే వీరాభిమానం. నోటి నుండి త్యాగరాజ కీర్తనలు జాలువారుతూ ఉండేవి. ఇలా భక్తీ, జ్ఞానాలతో ఆమె గడిపారు. ఏర్పేడు ఆశ్రమ పీఠాధిపతి శ్రీశ్రీశ్రీ మళయాళ స్వామివారి వద్ద ఉపదేశం పొందిన పుణ్యాత్మురాలు.

తన భర్త తనకంటే ముందుగా పరమపదించాలని ఆమె కోరుకొనేవారు. దీనికి కారణం ఆమె భర్తగారు సహాయ సహకారాల కోసం ఎవరి మీదా అంటే సంతానం అయిన బిడ్డల మీద కూడా ఆధారపడి ఉండటం ఆమెకే మాత్రం ఇష్టంలేదు. అదే ఆమె ఆరాటం. అయితే తానొకటి తలిస్తే భగవంతుడు ఇంకో విధంగా తలుస్తాడు. ఆమె భర్త వెంకట నరసయ్య గారికంటే నాలుగు నెలల ఇరవై ఒక్క రోజుల ముందుగానే మరణించారు. ఒక రకంగా ఇది సగటు హిందూ మహిళ కోరుకొనే పుణ్యస్త్రీ సుమంగళీ మరణం. అదే ఆమెకు దక్కింది.

జీవిత చరమాంకంలో సౌభాగ్యమ్మగారు తీవ్ర పక్షవాతానికి గురైనారు. మంచంలోంచి లేవలేని స్తితి. ఇలాంటి బాధ భర్తగారికి రాకూడదనే ఆమె కోరుకొన్నారు. కాని ఆమెకు ఆ అనుభవం తప్పలేదు. కుటుంబం ఆశ వదులుకొన్నది. డాక్టర్లు కూడా అందరికి కబురు చేయమని చెప్పారు. కాని ఆమె అమెరికాలో ఉంటున్న గోపాలకృష్ణగారికి ఈ విషయం తెలియజేయ వద్దని, ఆయనకు తెలిస్తే రెక్కలు కట్టుకొని అంత దూరం నుంచి భార్యా పిల్లలను వదిలి వచ్చేస్తారని భావించి తన అనారోగ్యాన్ని ఆయనకు తెలియజేయటానికి ఒప్పుకోలేదు. కుమారుడి భవిష్యత్తు, తన వల్ల నష్టపడరాదనీ, ఇప్పుడిప్పుడే కుదురుకొంటున్నారని ఆమె భావన. పాపం ఆయనకేమీ తెలీదు. అంతా అయిపోయిన తర్వాత తెలిసింది. ఆమె అస్తికలను ఆమెరికాలోని ohio నదిలో నిమజ్జనం చేసి మాతృ రుణాన్ని కన్నీరు

మున్నీరుగా విలిపిస్తూ భారమైన గుండెతో తీర్చుకొన్నారు గోపాలకృష్ణగారు. ఆమెకు డబ్బుకంటే మనిషికి శీలం, ఉత్తమ జీవన విధానాలకు అధిక ప్రాధాన్యాలనిచ్చేవారు. ఆదర్శ గృహిణిగా జీవితాన్ని గడిపిన సాధ్వి సౌభాగ్యమ్మగారు. అలాంటి సౌజన్యమూర్తి, మంత్రోపదేశం పొంది, అనుష్టించి జన్మను చరితార్థం చేసుకొన్న స్వర్గీయ శ్రీమతి మైనేని సౌభాగ్యమ్మగారికి ఈ "సిద్ధయోగి పుంగవులు" పుస్తకాన్ని అంకితమివ్వటం అత్యంత సమంజసం అని భావిస్తున్నాను.

**-గబ్బిట దుర్గాప్రసాద్**

అధ్యక్షులు-సరసభారతి

**"సిద్ధ యోగి పుంగవులు" రచనకు ఆధారం**

1. స్వర్గీయ ఆచార్య శ్రీ బిరుదు రాజు రామరాజుగారి – ఆంధ్రయోగులు
2. తెలుగు విజ్ఞాన సర్వస్వం
3. వివిధ మాస, దిన పత్రికల వ్యాసాలు.



# సరసభారతి ప్రగతి

**వి**ద్యార్థులకు, మహిళలకు సాహిత్యం చేరువవాలని, మన సంస్కృతీ వైభవాన్ని అందరికి అందించాలని భావించి 2009 నవంబర్‌లో "సరసభారతి" అనే సాహిత్య సాంస్కృతిక సంస్థను ఉయ్యూరులో ఏర్పాటు చేయటం జరిగింది. మూడేళ్ళు నిండి నాలుగవ ఏడాదిలోకి ప్రవేశించింది. ఇప్పటికి విభిన్నమైన 41 సమావేశాలను నిర్వహించాం. కళాశాల, పాఠశాల విద్యార్థులకు వందేళ్ళ తెలుగు కథపై అవగాహన సదస్సులు నిర్వహించాం.. పోటీలు నిర్వహించి బహుమతులందించాం. మహిళల కోసం మహిళా దినోత్సవాన్ని నిర్వహించాం. మూడు ఉగాదులకు కవి సమ్మేళనాలను నిర్వహించి జిల్లాలోని కవులందరినీ పాల్గొనేట్లు చేశాం. ఆ కవితలను పుస్తకాలుగా తీసుకొచ్చాం. సంగీత విభావరి, శ్రీ త్యాగరాజ ఆరాధనోత్సవాలు నిర్వహించాం. ధార్మిక ప్రసంగాలను ఏర్పాటు చేశాం. 2012 సంక్రాంతి సందర్భంగా "హాస్య కవి సమ్మేళనం"ను జరిపి, కొత్తదనాన్ని చూపించి, ఆ కవితలను అంతర్జాలంలో ఉంచి మరో అడుగు ముందుకు వేశాం. ఉగాది సందర్భంగా సాహిత్యంతోపాటు వివిధ రంగాలలో కృషి చేసిన వారిని ఎంపిక చేసి స్వర్గీయ శ్రీభవానీ మృత్యుంజయ శాస్త్రిగారల స్మారక పురస్కారాలనందజేసి, ఘనంగా సత్కరించాం. గురజాడ, రవీంద్రుల 150వ జయంతిని కళాశాలలో విద్యార్థుల కోసం ఘనంగా నిర్వహించాం. కళాశాల విద్యార్థులకు కథా రచనలో పోటీలు నిర్వహించి బహుమతులను పాఠశాల విద్యార్థులకు పద్యాలలో పోటీలు నిర్వహించి బహుమతులందించాం. వీటికి కవి కథా రచయిత్రి, వదాన్యులు, మా కార్యక్రమాలన్నిటిలోను తప్పకుండా పాల్గొనే శ్రీమతి కోపూరి పుష్పాదేవిగారు, లయన్స్ క్లబ్ అధ్యక్షులు శ్రీ కుటుంబరాజుగారు వంటి దాతలు గొప్పగా సహకరించారు. శ్రీ టి.వి.సత్యనారాయణ గారు రచించిన "శ్రీ క్రిష్ణ లీలామృతం" కథల పుస్తకాన్ని వారి అభ్యర్థన మేరకు సరస భారతి వేదికపై ఆవిష్కరింపజేశాం.

సరసభారతి సమావేశాలలో పాల్గొని వన్నె తెచ్చిన వారిలో విజయవాడ ఆకాశవాణి సంచాలకులు శ్రీ మంగళగిరి ఆదిత్య ప్రసాద్, ప్రయోక్త శ్రీ మాడుగుల రామకృష్ణ, మాజీమంత్రివర్యులు, ప్రస్తుత అధికార భాషాధ్యక్షులు శ్రీ మండలి బుద్ధప్రసాద్, శాసనమండలి సభ్యులు శ్రీ యలమంచిలి బాబు రాజేంద్ర ప్రసాద్, కృష్ణాజిల్లా రచయితల సంఘం అధ్యక్ష కార్యదర్శులు శ్రీ గుత్తికొండ సుబ్బారావు, శ్రీ జి.వి.పూర్ణచంద్, చినుకు సంపాదకులు శ్రీ నండూరి రాజగోపాల్, రమ్యభారతి సంపాదకులు శ్రీ చలపాక ప్రకాష్, ఆంధ్రభూమి బ్యూరో శ్రీ చలపతిరావు, స్టేట్ లీడర్ పత్రిక సంపాదకులు శ్రీ సర్వేపల్లి రామమూర్తి, సీనియర్ జర్నలిస్ట్ రచయిత్రి శ్రీమతి కే.బి.లక్ష్మి, బాల సాహిత్య చక్రవర్తి శ్రీ ముదునూరు వెంకటేశ్వరరావు, ప్రసిద్ధ ఆయుర్వేద వైద్యులు, పరిశోధకులు శ్రీ కోట నిత్యానంద శాస్త్రి, ప్రముఖ సంగీత విద్వాంసులు శ్రీమతి సింగరాజు కల్యాణి, శ్రీమతి కాళీపట్నపు ఉమ, శ్రీ బి.గోపాలరావు, ప్రసిద్ధ కవులు శ్రీ పువ్వాడ తిక్కన సోమయాజి, అవధాని శ్రీ పాలపర్తి శ్యామలానంద ప్రసాద్, శ్రీ వేలూరి కౌండిన్య, శ్రీ వసుధ, శ్రీ రావి రంగారావు, శ్రీ కొట్టి రామారావు, శ్రీ అరసవిల్లి కృష్ణ, శ్రీమతి శ్రీ ఉమామహేశ్వరి, శ్రీమతి బి.బాలాత్రిపురసుందరి, కథకులు స్వర్గీయ శ్రీ దొండపాటి దేవదాస్, స్వర్గీయ గంధం వేంకాస్వామి శర్మ, శ్రీమతి జి.మేరి కృపా బాయి, శ్రీమతి పద్మావతి శర్మ, శ్రీ బృందావనరావు, శ్రీ పొన్నాడ సత్యప్రకాష్, శ్రీ గంధం యాజ్ఞవల్క్య శర్మ సుప్రసిద్ధ విమర్శకులు శ్రీ గుమ్మా సాంబశివరావు, శ్రీ ద్వా.నా.శాస్త్రి, శ్రీ ఎర్రాప్రగడ రామకృష్ణ, ప్రసిద్ధ విమర్శకులు శ్రీ మడక సత్యనారాయణ, శ్రీమతి బెల్లంకొండ శివ కుమారి, శ్రీమతి యడవల్లి మనోరమ, శ్రీ మాదిరాజు రామలింగేశ్వరరావు, శ్రీ స్వర్ణరాజ హనుమంతరావు, బుద్ధ ఘోషుడు శ్రీ అన్నపరెడ్డి వెంకటేశ్వరరెడ్డి, ప్రముఖ హిందీ రచయిత శ్రీ వెన్నావల్లభరావు వంటి ఉద్దండులు ఎందరో వున్నారు. ఉయ్యూరు ఏ.జి.అండ్ ఎస్.జి.కాలేజి ప్రిన్సిపాల్ శ్రీశ్రీ బి.వి.రాయుడుగారు వారి కళాశాలలో మేం చేబట్టిన కార్యక్రమాలకు పూర్తి సహకారం అందించి, దిగ్విజయం చేయటానికి ఎంతగానో తోడ్పడ్డారు. వారి ఆత్మీయత మరువలేనిది.

సరసభారతి ప్రచురణ బాధ్యతను కూడా చేబట్టి ఇప్పటికి పది పుస్తకాలను



ప్రచురించి విశేష ఆదరాభిమానాలను పొందింది. మొదటి పుస్తకంగా స్వర్గీయ శ్రీ విద్వాన్ గబ్బిట మృత్యుంజయ శాస్త్రిగారి రచనలను “జ్యోతిస్సంశ్లేషణం”గా వెలువరించాం. శ్రీ వికృతి నామ సంవత్సర ఉగాది కవి సమ్మేళన కవితలను “మహా కవితా వసంతం”గా ప్రచురించాం. దీనిని ప్రఖ్యాతి విమర్శకులు స్వర్గీయ టి.ఎల్.కాంతారావుగారికి అంకితమిచ్చి అందరి అభినందనలు అందుకొన్నాం. శ్రీఖర నామ సంవత్సర ఉగాదికి “మా అక్కయ్య” శీర్షికతో కవి సమ్మేళనం నిర్వహించి ఆ కవితలను “మా అక్కయ్య” పేర పుస్తకంగా తెచ్చి, అక్కయ్యలందరికి అంకితమిచ్చి సంచలనం సృష్టించాం. అక్కయ్యమీద ఇంత వరకు కవి సమ్మేళనం జరుగలేదని, ఇది గొప్ప ప్రయత్నమని ప్రశంసలందుకొన్నాం. శ్రీ నందన ఉగాదికి అప్పటి విజయవాడ ఆకాశవాణి సంచాలకులు, కవి, మధుర గాయకులూ, పరిశోధనా తపస్వి, రేడియో ప్రచార సారధి శ్రీ మంగళగిరి ఆదిత్య ప్రసాద్‌గారి బహుముఖీన ప్రతిభా సామర్థ్యాలను వెల్లడించే ఉద్దేశ్యంతో “ఆదిత్య హృదయం” పేరిట లబ్ధ ప్రతిష్టులైన మహాకవులను ఎంపిక చేసి “పద్య కవితా సమ్మేళనం” నిర్వహించాం. అదే వేదికపై “స్నేహం” శీర్షికపై సుప్రసిద్ధ వచన కవులతో “వచన కవి సమ్మేళనం” చేబట్టి ఈ రెంటిని కలిపి “ఆదిత్య హృదయం” పేరుతో సంకలనం తెచ్చి శ్రీ ఆదిత్య ప్రసాద్‌గారికి అంకితమిచ్చి ఆ సంగీత సాహిత్య సరస్వతిని గౌరవించి, అందరిని అలరించాం. శ్రీ గబ్బిట కృష్ణ మోహన్ రాసిన “ఉయ్యూరు ఊసులు”ను పుస్తకంగా ముద్రించాం. సరసభారతి అధ్యక్షులు శ్రీ గబ్బిట దుర్గాప్రసాద్ రచించిన “ఆంధ్ర వేద శాస్త్ర విద్యాలంకారులు”, “జన వేమన”, “దర్శనీయ దేవాలయాలు”, “శ్రీ హనుమత్ కథా నిధి” అనే నాలుగు పుస్తకాలను ముద్రించి అందరికి అందజేశాం. ఇప్పుడు మీ చేతిలో ఉన్న “సిద్ధయోగి పుంగవులు” పుస్తక రచయిత కూడా శ్రీ దుర్గాప్రసాద్‌గారే. ఇది వారి అయిదవ పుస్తకం, మరియు సరసభారతి ముద్రించిన పదవ పుస్తకం.

సరసభారతి “అంతర్జాలం”లో కూడా రెండేళ్ళ క్రితం ప్రవేశించింది. “సరసభారతి”, “శ్రీ సువర్చలాంజనేయ” అనే రెండు “బ్లాగులను” అత్యంత జనామోదంగా నిర్వహిస్తోంది. వీటికి ఇప్పటికే సుమారు లక్షమందికి పైగా

వీక్షకులుండి, ఎంతో ప్రోత్సాహాన్ని, ప్రేరణను కల్పిస్తున్నారు. సభల ద్వారానే కాకుండా, అంతర్జాలం ద్వారా కూడా సరసభారతి సాహిత్య సాంస్కృతిక విషయాలందించి అందరిని ఆకర్షించి ప్రగతిపథంలో ముందుకు సాగుతోంది. ఎంతో మంది వితరణ శీలురు తమ ఔదార్యాన్ని చాటుతూ, పుస్తక ప్రచురణకు "స్పాన్సర్లు"గా ఉండటం వల్లనే ఇంత అభివృద్ధి సాధించగలిగాం. వారందరికి కృతజ్ఞతలు. "సిద్ధయోగి పుంగవులు" అనే ఈ పుస్తక ప్రచురణకు సరిపడ పూర్తి విరాళమిచ్చి "స్పాన్సర్"గా ఉన్నవారు ఉయ్యూరు వాసి, ప్రస్తుతం అమెరికాలో అలబామా రాష్ట్రంలోని హంట్స్ విల్ నివాసి, సౌజన్యమూర్తి, సరసభారతికి అత్యంత ఆప్తులు శ్రీ మైనేని గోపాలకృష్ణగారు. వారి వదాన్యతకు హృదయపూర్వక కృతజ్ఞతలు తెలుపుకొంటున్నాం. గోపాలకృష్ణగారి కోరిక మేరకు ఈ పుస్తకాన్ని వారి తల్లిగారు క్రీ.శ. శ్రీమతి మైనేని సౌభాగ్యమ్మగారికి అంకితమిస్తున్నాం.

మా గౌరవాధ్యక్షులు శ్రీమతి జోశ్యుల శ్యామలాదేవి గారు మాకు అందిస్తున్న సహకారం ఎన్నదగినది. మా కోశాధికారి శ్రీ గబ్బిట వెంకట రమణ, ఉపాధ్యక్షులు డాక్టర్ శ్రీ దేవి చిన్మయ, శ్రీ జి.వేణుగోపాల రెడ్డి, శ్రీ జి.రామనాథ బాబు, ముఖ్య కార్యకర్త శ్రీ ఎం.శ్రీనివాసశర్మ, శ్రీమతి సీతంరాజు మల్లికాంబ, శ్రీ కోనేరు రంగారావు, సాంకేతిక నిపుణులు శ్రీ వీరమాచనేని బాల గంగాధరరావు మొదలైన మా కార్యవర్గ సభ్యుల సేవ, అంకిత భావం వల్లనే మా కార్యక్రమాలు దిగ్విజయం సాధిస్తున్నాయి. "అక్షరం లోక రక్షకం", "తెలుగులో మాట్లాడటం మన జన్మ హక్కు" అన్న మా ఆశయాలు సత్ఫలితాలనిస్తున్నందుకు సంతోషంగా ఉంది. సభలకు అత్యంత ఆసక్తితో విచ్చేస్తున్న సాహితీప్రియుల ఆదరణ సరసభారతికి విజయానికి ముఖ్య కారణం. వారందరికి కృతజ్ఞతాభినందనలు. ఇక ముందు కూడా మీ అందరి అభిమానాన్ని సరసభారతి పొందుతుందని, మీ సహాయ సహకారాలు లభిస్తాయని భావిస్తూ... "ఎందరో మహానుభావులు – అందరికి వందనాలు".

**– మాదిరాజు శివలక్ష్మి**

కార్యదర్శి

సరసభారతి సాహిత్య సాంస్కృతిక సంస్థ – ఉయ్యూరు.



# విషయసూచిక

# ఖండ యోగి - మస్తాన్ వలి

"మస్తాన్ అంటే ఎప్పుడు దైవ చింతనలో ఉండే వాడు ఒక రకంగా దైవ మత్తుడు. అలాంటి వారిలో నల్ల మస్తాన్ అనే గుంటూరు జిల్లాకు చెందిన ఈయన ప్రసిద్ధుడు. ఆయన ఒక చోట ఎప్పుడు స్థిరంగా ఉండే వాడు కాదు. గుంటూరు జిల్లాలో సంగడి గుంటలో ఒకరు చిన్న పాక కట్టించి ఆయనకు ఇచ్చారు. ఆయన నడుము వాల్చి ఎన్నడూ పడుకొని ఉండటం ఎవరు చూడలేదు. అనుక్షణ సంచారి. ఒకసారి ఉరుములు మెరుపులతో వర్షం కురుస్తోంది. ఆయన దగ్గర ఎప్పుడు ఉండే మేక దూరంగా ఉంది. ఆయన ఒక చిన్న మునగ చెట్టు కింద ఉన్నాడు. ఆయన కూర్చున్న చోట తప్ప వర్షానికి తడవని ప్రదేశం లేదట. ఆయన మేక చచ్చి పడింది. దాని దగ్గరకు వెళ్లి భగవంతుణ్ణి ధ్యానించి "లే" అన్నాడు. అంతే లేచి కూర్చున్నది. ఈ మహిమ అందరికి పాకింది. వేరొక సారి ఆయన దగ్గరుండే కోడిని ఒకామె ఎత్తుకు పోయి చంపి కూర వండుకుని తినబోతోంది. దివ్య దృష్టితో ఆయన చూచి వాళ్ల ఇంటికి వెళ్లి మాంసపు ముద్దగా ఉన్న ఆ కోడిని "బోబో" అని పిలిచాడు. అది కోడి రూపం దాలిస్తే, ఆయన ఒళ్ళోకి తీసుకొని నిమిరారు. ఆమె కాళ్ళా వేళ్ళా పడి బతిమి లాడింది. కనికరించి శిష్యురాలిని చేసుకొన్నాడు.

వలీ గారు "ఖండ యోగ సిద్ధి" తెలిసిన వారు. అంటే ముక్కలు ముక్కలుగా ఉన్న శరీర భాగాల్ని సిద్ధితో మళ్ళీ యధా రూపంలోకి తేవటం. ఈ విద్య షిర్డీ సాయిబాబాకు, ఈయనకు, వాడరేవు లలితానంద సరస్వతి, మౌన స్వామి, చీరాల, కడప అవదూతలకు మాత్రమే ఉండేదట. ఒకసారి ఆయన యోగనిద్రలో ఉన్నారు. గ్రామ సమీపంలో ఒక పొలంలో ఆయన తల, మొండెం, కాళ్ళు, చేతులు చిన్నాభిన్నమై పడి ఉండటం రైతు గమనించి గ్రామంలో అందరికి ఏడుస్తూ చెప్పాడు. వాళ్ళంతా అక్కడికి చేరే సరికి వలీగారు పూర్తి రూపం పొంది చిదానందంగా ఉన్నారు. ఇంకోసారి ఒక వ్యాపారి కొట్టు ముందు కూర్చుని ఉన్నాడు వాలీ. కొట్టువాడికి విసుగెత్తి ఎన్నిసార్లు పొమ్మన్నా పోలేదు. వాడు కోపంతో ఊగిపోతూ కర్రపెట్టి ఆయన్ను బాది పారేశాడు. ఆయన శరీరం ముక్కలు ముక్కలై చెల్లాచెదురుగా పడిపోయింది. వ్యాపారే చంపాడని పోలీసులకు చెబితే అతన్ని అరెస్ట్ చేశారు. వలీగారు శరీర భాగాలను అన్నీ కలిపి ఆకృతి తెచ్చి స్మశానానికి తీసుకుపోతుంటే ఆయన లేచి కూర్చుని అందర్నీ ఆశ్చర్యంలో



ముంచేశాడు. వ్యాపారి తప్పేమీ లేదని ఒదిలించాడు.

వాలీగారికి సర్వజ్ఞత ఉంది. గుంటూరులో ఆయన ఉన్నప్పుడు పాపరాజు అనే జ్ఞానయోగి శిష్యుడు ఉన్నవ నందయ్య, గురువు ఆజ్ఞపై ఈయన ఉండే చోటుకు వచ్చాడు. ఆయన ధ్యానంలో ఉన్నాడు. ఒక పేదవాడు వలీగారు ఏదైనా డబ్బు ఇస్తాడేమోనని అక్కడికి వచ్చాడు. నందయ్యను చూసి అతని జేబులో ఉన్న పావలాను బిచ్చగాడికిమ్మన్నాడు. నందయ్య నోరు తెలిచాడు అంతే అతని జేబులో వుంది. అతన్ని పాపరాజు పంపాడు కదా అని అడిగాడు. అవునన్నాడు. అప్పుడు పాపరాజు గొప్పతనాన్ని వలీగారు చెప్పారు. పాపరాజు గారింట్లో తద్దినం రోజున భక్తులు తినక ముందే, తనకు అన్నం పెట్టిన సంస్కారి అన్నారు. గుంటూరు వాడొకడు కాశీ వెళ్లి గంగా స్నానం, విశ్వనాథ సందర్శనం చేసి ఒక పెద్ద మసీదు దగ్గరకు వచ్చాడు. అక్కడ ఉన్న ముసలాయన అతనిది గుంటూరు కదా అని అడిగి ఆశ్చర్యపరచాడు. గుంటూరులోని తన మిత్రుడు వలీ బాగున్నాడా అని అడిగాడు. వలీని చూసి రెండు వందల ఏళ్ళు అయిందని చెప్పాడు. ఇంటికి తిరిగి వచ్చి వలీగారికి ఈ విషయం చెప్పాడు ఆ యాత్రికుడు. కాశీలో తన మిత్రుడు కన్పించాడా? అని అడిగారు వలీ. అతడు "చూశాను" అన్నాడు. అతన్ని చూసి రెండు వందల ఏళ్లు అయిందన్నారు వలీ. వారిద్దరి సర్వజ్ఞత్వానికి యాత్రికుడు ఆశ్చర్యపోయి కాళ్ళమీద పడ్డాడు.

వలీగారు నిగ్రహం, అనుగ్రహం కలవారు. ఒక ముస్లిం యువకుడు ఈయన పోకడను పిచ్చిగా భావించి "పిచ్చోడు పిచ్చోడు" అంటూ గేలి చేసేవాడు. ఈయన నవ్వుకొనేవాడు. కొంత కాలానికి ఆ కుర్రాడే పిచ్చివాడయిపోయాడు. తల్లిదండ్రులు వాడిని తీసుకొచ్చి ఈయన కాళ్ళమీద పడేశారు. దయతో అతని తల నిమిరారు. అంతే మామూలు మనిషి అయ్యాడు వాడు. ఒకసారి బెజవాడలో కొందరు ముస్లిం పెద్దలు మాట్లాడుకొంటుండగా వలీగారు అక్కడికి వచ్చి తన చేతిలో ఉన్న బుట్టను అక్కడ పెట్టి, తాను మక్కా వెళ్లి తిరిగి వచ్చేదాకా దాన్ని చూస్తుండమని చెప్పి వెళ్ళిపోయారు. వారు పిచ్చేమో అనుకొన్నారు. రెండు గంటల తర్వాతా వచ్చి మక్కా విశేషాలన్ని చెప్పి తన దారి పట్టారు. ఇదంతా "గాస్" అనుకొని అక్కడ మక్కాలో ఉన్న తమ వారికి తంతి పంపారు. వారు యాత్ర బానే జరిగిందని వాలీగారు కూడా వచ్చివెళ్ళారని చెప్పారట. ఆయన మహమ్మద్ ప్రవక్త అవతారం అని అందరు గ్రహించారట.

వినుకొండ మహిళ ఒకామె సంతానం కోసం వలీగారిని ప్రార్థించింది. మగబిడ్డ పుడతాడని చెప్పి పంపాడు. మగబిడడ్డను కని, రెండు నెలల తర్వాత వలీగారి ఆశీర్వాదం కోసం బయల్దేరింది. వినుకొండ రైలు స్టేషన్‌లోనే వలీగారి దర్శనం అయింది. ఆమె కృతజ్ఞతలు చెప్పుకొంది. వలీగారు ఆమెను గుంటూరు వెళ్ళమని అక్కడ పెద్ద ఉత్సవం జరుగుతోందని చెప్పి పంపారు. గుంటూరు చేరేసరికే ఆ ఉదయమే మస్తాన్ వలీగారు

చనిపోయిన వార్త విన్నది. రెండు గంటల క్రితం తాను సజీవ మస్తాన్ వలీని చూసింది. అప్పుడు అర్థమయింది ఆమెకు చనిపోయిన తర్వాతా కూడా భక్తులకు ఇతర చోట్ల దర్శనం ఇస్తున్నారని. ఆయన తాను చనిపోయే రోజును ముందుగానే ప్రకటించి తన శిష్యుడు మదారు సాహెబ్ కాళ్ళు పిసుకుతుండగా అనుకున్న సమయానికి దేహ యాత్ర చాలించారు. వేలాది జనం చేరారు. ఆయన తన ఖననాన్ని పిచ్చయ్య గారిచ్చిన స్థలంలో చేసే ఏర్పాటు కూడా చేసుకొన్నారు. ఆరోగ్య అధికారి నగరంలో సమాధి చేయటానికి ఒప్పుకోలేదు. సాయంత్రం అవుతోంది. అంత్యక్రియలు చూసి ఇళ్లకు వెళ్లాలని అందరి ఆత్రం... ఇంతలో ఆ అధికారికి తీవ్రమైన కడుపు నొప్పి వచ్చి గిలగిల తన్నుకొంటున్నాడు. జ్ఞానోదయమైంది. వెంటనే ఒప్పుకొన్నాడు. కడుపు నొప్పి తగ్గింది. ఆయన సమాధి హిందూ ముస్లిం లందరికి పవిత్ర దర్గాయే.

ఆయన ప్రాచుర్యం ఎంత గొప్పది అంటే గుంటూరు జిల్లాలో హిందువులు తమ పిల్లలకు మస్తానయ్య, మస్తానమ్మ అని పేరు పెట్టుకొంటారు. వలీగారు సుమారు 1685 ప్రాంతంలో జన్మించినట్లు భావిస్తారు. మరణం మాత్రం 23-5-1895 అంటే సుమారు రెండు వందల పది సంవత్సరాలు జీవించారని భావన. ఆయన్ను గుంటూరులో మొదట చూసిన వారందరికి ఎనభై ఏళ్ళవాడుగానే కన్పించటం విశేషం. అలాగే చివరి దాకా ఉన్నారు. ఎన్నో ఏళ్లు తపస్సు చేసి సిద్ధులు పొంది, అప్పుడు గుంటూరు వచ్చారన్న మాట. ❀





# అవధూత దొంతులమ్మ

ఏరుల పుట్టుక, యోగుల పుట్టుక ఎవరికి తెలియదని సామెత. ఆమె నర్మదా నదీ తీరాన ఉండే బంజారా మహిళ. ఎలా వచ్చిందో కృష్ణాజిల్లా మచిలీపట్నం చేరింది అరవై ఏళ్ల వయసుతో. ఆమె నెత్తిమీద నీళ్ళ కుండల్ని దొంతరలుగా పెట్టుకొని మోస్తుండేది. అందుకని ఆమెను "దొంతులమ్మ" అన్నారు బందరు జనం. అదే ఆమె పేరు అయిపోయింది. ఒక యోగి ఆమెకు దర్శనం ఇచ్చి సంసార బంధాలను వదిలేయమని ఆదేశిస్తే, భర్త అనుమతితో, ఇల్లు వదిలి వచ్చేసింది. దీక్షనిచ్చి పంపాడు యోగి. ఆమె అవధూతగా మారి ఎంతో దూరం నడిచి శ్రీశైలం చేరింది. దిగంబరంగా తిరిగేది. బాహ్య స్పృహ ఉండేది కాదు. నిరంతరం సమాధి స్థితిలో ఉండేది.

నెమ్మదిగా బందరు చేరి, మొదట కుమ్మరి వీధిలో తర్వాత, జగన్నాథపురంలో ఉన్నది. ఆమెను కర్రతో కొట్టబోయిన వాడి చేయి చచ్చుబడింది. ఆమె కాళ్ళమీద పడితే అనుగ్రహంతో చేయి మళ్ళీ పనిచేసింది. ఒకసారి ఒక లాయర్‌గారి వీధి అరుగుపై కూర్చొని ఉండగా, ఆయన పిచ్చికోపంతో ఆమె దగ్గరుండే బట్టల మూటను కాలితో తన్నాడు. ఆమె నవ్వుతు వెళ్ళిపోయింది. ఆ లాయర్ కాలు మంటలు, పోట్లకు గురై గిలగిలలాడాడు. ఇలా క్రమంగా ఆమె మహిమలు వ్యాప్తి చెందాయి. ఇంకోసారి చల్ల పల్లికి చెందిన ముగ్గురు ఆడవాళ్ళు బట్టల వ్యాపారం కోసం బందరు వచ్చి, బెజవాడ రోడ్డు పక్క ఉన్న వీధి అరుగుమీద కూర్చున్నారు. ఆ పక్కనే దొంతులమ్మ పిచ్చి గుడ్డల మూటతో కూర్చుని ఉంది. అర్ధరాత్రి సమయం. ఆమె తమను ఏమి చేస్తుందోనని వారు భయపడ్డారు. ఇంతలో ఆమె కళ్ళ నుండి సూర్యకిరణాలలాగా మెరుపులు వచ్చాయి. ఆ ముగ్గురికి ఆశ్చర్యం కలిగి, భక్తితో ఆమె శిష్యులయ్యారు. ఆమె వారిని దగ్గరకు పిల్చి, కారం ముద్ద తీసి, వారి నోటికి అందించింది. అది తీపి పదార్థంగా మారి మధురంగా ఉందట. బందరు వచ్చినప్పుడల్లా తనను కలిసి వెళ్ళమని చెప్పి పంపింది.

గుంటూరు జిల్లా మంగళగిరి నుంచి బందరులో స్థిరపడ్డ వలివేటి పేరయ్య ఆమె మహిమలను గమనించాడు. ఆమె మిరపకాయలు, ఉల్లిపాయలు, ఉప్పు తన గోనె సంచి కింద దాచి ప్రసాదంగా పెట్టేది. అవి అతి మధురాలయ్యేవి. ఆమె యే కొట్టు దగ్గర నిలబడితే ఆ కొట్టు ఆరోజు విపరీతంగా లాభాలు గడించటం అందరికి అనుభవం. బ్రతిమాలి రప్పించుకొనేవారు. సర్కిల్‌పేటలో చోడవరపు సుబ్బమ్మ అనే వితంతువు దత్త పుత్రుడు అమ్మ చెప్పినట్లే చనిపోయాడు. ఈ విషయం ఆమెకు చెప్పటానికి వెళ్తే అమ్మ మంద్ర గబ్బలమీద కూర్చున్న దృశ్యం చూసి చకితురాలై ఆమె మహిమ అపరిమితం అని గ్రహించింది. ఆమెకు దత్త పుత్రుని మరణంతో పరీక్షించి వైరాగ్యం బోధించి శిష్యురాలిని చేసుకొన్నది. వేమూరి అచ్చయ్య అనే ఆయనతో ఉపదేశం ఇప్పించింది.

ఒకాయన ఉపదేశం కోసం వస్తే, అర్ధరాత్రి శ్మశానానికి రమ్మన్నది. అతడు అలానే వెళ్లాడు. ఆమె పెద్ద పులి రూపంలో కనిపించి భయపెట్టింది. ఆయన పారిపోయాడని తెలుస్తోంది. పరీక్షించకుండా ఎవరికి దీక్షనిచ్చేది కాదు. చెరకూరి పద్మనాభ ప్రసాద్ బహోద్దర్ పక్షవాతంతో కుడికాలు చచ్చుపడింది. ఆ కుటుంబం అమ్మ దగ్గరకు వచ్చి శరణు వేడింది. అమ్మ తన కాలును అతని కాలుతో గుడ్డ పీలికతో కట్టింది. కాసేపు అయిన తర్వాత ఆయన పక్షవాతం మాయమైంది. అప్పట్నించి ఆ కుటుంబానికి ఆమె రక్ష. వాళ్లకు ఒక కూతురుండేది. ఆమెను అమ్మ "రాణీ" అని సంబోధించేది. ఆమెను చల్లపల్లి జమీందార్ యార్ల గడ్డ శివరామ ప్రసాద్ బహోద్దర్ గారికి ఇచ్చి వివాహం చేయాలని పద్మనాభ ప్రసాద్‌గారు భావించారు. కాని రాజా గారికి చేసుకోవటం ఇష్టంలేదు. కాని అమ్మ ధైర్యం చెప్పింది. ఈ పిల్లను మర్నాడే ముక్త్యాల జమీందార్ దత్తత తీసుకొని చల్లపల్లి రాజాగారికిచ్చి వివాహం చేశారు. చల్లపల్లి కోటలో దొంతులమ్మ అమ్మవారికి ఘన సన్మానం చేశారు.

కారుమూరి కృష్ణమూర్తి అనే ఆయన అమ్మ దగ్గర దీక్ష కోసం వచ్చాడు. ఆయన రామ తారక మంత్రాన్ని 25 లక్షలసార్లు, బాల మంత్రాన్ని ఏడు లక్షలసార్లు, ప్రసన్నాంజనేయ మంత్రాన్ని నాలుగు లక్షల సార్లు జపించిన మహా పురుషుడు. అనేక సమారాధనలు, అన్న సంతర్పణలు చేసిన కర్మిష్టి... చీమల కోసం అయిదు మణుగుల పంచదారను పోసిన భూత దయా పరుడు. అమ్మ అనుగ్రహం పొంది ఉపదేశం పొంది శిష్యుడై ఆమె తల పెట్టిన అనేక సత్కార్యాలు నిర్వహించిన ఘనుడు కృష్ణమూర్తి. బాబా మస్తాన్ అనే మహనీయుడు అమ్మతో అర్ధరాత్రి దాకా తత్వ విచారణ చేసేవాడు. జొన్నవిత్తుల శేషగిరిరావు అనే సంగీత కళాకారుడు, నటుడు గురువు దండిస్తాడని భయపడి అమ్మ పంచ చేరాడు. ఆమె అతన్ని మహా విద్వాంసుడిని చేసింది. కుర్తాళం సిద్దేశ్వర పీఠానికి అధిపతి అయిన కానుకొల్లు త్రివిక్రమ రావుగారు అమ్మ వద్ద జ్ఞాన భిక్ష పొంది, ఆ తర్వాత సన్యసించి ఆ పీఠాధిపతి అయ్యారు. ఆయనే విశ్వనాథ గారికి గురువు కూడా. మనశ్శాంతి లేనివారు అమ్మను దర్శిస్తే, చల్లని చూపుతో మానసిక ప్రశాంతత నిచ్చేది అని గ్రంథాలు తెలియజేస్తున్నాయి. ఆమె ఎప్పుడూ "వికల్ప సమాధి"లో ఉండేదని ప్రత్యక్ష సాక్షులు చెప్పారు. అంటే మనస్సుకు ఆత్మ శక్తి స్వరూప అవస్థ కలగటం చేత సమాధి స్తితిలో వికల్పాలు నస్టపోకుండా, చిత్తాన్ని బ్రహ్మలో లయం చేసి కేవల పరబ్రహ్మలో నిలిపి ఉంచటం అన్న మాట.

దొంతులమ్మ అనుగ్రహాన్ని పొందిన వారిలో దాలిపర్తి పిచ్చిహరి, యడ్లవల్లి నాగేశ్వరరావు, క్రోవిసత్యనారాయణ, కోకా అహోబల రావు, మొదలైన ప్రముఖులున్నారు. ఆమె 9-2-1932 రాత్రి పదకొండున్నరకు దేహాన్ని చాలించింది. ఆమె జననం 1807గా భావిస్తారు. దొంతులమ్మ ఉత్సవాలు బందరులో ఘనంగా నిర్వహిస్తారు. మాఘమాసలో పదకొండు రోజులు ఆరాధనా ఉత్సవాలు ఘనంగా జరుగుతుఆయి. ఆమె విగ్రహం లంబాడి దుస్తులతో అలంకరించి ఉంటుంది. జీవితం చాలించినా సమాధి నుండి భక్తుల కోర్కెలు తీరుస్తుందనే నమ్మకం ఉంది.❁





# కుంభక యోగి - త్రైలింగ స్వామి

పుట్టింది తెలుగు దేశంలో అయినా, ఆయన గడిపిన కాలమంతా కాశీలోనే. ఆయన చూపించిన మహిమలు అపారం. వారు పొందిన సిద్దులనేకం. వారి దివ్య విభూతి అనంతం. ఆయనే త్రైలింగ స్వామి. అసలు పేరు శివరామయ్య. విశాఖపట్నం జిల్లా విజయనగరం దగ్గరలో హోలియా గ్రామంలో జన్మించారు. తండ్రి నరసింహారావు, తల్లి విద్యావతి, సంపన్న బ్రాహ్మణ కుటుంబం. ఆయన జననం 19-12-1607. తల్లి పూజ చేసుకొంటుంటే శవలింగం నుంచి వింత కాంతి ఈ బాలుడిమీద పడటం ఆమె చూసి యోగ్యుడవుతాడు అనుకొన్నారు. చిన్నప్పటి నుంచి ఐహిక వాంఛల మీద కోరిక లేదు. నలభై ఏళ్ళకు తండ్రి, యాభై రెండో ఏట తల్లి చనిపోయారు. స్మశానాన్నే ఇల్లుగా చేసుకొని ఆస్తిని అంతా సవతి తమ్ముడు శ్రీధరుడికి ఇచ్చేసి, అక్కడే ఇంకో ఇరవై ఏళ్ళు గడిపాడు.

స్వగ్రామం వదిలి పాటియాలా సంస్థానంలో బస్తర్ చేరాడు. అక్కడ భాగీరధి స్వామితో పుష్కర తీర్ధానికి వెళ్ళాడు. ఆయన దీక్షను ఇచ్చి గణపతి స్వామి అనే దీక్షా నామం ఇచ్చాడు. అప్పటికి అయ్యగారి వయస్సు డబ్భై ఎనిమిది. గురు సమక్షంలో పదేళ్ళ సాధన చేసి, అద్భుత శక్తుల్ని సంపాదించుకొన్నాడు. గురువు మరణించిన తర్వాత తీర్ధ యాత్రలు చేస్తూ రామేశ్వరం చేరాడు. అక్కడ స్వంత ఊరివారు కనిపించి ఇంటికి రమ్మని కోరినా వెళ్ళలేదు. రామేశ్వరంలో ఒక బ్రాహ్మణ బాలుడు చనిపోతే శవాన్ని తీసుకొని వెళ్తూ తలిదండ్రులు విలపిస్తుంటే, గుండె కరిగి కమండలంలోని నీరు వాడిమీద చల్లాడు. వెంటనే బాలుడు బ్రతికి అందర్నీ ఆశ్చర్యపరచాడు. ఆయన మహత్తు అందరికి తెలిసి సాక్షాత్తు శ్రీరామ లింగేశ్వరుడే గణపతి స్వామి అనుకొన్నారందరూ. అక్కడి నుండి నేపాల్ చేరాడు. అక్కడ అడవిలో తపస్సు చేస్తుంటే ఒక పులి వచ్చి ఆయనకు ఎదురుగుండా కదలకుండా కూచునిపోయింది. రాజుగారి బంధువు ఈ దృశ్యాన్ని చూసి చకితుడైనాడు. పులిని చంపటానికి ప్రయత్నిస్తే వారించాడు. ఆయన రాజుకు ఈ విషయం చెప్పాడు. నేపాల్ రాజు వచ్చి సాష్టాంగ పడి అనేక కానుకలిస్తే, తీసుకోకుండా జంతు హింస చేయవద్దని హితవు చెప్పాడు స్వామి. అక్కడి నుంచి టిబెట్, తరువాత మానస సరోవరం సందర్శించి, దారిలో ఎన్నో అద్భుతాలను చూపి, హిమాలయాలలో చాలా కాలం తపస్సు చేసే నర్మదా నదీ తీరంలో, మార్కండేయ ఆశ్రమంలో "ఖఖీ బాబా" అనే అహోరాత్రాలు తపస్సు చేసే యోగిని దర్శించాడు. ఒకరోజు తెల్లవారు జామున నర్మదా నదిలో పాలు ప్రవహిస్తున్నట్లు, ఈ స్వామి దాన్ని తాగుతున్నట్లు ఖఖీ బాబా చూశారు. గణపతిలోని మహిమేమిటో గ్రహించారు. విషయం

తెలిస్తే ఆయన ఒక అక్కడ ఉండరు.

1733లో ప్రయాగ చేరారు. తపో నిష్టలో ఉండగా ఒకసారి కుంభ వృష్టి కురుస్తోంటే శిష్యుడు రామ తరణ భట్టాచార్య ఆశ్రమంలోకి పోదామని చెప్పినా కదలలేదు. దూరంలో ఒక పడవ మునిగిపోతోందని దాన్ని రక్షించాలని సంజ్ఞ చేశారు. అతడు అక్కడికి వెళ్ళే లోపున పడవ మునుగుతుంటే దిగంబర స్వామి అక్కడ పడవ మీద చేరి దాన్ని రక్షించాడు. శిష్యుడు ఆశ్చర్యం ప్రకటించగా ప్రతి వాడిలోను మహాశక్తులు అజ్ఞాతంగా ఉంటాయని వాటిని గుర్తించే వారు తక్కువ అని తెలిపారు.

1737లో కాశీ చేరారు దిగంబర గణపతి స్వామి. అప్పటికి ఆయనకు 130 ఏళ్ళు. కాశీలో 150 యేళ్ళు గడిపారు. ఆయనది 300 పౌన్ల బరువైన భారీ విగ్రహం. గడ్డాలు, మీసాలు పెరిగి దీర్ఘ శరీరంతో దిశ మొలతో, మెడలో పెద్ద రుద్రాక్ష మాలతో, పెద్దబాన పొట్టతో కాశీ నగర వీధుల్లో సంచరించేవాడు. గంటలసేపు గంగా జలంపై పద్మాసనంలో తేలి ఉండేవాడు. అలాగే గంటల కొద్దీ కాలం నదీ గర్భంలో మునిగి ఉండేవాడు. అంటే కుంభక విద్యలో అద్భుతమైన నేర్పు ఉండేదన్న మాట... కుష్టు రోగులకు సేవ చేసి వారిని ఆదరించాడు బాబా. వేద వ్యాస ఆశ్రమం చేరి, అక్కడ సీతానాథా బంధ్యోపాధ్యాయుని క్షయ వ్యాధి పోగొట్టి, హనుమాన్ ఘాట్ చేరాడు. ఒక మహారాష్ట్ర స్త్రీ రోజు విశ్వేశ్వరుడి అభిషేకం చేసి వస్తు ఈ దిగంబర స్వామిని రోజు చూస్తూ ఏవగించుకొనేది. ఆమె భర్తకు రాచ పుండు. ఆమెకు అందరు దిగంబర స్వామిని అర్థించమని కోరారు. కానీ తాను తూల నాడిన ఆయన దగ్గరకు వెళ్ళటానికి సందేహించింది. చివరికి వెళ్లి కాళ్ళమీద పడింది. ఆయన ఇచ్చిన విభూతితో జబ్బు మాయమైంది.

కాశీ మహానగరంలో ఎందరో తెలుగువారు ఉపాధ్యాయులుగా, అధ్యాపకులుగా ఉన్నారు. వారు ఈ దిగంబర స్వామి తెలుగు వాడని గుర్తించారు. ఆయనకు "త్రైలింగ స్వామి" అనే పేరు పెట్టారు. తెలుగు దేశం అంటే త్రిలింగ దేశమే కదా. అప్పటి నుంచి ఆ పేరే స్థిరపడిపోయింది. 1800లో తన మకాంను దశాశ్వ మేధ ఘాట్ నుండి బిందు మాధవంకు మార్చారు. ఎప్పుడూ మౌనమే, ధ్యానమే, తపస్సు, యోగ సమాధే. కనుకే ఆయన్ను "మౌన బాబా" అన్నారు. కాశీరాజు వీరిని తన పడవలోకి ఆహ్వానిస్తే వెళ్ళారు. రాజు బ్రిటిష్ వారు బహుమతిగా ఇచ్చిన కత్తిని స్వామి చూడాలని ముచ్చటపడితే ఇచ్చారు. అది పొరపాటున గంగలో జారిపడిపోయింది. రాజుకు కోపం వచ్చి తిట్టాడు. స్వామి తన చెయ్యి గంగా నదిలో పెట్టి ఒకే రకంగా ఉండే రెండు కత్తులను తీసి అందులో రాజుదేదో గుర్తించి తీసుకోమన్నాడు. రాజు గుర్తించ లేకపోతే తానె గుర్తించి చెప్పి ఇచ్చాడు. రెండోదాన్ని గంగలోకి విసిరేశారు స్వామి.

దిగంబరంగా తిరగటం కొంతమందికి నచ్చక కేసు పెట్టరు. కోర్టులో కేసు నడిచింది. ఆయన్ను బంధించి తీసుకొని రమ్మని మేజిస్ట్రేట్ ఆర్డర్ వుశాడు. అలాగే



తెచ్చారు. ఈయన మహిమలను అధికారులు ఆయనకు వివరించారు. ఆయన తాను తినే మాంసం స్వామి తింటే శిక్షించను అన్నాడు అన్నాడు. స్వామి సైగలతో తాను తినే దాన్ని మేజిస్ట్రేట్ తింటారా అని ప్రశ్నించాడు. వెంటనే తన చేతిలో మల విసర్జన చేసుకొని నోట్లో వేసుకొని తినేశారు. మతి పోయింది మేజిస్ట్రేట్‌కు. అయితే సుగంధ పరిమళం కోర్టు అంతా వ్యాపించింది. స్వామి మహిమ తెలిసి దిగంబరంగా తిరిగే హక్కు ఇచ్చాడు. ఒకసారి ఒక ఆకతాయి ఆయన బజారులో వెళ్తుంటే మర్మాంగాన్ని గుంజాడు. అది కొన్ని గజాలు సాగింది. వాడు భయపడి పారిపోయాడు. దుండగులు కొందరు సున్నపు తేట ఇచ్చి పాలు అని చెప్పారు. శుభ్రంగా తాగేశాడు స్వామి. వెంటనే మూత్ర రూపంలో దాన్ని అంతట్నీ విసర్జించాడు.

శ్రీరామ కృష్ణ పరమహంస 1868లో కాశీ వచ్చినప్పుడు తన మేనల్లుడు హృదయనాథ్‌తో కలిసి మౌనస్వామిని దర్శించారు. ఆయనకు బాబా నశ్యం వేసుకొనే కాయ కానుకగా ఇచ్చారు. స్వామిని "నడయాడే విశ్వనాథుడు" అని చెప్పారట పరమ హంస. ఇంకోసారి అర్థమణుగు పాయసం వండించి తీసుకొని వెళ్లి స్వామికి అందించి తినిపించారట. పరమ హంస స్వామిని "ఈశ్వరుడు ఏకమా అనేకమా" అని ప్రశ్నిస్తే – సమాధి స్తితిలో ఏకం అనీ, వ్యావహారిక దృష్టిలో అనేకం అని సైగలతో చెప్పారు స్వామి. పరమ హంస, స్వామిని తన ఆశ్రమానికి ఆహ్వానించి సత్కరించారు. ఇద్దరూ మహా పురుషులే. పరమ హంసలే ఒకరి విషయం రెండో వారికి తెలుసు. ఎన్నో అద్భుతాలు చేసిన రామ కృష్ణులు స్వామిని అంతగా గౌరవించారంటే బాబా ఎంత మహిమాన్వితుడో తెలుస్తోంది. ఒకసారి రాజ ఘాట్ నుండి విద్యానంద స్వామి అనే యతి వీరిని దర్శించటానికి కేదార్ ఘాట్‌లో ఉన్న మన స్వామి దగ్గరకు వచ్చారు. ఇద్దరు గాఢంగా ఆలింగనం చేసుకొన్నారు. కాసేపట్లో అందరు చూస్తుండగానే ఇద్దరు మాయమైనారు. అరగంట తర్వాత స్వామి తిరిగి వచ్చారు. తాను ఆయన్ను రాజ ఘాట్‌లో దింపి వచ్చాను అని స్వామి అందరి సందేహాల్ని తీర్చారు.

పంచ గంగా ఘట్టంలో చిన్న భూగృహం నిర్మింపజేసుకొని 32 ఏళ్ళు సేవ చేసి, ఆయన విగ్రహాన్ని చేయించాలని రెండు నెలల గడువు కావాలని కోరితే, మరణాన్ని వాయిదా వేసుకొని, భక్తుడైన మంగళదాస్ కోర్కె తీర్చి భూగృహం చేరి ఉదయం ఎనిమిది నుండి మధ్యాహ్నం మూడు వరకు యోగ సమాధిలో ఉండి, తానే బయటకు వచ్చి భక్తుల హారతులు అందుకొని యోగాసనంలో కూర్చుండి, బ్రహ్మ రంధ్రాన్ని ఛేదించుకొని 26-12-1887న సర్వజిత్ సంవత్సర పుష్య శుద్ధ ఏకాదశి సోమవారం త్రైలింగ స్వామి తమ ఇహ జీవితాన్ని చాలించు కొన్నారు. ఆయన శరీరాన్ని చెక్కపెట్టెలో పెట్టి ఆయన కోరిన విధంగానే తాళం వేసి అసి నది నుండి వరుణ నది దాక ఊరేగించి గంగా నదీ ప్రవాహంలో వదిలారు. ఆ రోజు నుండి ఈ రోజు వరకు కాశీ విశ్వేశ్వరునికి ఎలా నిత్యం అభిషేకం, పూజా జరుగుతాయో స్వామి విగ్రహానికి కూడా కేదార్ ఘాట్‌లోని

మతంలో జరగటం విశేషం. పతంజలి యోగంలో విభూతి పాదంలో చెప్పిన అణిమాది అష్ట సిద్ధులు, కుంభక యోగంలో త్రైలింగ స్వామి సిద్ధింప జేసుకున్నారు. ఆయన సంస్కృతంలో రాసిన "మహా వాక్య రత్నావళి"కి వ్యాఖ్యను బెంగాలిలో రాశారు. కాని మన తెలుగు వారి దృష్టి ఇంకా దానిపై పడకపోవటం విచారకరం అంటారు బాధతో రామరాజు గారు. 280 సంవత్సరాలు జీవించి, స్వచ్ఛంద మరణాన్ని పొంది, యోగ సిద్ధులలో త్రివిక్రములై ఆశ్రిత జన కల్పవృక్షమై మౌన ముద్రాలన్కారులై తెలుగువారై ఉండి ఉత్తర దేశంలో, అందులోను కాశీ మహా క్షేత్రంలో బ్రహ్మ రథం పట్టించుకొన్న త్రైలింగ యోగి నామ ఉచ్ఛారణ చాలు మనం తరించటానికి.❁





# పూర్ణ యోగి సంత్ జ్ఞానేశ్వర్

మహాత్ముల మహిమలను మనం అర్థం చేసుకోవటం కష్టం. దున్నపోతుతో వేదాన్ని పలికించిన మహా యోగిపుంగవుడు జ్ఞానేశ్వరుడు. వారిని గురించి తెలుసుకోవటం మన అదృష్టం. భారతదేశం భక్తులకు పుట్టినిల్లు. అందులో మహారాష్ట్ర దేశంలో అనన్య భక్తి సామ్రాట్టులున్నారు. జ్ఞానదేవుడు, నామదేవుడు, పుండరీకుడు మొదలైన భక్తులంతా తమ భక్తి వైభవంతో పండరినాథుడైన పాండురంగ విఠలుని సన్నిధిలో మెలగి, సాక్షాత్కారం పొంది ఆయన్ను చేరిన వారే. వీరందరిలో జ్ఞానదేవుడు మిన్న అంటారు. సుమార 740 సంవత్సరాల క్రిందటివాడు సంత జ్ఞానేశ్వర్. పైఠాన్ ప్రాంతంలోని గోదావరి నది ఒడ్డున "ఆపే గాం" నివాసి. చిన్నతనంలోనే వేద శాస్త్రాలను క్షుణ్ణంగా అభ్యశించి మహాజ్ఞానిగా పేరుపొందాడు. అతని అన్న నివృత్తి నాథుడు, తమ్ముడు సోపాన దేవుడు, చెల్లెలు ముక్తా బాయి. వీరి తండ్రి గారు వీరి పేర్లను ముక్తికి మార్గంగా వరుస క్రమంలో పెట్టటం విశేషం. వీరందరూ అలానే జీవించి, నామ సార్థకతను సాధించారు.

జ్ఞాన దేవుని గురువు అన్నగారైన నివృత్తి నాధుడే ఆయన అనుగ్రహంతోనే పదిహేనేళ్ళ వయసుకే భగవద్గీతకు అద్భుతమైన "జ్ఞానేశ్వరీ గీత" అనే వ్యాఖ్యానం రాశాడు జ్ఞాన దేవుడు. దానికి సాటి ఇప్పటివరకు ఇంకొకటి లేదు అని పేరు వచ్చింది. కుల మత భేదాలకు అతీతంగా ఉండాలని బోధించాడు. ఈశ్వర భక్తి వల్లనే శుద్ధ జ్ఞానం కలుగుతుందని గట్టిగా ప్రవచించాడు. మానవనికి మోక్ష మార్గం బోధించగలిగేది గీత మాత్రమేనని ఢంకా బజాయించి చెప్పాడు. గీతను యే భేదం లేకుండా అందరు చదవ వచ్చునని, తెలియ జేశాడు. జ్ఞాన దేవుడడు, ఆయన సోదరులిద్దరూ, సోదరి అందరు బ్రహ్మ జీవితాన్నే గడపటం ఆశ్చర్యమేస్తుంది. దేశంలోని ప్రసిద్ధ పుణ్యక్షేత్రాలన్నీ వీరు సందర్శించారు.

"నేను జ్ఞాన దేవుడిని. అన్ని ఆగమాలు తెలిసిన వాడిని" అని జ్ఞాన దేవుడు చెప్పుకొన్నాడు. అది గర్వం కాదు. ఆతని ధిషణ, అంత గొప్పది. వైష్ణవ మతాన్ని మహారాష్ట్ర దేశమంతా వ్యాపింపజేసిన కుటుంబం వారిది. "అమ్రుతానుభవం" అనే గ్రంథాన్ని, యోగవాశిష్టానికి మరాఠీ భాషలో అర్థ తాత్పర్యాలను రాసినవాడు జ్ఞానేశ్వరుడు. "అభంగాలు" అనే పేరుతో వందలాది పద్యాలను అలవోకగా చెప్పాడు. అవన్నీ జనం నోళ్ళలో నాని, సార్థక మయాయి. అవి ముక్తి మార్గ సొపానాలుగా, భక్తీ మార్గ స్ఫోరకాలుగా ఉంటాయి.

జ్ఞానదేవుని మహిమలను తెలియజేసే అనేక కథలు వ్యాప్తిలో ఉన్నాయి. ఒకసారి

జ్ఞాన దేవుడు ఒక సభలో మాట్లాడుతున్నాడు. సభకు బయట ఒక దున్నపోతు మేస్తోంది. ఒక తుంటరి వేళాకోళంగా "ఆ దున్నపోతు పేరు కూడా జ్ఞాన దేవుడే" అని ఎద్దేవా చేశాడు. "నిజమే, దానికి నాకు ఎలాంటి భేదము లేదు. దానిలోనూ, నాలోనూ ఉన్న ఆత్మ ఒక్కటే." అని సుస్పష్టంగా చెప్పాడు. ఆ వ్యక్తి దున్నపోతును కొరడాతో కొట్టాడు. అదే సమయంలో జ్ఞాన దేవుడి వీపుమీద కూడా కొరడా దెబ్బలు కన్పించి, రక్తం కారటం అందరు చూశారు. ఆయన మహిమాన్విత జీవితానికి అక్కడున్న వారందరూ చేతులెత్తి నమస్కరించారు. మరోసారి జ్ఞాన దేవుడిని దున్నపోతుతో వేదం పలికించమని పరీక్ష పెట్టారు. అప్పుడాయన దాని తలమీద చేతులు ఉంచారు. వెంటనే దున్నపోతు నాలుగు వేదాలను స్వరం, ఉచ్చారణలతో సహా నిర్దుష్టంగా, అవిశ్రాంతంగా పలికింది. అప్పుడు జ్ఞాన దేవుడిని "విష్ణువు అవతారం"గా అందరు భావించారు. ఇంకోసారి జ్ఞాన దేవుడు ఒక బ్రాహ్మణుని ఇంటికి అబ్దీకానికి అంటే తద్దినానికి ఆహ్వానిస్తే వెళ్లడు. పితృదేవతలను మంత్ర పూర్వకంగా ఆహ్వానించాడు జ్ఞానదేవుడు. అందరు సాక్షాత్కారమై వచ్చి, పిత్రువిధిని సంతృప్తికరంగా పొందారు. అంతటి యోగం, సిద్ధి ఆ మహానుభావుడికి ఉండేవి.

చాంగ్ దేవుడు అనే యోగి, పెద్ద పులిపై స్వారీ చేస్తూ, త్రాచు పామును కొరడాగా చేత్తో పట్టుకొని జ్ఞానేశ్వరుని దగ్గరకు వచ్చాడు. అప్పుడు జ్ఞాన దేవుడు విరిగిన గోడపై సోదరులతో కూర్చుని ఉన్నాడు. అప్పుడు ఆ మొండి గోడ కదలటం ప్రారంభించింది. వచ్చిన యోగి ఇది చూసి సిగ్గుపడి, జ్ఞానేశ్వరుని పాదాలు పట్టుకొని జ్ఞాన భిక్ష ప్రసాదించమని వేడుకొన్నాడు. దానికి ఆయన తన సోదరి ముక్తా బాయిని వేడుకొని జ్ఞానం సంపాదించుకోమని హితవు చెప్పాడు. ఆమె చిన్న బాలికే అప్పుడు. అంత చిన్న పిల్ల దగ్గర, ఏమీ తెలీని పసి పిల్ల వద్ద ఎలా నేర్చుకొంటాను అని భావించి, ఆమె పెట్టిన పరీక్షలకు తట్టుకొని, ఆమె వద్ద శుశ్రుష చేసి జ్ఞానం పొందాడు.

"సంత్ జ్ఞానేశ్వర్"గా అందరి చేతా పిలువబడే జ్ఞాన దేవుడు భక్త శిఖామణిగా, జ్ఞానేశ్వర మహారాజుగా ప్రసిద్ధుడు. పూర్ణ యోగిగా జ్ఞానేశ్వరుడిని భావిస్తారు. నిత్యం పాండురంగ విభునితో మాట్లాడుతూ, ఆయనతో తిరుగుతూ ఉండేవాడు. పూనా దగ్గర "అలంది"లో ఆయన చూపిన అద్భుతాలన్నీ ఇవాళ మనకు చిత్రాలుగా ప్రత్యక్షం అవుతాయి. నేను వెళ్లి వాటిని చూసి ఆనందించాను. అదొక మధురానుభవం. "సచ్చిదానందుడు" అనే గృహస్తు చనిపోతే, అతన్ని బ్రతికించిన ప్రాణదాత జ్ఞానేశ్వరుడు. అతడు ఆ తర్వాత "సచ్చిదానంద బాబా"గా జ్ఞాన దేవుని శిష్యుడై, ఆయన భావవ్యాప్తికి తోడ్పడ్డాడు. జ్ఞాన దేవుడు జీవించింది ఖచ్చితంగా 21 సంవత్సరాల 3 నెలల 5 రోజులు మాత్రమే. క్రీ.శ.1296 మార్గశిర బహుళ త్రయోదశి గురువారం జ్ఞాన దేవుని జ్ఞానజ్యోతి అఖండ చైతన్య జ్యోతిలో విలీనం అయింది. జ్ఞానదేవులకు తన అన్న నివృత్తి నాథులు అంటే ప్రేమ, భక్తీ, గౌరవం ఎక్కువ. సాంప్రదాయాలకు అతీతంగా ఆయన రాసిన "జ్ఞానేశ్వరి గీత" ఇప్పటికీ శిరోధార్యమే. ❁





# స్వర్ణ సిద్ధ యోగి వాసిష్ఠ గణపతి ముని

ఆయన చదవని శాస్త్రం లేదు, రాయని కావ్యం లేదు, దర్శించని క్షేత్రం లేదు, తపస్సు చేయని ప్రదేశం లేదు, చూపని మహిమలు లేవు, ప్రసన్నం చేసుకొని దేవత లేదు అన్నిటికి మించి అస్పృస్యతనుయేవగించుకొన్న సదాచార సంపన్నుడు, భారత జాతీయ స్వాతంత్ర ఉద్యమంలో ముందు నిలిచిన కర్మిష్టి, భగవాన్ రమణ మహర్షి చేతనే "నాయనా" అని పిలిపించుకొన్న అద్భుత మూర్తి. సాక్షాత్తు గణపతి అవతారమే శ్రీ వాసిష్ఠ గణపతి ముని. వారి జీవితం అంతా పరోపకారమే. కారణ జన్ములాయన. ఆ పేరు స్మరిస్తే చాలు సర్వ పాపహరం.

**జననం - విద్యాభ్యాసం - వివాహం**

అసలు పేరు అయ్యల సోమయాజుల సూర్య గణపతి శాస్త్రి. తండ్రి నరసింహ శాస్త్రి గణపతి ఉపాసకుడు. తల్లి నరసమ్మ సూర్య ఉపాసకురాలు. వీరి సంతానమే గణపతి శాస్త్రి. శ్రీకాకుళం జిల్లా బొబ్బిలి దగ్గర "కలువ రాయి" గ్రామంలో 17-11-1878న జన్మించారు. ఆరామద్రావిడ కుటుంబం. తండ్రికి గణపతి తన దగ్గరకు వస్తున్నట్లు కనిపించింది. తల్లికి సూర్యుని శక్తి అయిన అగ్ని పూర్ణ స్వర్ణ కలశం కలలో కిప్పంచింది. బిడ్డ జన్మించినప్పుడు అతన్ని ఒక దివ్య తేజస్సు ఆవరించి ఉన్నట్లు చూసింది. పదేళ్ళకే తల్లిని పోగొట్టుకొన్న దురదృష్టవందుడు గణపతి. ఈయన దైవాంశ సంభూతిడు అని భావిస్తున్నారు తల్లీ, తండ్రీ. కాని మనవాడికి ఆరేళ్ళ దాకా మాటలే రాలేదు. తండ్రి కాల్చిన లోహపు ముల్లును కొడుకు నాడిలో గుచ్చాడు. వెంటనే జలపాతంలాగా మాటలు జారి వచ్చాయి.

పినతండ్రి ప్రకాశ శాస్త్రి దగ్గర కావ్యాలు చదవటమే కాక పంచాంగ గణనంలోను దిట్ట అనిపించుకొన్నాడు. పన్నెండవ ఏట విశాలక్ష్మమ్మతో వివాహం జరిగింది. కాళిదాసుగారి మేఘ దూతంలాగా "భృంగ దూతం" అనే రెండు సర్గల కావ్యం రాశాడు. పద్దెనిమిదేళ్ళు వచ్చేసరికి వ్యాకరణ, అలంకార, సాహిత్యాలను కరతలామలకం చేసుకొన్నాడు. పురాణ, ఇతిహాసాల లోతులు తరచాడు. పదమూడవ ఏటి నుండి తండ్రి వద్దే మేధా దక్షిణామూర్తి, నారాయణాక్షరి, సౌరాస్త్రాక్షరి, చండినవాక్షరి, మాతంగి, బాల, వారాహి, భువనేశ్వరి, మహాగణపతి, పంచ దశి, షోడశి అనే పన్నెండు మహా మంత్రాలను సాధన చేసి వశం చేసుకొన్నాడు. తపస్సు చేసుకోవాలనే కోరిక బలమైంది. ఆరు నెలలు ఇంటి దగ్గర, ఆరు నెలలు తపస్సు చేసుకోవటానికి భార్య అనుమతి పొందాడు. ఇద్దరు పిల్లలు కన్న తర్వాత తనకు కూడా తపస్సు చేసుకొనే అవకాశం ఇమ్మని భార్య కోరితే సరేనన్నాడు. వెంటనే భార్యకు మహాగణపతి మంత్రం, శ్రీదీక్ష

ఇచ్చాడు.

## దేశ సంచారం – శాస్త్ర చర్చలు – తపస్సు

1896లో అంటే పదహారేళ్ళప్పుడు కౌశికీ నదీ తీరాన పేరమ్మ అగ్రహారంలో రెండు నెలలు తీవ్ర తపస్సు చేశాడు. కాశీకి బయల్దేరి నంది గ్రామంలో ధర్మ శాలాధికారిచే సన్మానం పొంది ఇంటికి వచ్చాడు. కలువ రాయిలో ధ్యానంలో ఉండగా భద్రకుడు అనే ఆయన కన్పించి గణపతి గణకుడు అనే జ్ఞాపకం చేశాడు. తండ్రి అనుమతితో ప్రయాగ వెళ్లి హంస తీర్థంలో కొంతకాలం తపస్సు చేసి, కాశీ చేరి తండ్రి మేనమామ భవాని శంకరం ఇంట్లో ఉండి దర్భాంగా సంస్థానంలో ఉండే "శివ కుమార పండితుడి"ని తన కవిత్వంతో మెప్పించాడు. నవద్వీపంలో జరిగే విద్వత్ పరీక్షకు హాజరవమని పరిచయ పత్రం పొందాడు. ఒకరోజు ఆయనకు అయ్యల సోమయాజుల సూర్య నారాయణ యోగి కనిపించి భద్రకుడు మొదలైన తాము పదహారు మంది లోక కళ్యాణం కోసం జన్మించామని తాను "సుకేతుడని", అతన గణపతి అని, యే పని చేయాలో "స్థూల శిరస్సు" అనేవాడు తెలుపుతాడని చెప్పాడు. నాసిక్‌లో తపస్సు చేయాలని స్వప్నంలో తెలియజేయబడటంతో అక్కడికి చేరి నీలాంబికా ఆలయంలో తపస్సు చేశాడు. అక్కడే మొదటి అష్టావధానమూ చూశాడు. అక్కడ తనను అవమానించిన పూజారిని శపించి, పాప పరిహారం కోసం "నవ చూతి"లో 72 రోజులు ఘోర తపస్సు చేశాడు. అప్పుడే "తెల్లని దిగంబరుడు" కల్లో కనిపించి ఇంటికి వెళ్ళమని ఆదేశించాడు. ఒరిస్సా చేరి భువనేశ్వర్‌లో తొమ్మిది రోజులు తపస్సు చేశాడు. భువనేశ్వరి దేవి సాక్షాత్కరించి బంగారు గిన్నెలోని తేనెను అతనితో తాగించింది. దానితో కవితా మాధుర్యం పెరిగింది. బుద్ధి సూక్ష్మత రెట్టింపైంది. ఇంటికి వస్తే భార్య కొడుకుని కన్నది. మహాదేవుడనే పేరు పెట్టాడు. కేశన కుర్రులో తర్క వేదాంత, వ్యాకరణ మహా భాష్యాలను, నీతి శాస్త్రాన్ని ఆపోసన పట్టాడు. 1900లో మంసా సంస్థానంలో రాజ గురువును ఓడించి, అష్టావధాన& చేసి, రాజకుమారుడికి శివ పంచాక్షరి ఉపదేశించి రాజు ప్రోత్సాహంతో నవద్వీపం చేరాడు. అక్కడ "సితి కంఠ" వాచస్పతి ఆదరం పొందాడు. పరీక్షాధికారి అయిన "అంబికా దత్తు అయిన అంబికకు దత్తుడు అయితే తాను సాక్షాత్తు అంబికకు ఔరస పుత్రుడిని గణపతిని అనే" శ్లోకంతో మెప్పించి, ఆయన మెప్పు పొంది, పరీక్షలో పాల్గొన్నాడు. నవద్వీప పండితులను మెప్పించటం మహా కష్టం. కాని మన గణపతి అక్కడి పండిత పరిషత్తు పెట్టిన అన్ని పరీక్షల్లో నెగ్గి, తన పాండిత్యం, కవిత్వాలతో అందర్నీ మెప్పించి "కావ్య కంఠ గణపతి" బిరుదును 20-6-1990న పొందాడు. అప్పటి నుంచి ఆ పేరుతోనే సార్థక నామధేయుడైనాడు.

వైద్యనాథ్ వెళ్లి తపస్సు చేసి సురేష మిత్రుని వద్ద "తారా" మంత్రోపదేశం పొందాడు. గణపతి గారి వల్లే ఉత్తరాదికే పరిమితమైన ఈ మంత్రం దక్షిణానికి చేరింది. పదవ రోజు రాత్రి శివుడు కలలో కన్పించి నిర్విషయ ధ్యాన రూపం అయిన "స్మృతి



మార్గం" చూపించి, విభూతి చల్లి అదృశ్యమైనాడు. గద్వాల్ చేరి మహారాజుకు ఆప్తుడై, కాన్పూర్ వెళ్లి మూడు నెలలు తపస్సు చేసి, మళ్ళీ ఇంటికి వెళ్లి తండ్రికి నేత్ర చికిత్స చేయించాడు. 1902లో భార్యతో సహా మందసా వెళ్లి రాజు గారి ఆతిథ్యం పొంది, భార్యను పుట్టింటికి పంపి, తమ్ముడు శివ రామశాస్త్రితో కలిసి భువనేశ్వర్‌లో మళ్ళీ తపస్సు చేసి కలకత్తా చేరాడు. అక్కడినుంచి దక్షిణ దేశం చేరి క్షీరవతీ, వేగావతీ నదుల మధ్య శివ పంచాక్షరి జపించి, అరుణాచలం చేరి తన తపో సాధనకు అదే సరైన ప్రదేశంగా భావించి అక్కడే ఉందామని నిర్ణయించుకొన్నాడు.

కానీ అన్నదమ్ములిద్దరికి పిడికెడు అన్నం పెట్టేవారే కరువైనారు. గణపతికి ఆ క్షేత్ర దేవతపై కోపం వచ్చింది. ఆకలి దహిస్తోంది. వెంటనే ఒక బ్రాహ్మణుడు వచ్చి తన భార్య వ్రతం చేసి పారణను బ్రాహ్మణులకు ఇవ్వాలని అనుకుంటున్నది భోజనానికి రమ్మని చెప్పి తీసుకొని వెళ్లాడు. అక్కడ ఆమె మృష్టాన్న భోజనం పెట్టింది. సంతృప్తిగా తిన్నారు. ఆ ఇంట్లోనే విశ్రాంతి తీసుకొన్నారు. తెల్లవారి లేచి చూస్తె అక్కడ ఇల్లే లేదు. అరుణాచలేశ్వరుడే తమల్ని పిలుచుకొని వెళ్ళాడని అమ్మవారు "ఆపీత కుచాంబే" తమకు భోజనం పెట్టిందని గ్రహించాడు. కాని నోట్లో తాంబూలం అట్లాగే ఉండటం ఆశ్చర్యం వేసింది. అది కల కాదు నిజం అని తెలుసుకొన్నాడు. అప్పటికి గణపతి అయిదు కోట్ల శివ పంచాక్షరిని జపించినందుకు అమ్మవారే స్వయంగా కన్పించి ఆతిథ్యం ఇచ్చిందని అర్థమయింది. ఇక మానవ మాత్రులెవారినీ దేహీ అని అర్థించ రాదనీ నిశ్చయించుకొన్నాడు. రోజూ అరుణాచల నందీశ్వరుని ముందు నిలిచి శ్లోకాలను అరుణా చలేశ్వరునికి వినిపిస్తూ "హరస్తుతి" కావ్యం రచించాడు. చివరి రోజున అరుణాచల యోగులు శేషాద్రి స్వామి, బ్రాహ్మణ స్వామి (రమణ మహర్షి) ఆ కావ్యం విని ఆనందించారు. అక్కడి విద్యాలయంలో ఈయనకు సంస్కృత అధ్యాపక పదవి లభించింది. పది రోజుల్లో తమిళం నేర్చి, ఆ భాషలో బోధించటం ప్రారంభించి మెప్పు పొందాడు. 1903లో రమణ మహర్షిని దర్శించాడు. ఆయనే దుర్గా మందిర యోగి చెప్పిన "స్థూల శిరస్సు" అని గుర్తించి నమస్కరించాడు. అప్పుడు రమణుల వయస్సు ఇరవై రెండు. గణపతి వయస్సు ఇరవై అయిదు. అలా చారిత్రాత్మకంగా కలిసిన వారిద్దరూ జీవికా జీవులుగా ఉండిపోయారు.

గణపతి ముని ఒక సంవత్సరం వేదాధ్యయనం చేసి సాయన భాష్యం చదివారు. అప్పటికే ఆయన కీర్తి తమిళ దేశమంతా వ్యాప్తి చెందింది. ఒకరోజు దొరస్వామి అనే శిష్యుడు షేక్స్పియర్ నాటకం మేక్బత్‌ను కథగా వినిపిస్తే, ఆశువుగా సంస్కృత కావ్యంగా చెప్పేశారు. వేరొక శిష్యుడు ఇంగ్లీష్ పేపర్ చదివి వినిపిస్తే దాన్ని కింది నుంచి పైకి, పై నుంచి కిందికి చెప్పిన ఏక సంథాగ్రాహి. వేదం వెంకట శాస్త్రిగారి సమక్షంలో గొప్ప సన్మానం జరిగింది భట్టశ్రీ, బాల సరస్వతి బిరుదులూ పొందిన ఒక పండితుడిని ఓడించి బంగారు తోడా బహుమానంగా పొందారు. ఇలా ఎక్కడికి వెళ్ళినా విజయ పరంపరతో

సాగిపోతున్నారు.

## భారత దేశోద్ధరణ...శ్రీ రమణుల సందర్శనం-జన్మ రహస్యం

పూర్వ జన్మలో తనకు శిష్యులైన విద్యార్థులను గుర్తించి, వారిని పిలిపించి మద్రాస్ సముద్ర తీరంలో దేశోద్ధారణ కోసం ఉపాయాలు చర్చించారు. నాలుగు ముఖ్య ఆశయాలతో పని చేయాలని నిర్ణయించారు. ఒకటి కర్మ యోగం, రెండు – వేదకాల రుషి జీవన విధానం, మూడు – స్త్రీ పురుష వివక్ష – వర్ణ వివక్షను దూరం చేయటం, నాలుగు – ప్రతి ఇల్లు మంత్రాలతో నినదించటం. ఇవి చాలా గొప్ప నిర్ణయాలు. సాహసోపేతమైనవి. ఆయన "దశాం దేశ స్యైతాం ప్రతి పదమయం – ధ్యాయతి జన:" అంటే – "భారత దేశ దశను గురించే నేనెప్పుడు ధ్యానిస్తున్నాను." ఇంత గొప్ప ఉదార ఆశయం ఆనాడు యే మహర్షికీ లేదు. ఆనాటి సమర్థ సద్గురు రామదాసుగా, విద్యారణ్య మహర్షిగా ఈ నాటి వివేకానందులుగా గణపతి స్వామి కనిపిస్తారు.

రాయవేలూర్ క్రిస్టియన్ కాలేజిలో తెలుగు పండితులుగ పనిచేస్తూ అక్కడే ఉండిపోయారు. ఎందరో స్త్రీ, పురుషులకు మంత్ర దీక్షనిచ్చారు. సర్వేపల్లి రాధాకృష్ణన్ పిన తండ్రి నరసింహం కూడా దీక్ష పొంది, సన్యసించి "ప్రణవా నందులు" అయ్యారు. బహిరంగ సభల్లో వేద ప్రాశస్త్యాన్ని నొక్కి చెప్పటంతో ఇతర మతాలవారు వెనక్కు తగ్గారు. "ఇంద్ర సంఘం" స్థాపించి 'ఉమాం వందే మాతరం' అనే మంత్రాన్ని అందరికి బోధించారు. 17-2-1907లో కలలో "భద్రకుడు" కన్పించి తన దేహ యాత్ర ముగిసిందని, గణపతి బోధనలతో సంఘం త్వరలో స్పందిస్తుందని చెప్పాడు. తన సోదరుడు చనిపోయినంతగా దు:ఖించి స్నానం చేసి తర్పణం వదిలారు. ఆ మర్నాటి పేపర్‌లో కొడుక్కి మశూచికం వస్తే "ఉగ్రమారీచి"ని ప్రార్థించి దాన్ని పోగొట్టారు. దసరా ఉత్సవాలకు "పడై వీడు"కు వెళ్లి, "రేణుకా దేవి"ని దర్శించి, తపస్సు మీది విపరీతమైన కోరికతో ఉద్యోగం వదిలేశారు.

అరుణాచలం చేరి "మరకత శ్యామలా దేవి (పచ్చై యమ్మన్) దేవాలయంలో కొంతకాలం, నైరుత లింగంలో కొన్నినాళ్ళు తపస్సు చేశారు. అరుణాచలేశ్వరుని కృత్తికోత్సవాలు జరుగుతున్నాయి. ఏడవ నాడు రథోత్సవం. దారిలో రథం ఆగిపోయి కదలలేదు. గణపతి స్వామి రథం దగ్గరకు వచ్చి ప్రార్థించగానే కదిలింది. ఆ మహాత్ముని కోసం అందరు వెతుకుతుంటే అదృశ్యమైపోయాడు. విరూపాక్ష గుహలో బ్రాహ్మణ స్వామిని దర్శించాడు. గణపతి ఆయనకు సాష్టాంగ పడి తనకు తపోసాధన కుదరటంలేదని, మార్గ నిర్దేశం చేయమని ప్రార్థించాడు. అప్పటిదాకా ఎన్నో ఏళ్లుగా మౌనవ్రతం పాటిస్తున్న రమణ మహర్షి "నేను అనే స్ఫురణ ఎక్కడి నుండి వస్తోందో విచారిస్తే మనస్సు దానిలోనే లీనం అవుతుంది. అదే తపస్సు" అని చెప్పి మౌనాన్ని విడిచారు 18-11-1906న. తన మౌనాన్ని ఛేదించిన వాడు మహా మహిమాన్వితుడు అని గ్రహించాడు బ్రాహ్మణస్వామి. తనకు తపో విధానం తెలిపి గురుస్థానాన్ని పొందారు బ్రాహ్మణ మహర్షి అని గణపతి స్వామి భావించాడు. ఆయనకు భగవాన్ "రమణ



మహర్షి" అనే పేరు గణపతి స్వామి పెట్టారు. రమణ మహర్షి ఈయనను "నాయనా" అని సంబోధించారు. శ్రీ రమణులకు, గణపతికి పురజనులు సాష్టాంగ పడ్డారు. తరువాత తాను "మరుద్గణ పతి అయిన వృషా కపి యొక్క ఏడవ అవతారం" అని నాయన ప్రకటించుకొన్నారు.

ఇక్కడి నుండి నాయనకు మరో జన్మ ప్రారంభమైంది. అనేక గ్రంథాలు రచించారు. తపస్సు తీవ్రతరం చేశారు. తీర్థ యాత్రలెన్నో చేశారు. ఉపన్యాసాలిచ్చారు. పండితుల్ని జయించి విజయ పత్రికలందుకొన్నారు. భార్య విశాలాక్షమ్మ దీపోత్సవానికి ముప్ఫై మంది శిష్యులతో వచ్చింది. శ్రీ రమణులు ఆమెను చూసి "అమ్మ వచ్చింది" అన్నారు. నాయన కూడా అప్పటి నుండి భార్యను "అమ్మా" అని పిలవటం ప్రారంభించారు. ఆమె కూడా భర్తను "నాయనా" అని పిలవటం మొదలుపెట్టింది. ఆరోజు నుండి భార్యాభర్తలు వాన ప్రస్థాశ్రమం స్వీకరించారు. నాయన ఆమెకు "తారా మంత్రం" ఉపదేశించారు. నాయన "చూత గుహ"లో తపస్సు చేస్తూ ఇరవై రోజుల్లో "ఉమా సహస్రం" రాయటానికి పూనుకొన్నారు. అయిదుగురు రాసే వాళ్లకు ఒక్కక్కరికి యాభై శ్లోకాలు చెపుతూ 250 శ్లోకాలు అవ్యవధానంగా చెప్పారు. దీని వెనక రమణ మహర్షి సూక్ష్మ రూపంలో హృదయంలో కూర్చుని రాయించారని నాయన భావం. ఆ వాక్ ప్రవహం రమణుల హృదయంలో ఊరి, నాయన ముఖతా వెలువడింది. రమణుల ఆదేశంతో కొండ శిఖరం "సప్త ఝరి"లో ఉండి "దూర దృష్టి, దూర శ్రవణం" అనే సిద్ధులను పొందారు. చిరుపాకం కొండయ్య అనే గణపతి ఉపాసకునికి హోమజ్వాలలో "నాయన దివ్యాకృతి" కన్పించింది. శ్రీ రమణులు "షణ్ముఖుని" అవతారంగా నాయన లోకానికి చాటి చెప్పారు. కాశీలో సుకేతుడు చెప్పిన "స్థూల శిరస్సు రమణులే" అని నాయన గుర్తించారు. అప్పటి నుంచి రమణుల అనుచరునిగా ఉన్నారు. పడై వీడుకు వెళ్లి రేణుకా దర్శనం చేసి, దేశ భక్తులైన యువకుల్ని సమీకరించారు. ఇక్కడే "కపాలి శాస్త్రి" అనే మహా విద్వాంసుడు నాయన శిష్యుడైనాడు. ఆనయనపై పోలీసులు నిఘా పెంచారు. దేశ ద్రోహం చేస్తున్నాడని ఆరోపణ. వారి కంటపడకుండా కుండలినీ నదీ తీరంలో ఇసుకలో పూడ్చిపెట్టారు. అనుకోకుండా ఆ రాత్రి నదికి వరద వచ్చి గ్రంథం కొట్టుకుపోయింది. ఆ ప్రదేశాన్ని వదిలి వెళ్ళమని నాయనకు పోలీసులు ఆదేశించారు. వేలూరు వెళ్లి భార్య ప్రసవించిన ఆడపిల్లకు "వజ్రేశ్వరి" అని పేరు పెట్టాడు. మళ్ళీ రేణుకా క్షేత్రం చేరి నలభై రోజులు తపస్సు చేశాడు. దీక్ష చివరి రోజున రేణుకా దేవి 200 మంది పరిచారికలతో ప్రత్యక్షమై నాయన శరీరంలోకి శక్తిని ప్రసరింప జేసింది. శక్తి ఆయుధం లభించిన అనుభూతి పొందారు నాయన. ఋగ్వేదంలోని "అస్త్ర మహా విద్యా మంత్రం" నాయనకు గోచరించింది. వేలూరు వెళ్లి "ఇంద్ర సభ" పెట్టి ఆ అస్త్ర మంత్రం వారికి బోధించారు. బ్రిటీష్ ప్రభుత్వం దీన్ని "విప్లవ చర్య"గా భావించి అరెస్ట్ వారంట్ జారీ చేసింది. రహస్య మార్గంలో హంపీకి బయల్దేరి హాస్పేటలో ఒక మోసగాని

వల్ల ఒకరోజు జైల్లో ఉండాల్సి వచ్చింది. మర్నాడు పోలీస్ ఇన్స్పెక్టర్ నాయన దివ్యత్వం తెలుసుకొని విడిచిపెట్టి మంత్ర దీక్ష పొంది శిష్యుడైనాడు. ఆనయన "మా ఉలి" అనే చోట తపస్సు చేసి ఆ గ్రామ దేవతను ప్రత్యక్షీకరించుకొన్నారు. ఆమె అస్త్ర సిద్ధికి ఇంకా సమయం రాలేదని వేచి ఉండమని బోధించింది.

రమణుల వద్ద సెలవు పొంది దక్షిణ యాత్రలు చేస్తూ "జంబుకేశ్వరం" చేరి అక్కడి "అఖిలాండేశ్వరి"ని కొలుస్తూ నష్టపోయిన ఉమా సహస్రాన్ని పూర్తి చేశారు. దాదాపు ఏడు వందల శ్లోకాలు పదిరోజుల్లో రాశారు. మళ్ళీ వేలూరుకు వచ్చి కొడుకు మహాదేవుడికి వడుగు చేసి, అందరితో అరుణాచలం చేరారు. ఆ తర్వాతా రెండేళ్లు మద్రాస్‌లో ఉన్నారు. ఉడిపి బలరామ క్షేత్రంలో తపమాచరించి పీఠాధిపతితో సత్కరింపబడి, ఆ సభలో మతత్రయ సిద్ధాంత సారాన్ని "తత్వ ఘంటా శతకం"గా ఆశువుగా చెప్పారు నాయన. గోకర్ణం చేరి తపం చేసి అనంత శాస్త్రి అనే పండితుణ్ణి ఓడించి, "ఇంద్ర మత ప్రాశస్త్యం" స్థాపించాడు. అక్కడి పండితులకు పరాశర సంహితలో కల్గిన సందేహాలను తీర్చి "లఘు సంహిత" రచించాడు. గోకర్ణ ప్రాంతంలో ఉన్న వేద శాఖను పదిహేను రోజుల్లో కంఠస్తం చేశారు. ఉమా మహేశ్వర పర్వతంపై నాయనా, అమ్మా తపస్సు చేస్తుండగా వారిని సేవించిన గణేశ శర్మ తర్వాత "దేవరాతుడు"గా ప్రసిద్ధి పొందాడు. నాయన వద్ద ఆయన అనేక దివ్యానుభూతులను పొందాడు. పౌరాణిక కథలను బట్టి వేదార్థాలను, వేదార్థాలను బట్టి పురాణ కథలను సమన్వయించే పనికి పూనుకొన్నరు.

1912లో స్వగ్రామం కలువ రాయి చేరి తండ్రి అవసాన కాలంలో దగ్గరుండి అంత్యక్రియలు చేసి, అరుణాచలం చేరి రమణ దర్శనం చేసి గోకర్ణంలో "నాయన బేలా ఆశ్రమం"లో జరిగిన "జ్యోతిష్టోమం"కు బృహస్పతిగా ఉండి యజ్ఞ కర్మలను మంత్రార్థాలను సంస్కృతంలో సుబోధకంగా వివరించారు. కన్నడంలో అనర్గళంగా ఉపన్యసించి అందర్నీ ఆశ్చర్యపరవశులను చేశారు నాయన. తర్వాతా సికిందరాబాద్ వచ్చి జంట నగరవాసులు చాలా మందికి మంత్ర దీక్షనిచ్చారు. అక్కడికి దగ్గర్లో ఉన్న "కర్కేలి"లో నాలుగు నెలలు తపో దీక్షలో ఉన్నారు. అమ్మతో ఉత్తర దేశ యాత్రలు చేసి, ఆమె భువనేశ్వరంలో పాక మహిమ, అక్షయ సిద్ధి పొందింది. మందసా చేరి తల్లి తద్దినం పెట్టి, రాజా వారి కోర్కెపై ఇద్దరు అక్కడే చాలా కాలం ఉండిపోయారు. అక్కడి కొండపై ఉన్న శివలింగానికి "దహర గోకర్ణేశ్వరుడు" అని నాయన పేరు పెట్టారు. తనలో పరశురాముని తేజం ప్రవేశించినట్లు గుర్తించారు.

1917లో అరుణాచలం చేరి విరూపాక్ష గుహలో రమణుల అనుమతితో ఉండటానికి అనుమతి పొంది, గుహకు వస్తే కాపలావాడు తాళం చెవి ఇవ్వకపోతే క్రోధాగ్ని ప్రజ్వలింపజేశారు. తర్వాత పశ్చాత్తాపపడి "ఇంద్ర స్తుతి"" చేస్తే విపరీతంగా వర్షం పడి దేవాలయ రథంపై పిడుగుపడి గండం తప్పింది. రమణులు నాయనతో



ఇంకా కోపం ఎవరి మీద చూపనని శపథం చేయించి, స్వహస్తాలతో పెరుగు అన్నం తినిపించారు నాయనకు. రమణులతో పాటు స్కంధాశ్రమంలో ఉంటూ "దశ మహా విద్యాసారం"ను 475 సూత్రాలను మూడు రోజుల్లో రాశారు. "రమణ గీత"ను రాసి, పడివీడు వెళ్లి నలభై రోజులు తపం చేశారు. శ్రీరమణుల తమ్ముడికి, తల్లికి సన్యాస దీక్షనిచ్చి మళ్ళీ స్వగ్రామం కలువ రాయి వెళ్లారు. కొడుకు మహాదేవుడి వివాహం చేసి, సికిందరాబాద్ చేరి 1919 డిసెంబర్ దాకా ఉండి స్వరాజ్య ఉద్యమ సన్నాహాన్ని చూసి సంబర పడ్డారు. గాంధీని "మైత్రేయ రుషి"గా నాయన గుర్తించారు. అమ్మతో మద్రాస్ వెళ్లి "రాజ యోగ సారం" రాశారు.

1922లో అరుణాచలం చేరి "ఉమా సహస్రం" సంస్కరించి, "ఇంద్రాణీ సప్తశతి" రచన మొదలెట్టారు. వెన్నెముకలో విపరీతమైన నొప్పి, శరోవేదనతో బాధపడ్డారు. రమణ మహర్షికి చీటీ ద్వారా తెలియజేసినా సమాధానం రాలేదు. అర్ధరాత్రి దుహలో నాయన శిరస్సు నుంచి "టప్" అనే ధ్వనితో పెద్ద శబ్దం గుహ బయటివారికి కూడా వినిపించింది. చంద్రకాంతి వంటి జ్యోతి గుహ పైకప్పును తాకింది. నాయన శరీరం నుండి దట్టమైన పొగలు బయటికి వచ్చాయి. శీర్ష కపాల భేదనం జరిగి అమృతప్రాప్తి లభించింది. బాధ అంతా మాయమైంది. రమణులు వచ్చి తనతో తీసుకొని వెళ్లి పాలు తాగించారు. నాయన నెత్తిమీద అరచెయ్యి వెడల్పున వెంట్రుకలు ఊడిపోయాయి. రమణ మహర్షి నాయనకు సపర్యలు చేయించారు. ఇంద్రాణీ సప్తశతి పూర్తి చేసి పరివీడు వెళ్లి అక్కడి దాన్ని పఠించారు. రేణుకా దేవి ప్రత్యక్షమై ఆశీర్వదించింది.

నాయన– స్త్రీల స్వాతంత్ర్యానికి, పంచముల దీన స్తితి తొలగించటానికి, వేదార్థాల సందేహాలు తీర్చటానికి, వర్ణ భేదాలు తొలగిపోవటానికి ఇంద్రాణీని ప్రార్థించారు. దేశ వైభవం కోసం ఆయన చేసిన శ్లోకాలు చిరస్తాయిగా నిలిచిపోయియి. 1922లో రమణుల తల్లి అలఘుమ్మ మరణిస్తే, సమాధి కట్టించి దానిపై రమణులు స్తాపించిన శివలింగానికి "మాతృ భూతేశ్వర లింగం" అని నాయన పేరు పెట్టారు. 1923లో "ఉమా సహస్రం"ను శ్రీ రమణులకు సమర్పించారు. అది 1942లో అచ్చయింది.

## వాసిష్ట గణపతి ముని–03 కాంగ్రెస్‌కు వీడ్కోలు

1923లో కాకినాడ కాంగ్రెస్ సభల్లో పురుషులతో పాటు స్త్రీలకు ఉపనయన, హోమ, శ్రాద్ధ కర్మల్లో సమాన హక్కు ఉందని వేదశాస్త్ర ప్రమాణంగా నిరూపించారు గణపతి ముని. ఆలమూరు సభలో అస్పృశ్యతా నివారణ గురించి మాట్లాడి మహా మహా పండితుల నోళ్ళు మూయించారు. ద్రావిడ రాష్ట్రీయ కాంగ్రెస్ అధ్యక్షహోదాలో బెల్గాం కాంగ్రెస్ సభలో ఆ మరుసటి ఏడు పాల్గొని అస్పృశ్యత జాతికి అవమానం అని ప్రసంగించారు. గాంధీగారు హిందీని రాష్ట్రభాషగా సమర్థించగా, నాయన "సంస్కృతాన్ని

జాతీయ భాషగా" చేయాలని వాదించటానికి సిద్ధపడగా, గాంధీ నాయనకు అవకాశం ఇవ్వలేదు. విసుగొచ్చి రాజకీయాల నుండి వైదొలగారు. అయినా దేశభక్తిని ప్రబోధించే "రాష్ట్ర నిబంధన" గ్రంథం రాశారు. "సంస్కృతం ప్రపంచ భాష" కావాలని "లాలి భాషోపదేశ" పుస్తకం రాశారు. సంస్కృతం అంటే నాయనకు అంత అభిమానం. దాని పారం ముట్టిన భాషా కోవిదుడు. అతి మూత్ర వ్యాధి వచ్చినా గ్రంథ రచన మానలేదు. అనేక సూత్ర, ప్రామాణిక గ్రంథాలు రాస్తూనే ఉన్నారు.

## ముని అనిపించుకొన్న విధానం

1925లో బందరు "సనాతన ధర్మ సభ"లో సాంఘిక సంస్కరణల గురించి మాట్లాడారు. మంగళగిరి నృసింహ క్షేత్రాన్ని ఇంద్రక్షేత్రంగా గుర్తించారు నాయన. 1926లో తిరువన్నామలై చేరి "పూర్ణ" అనే సంస్కృత నవల రాశారు. నాయన రచనలు 75 పైనే ఉన్నాయి. అందులో ఇరవైఒక్క స్తోత్రాలు, ఇరవైనాల్గు సూత్ర గ్రంథాలు, మూడు తత్వ గ్రంథాలు, ఏడు వ్యాఖ్యానాలు. మూడు ఆయుర్వేద గ్రంథాలు, మూడు జ్యోతిష గ్రంథాలు, ఒక చారిత్రికం మిగిలినవి ప్రకరణాలు. 18-7-1926న అమ్మ మరణించింది.

మరుసటి ఏడు సికిందరాబాద్ వచ్చి శ్రీ రమణుల సందేశాన్ని వినిపించి వేల మందికి మంత్ర దీక్షనిచ్చారు. 4-2-1927న జరిగిన శ్రీ కృష్ణదేవరాయాంధ్ర భాషా నిలయం రజతోత్సవాలకు అధ్యక్షత వహించారు. హైదరాబాద్‌లోని "ఆది హిందూ సంఘం" నాయనను పల్లకిలో ఊరేగించి "ముని" బిరుదును ప్రదానం చేశారు. డిసెంబర్‌లో మచిలీపట్నంలో జరిగిన మదన మోహన మాలవ్యా అధ్యక్షస్థానంలో ఉన్న సభలో అస్పృశ్యతా నివారణ గురించి మాట్లాడి ఆయన ఆదరానికి పాత్రులయ్యారు. కాని ఛాందసుల నిరసనకు గురి అయ్యారు. చండాలురకు దేవాలయ ప్రవేశం కల్గించాలని మల్లాది వారితో వాదించారు.

## అరవిందుల దర్శనం

అరవింద మహర్షి నుండి ఆహ్వానం అందుకొని శ్రీరమణుల అనుమతి పొంది అరవిందాశ్రమం చేరారు. అరవిందులు తమకు పూర్వజన్మలో తపస్సులో సఖులని, లనకంటే అరవిందులు పెద్ద వారు, గొప్పవారని చెప్పారు. అరవింద జయంతికి అరవిందాశ్రమంలో ఉన్నారు. రెండు నిముషాలు ఇద్దరు ఋషులు ఒకరినొకరు తేరిపార చూసుకొన్నారు. ఒకరి మహిమను ఒంకొకరు గ్రహించారు. అరవింద మాత నాయనతో ధ్యానం చేశారు. నాయన "జనని" గ్రంథానికి పీఠిక, 108 సూత్రాల తత్వానుశాసనం రాశారు. తిరువణ్ణామలై వచ్చి "ఇంద్ర స్తోత్రం" రాశారు.

## నాయన మహిమలు

గోకర్ణం చేరి "కాలువే" ఆశ్రమంలో తపస్సు చేశారు. అహల్య అనే స్త్రీకి గ్రహపీడను, ఆమె భర్తకు టైఫాయిడ్ మంత్ర శక్తితో వదిలించారు. ఒకసారి శిష్యులతో



ఆశ్రమంలో ఉండగా ప్రక్కనున్న గడ్డివాములు అంటుకొని మండుతుంటే "పారాశర అగ్ని మంత్రం" ప్రయోగించి అగ్ని జ్వాలలను, గడ్డివాముల్ని దూరంగా చిమ్మి వేసి ప్రమాదం నుండి కాపాడారు. ఇంకోసారి కొడుకు మహాదేవుడితో కారులో ప్రయాణిస్తుంటే కారు ప్రమాదం జరిగి కొడుకు మోచేతి ఎముక విరిగింది. నాయన కారులోనే "ఋగ్వేదం లోని అస్థి సంధాన మంత్రం" పఠించి మోచేతిని అతికించారు. 1929-31 మధ్య శీర్షి ఆనందాశ్రమంలో ఉండి వందలాది జనానికి మంత్ర దీక్షనిచ్చి రమణ మహర్షి సందేశాన్ని బోధ పరచారు. పూర్వం జరిగిన కపాల భేదన సిద్ధితో తనలో ఏదో దివ్య శరీరం పుట్టి ఇతరులను ఆవహిస్తున్నట్లు తోచింది. రామచంద్ర భట్టు అఏ నిరక్షరకుక్షిని ఆ దివ్య శరీరం ఆవహించి అతన్ని సంస్కృత పండితుని చేసింది. రమణ మహర్షికి అనేక జాబులు రాశారు. అందులో తన శక్తి స్థానాలు మూడు అని పేర్కొన్నారు. మొదటిది రమణ మహర్షి, రెండు భగవాన్ ఇంద్రుడు, మూడు భారత మాత. ఇంద్రుని ఉపాశించి భారత మాతకు పట్టిన దుర్గతిని తొలగించటమే తన ధ్యేయం అన్నారు నాయన. నాయన మాతృభక్తి ఎంత ఉత్కృష్టమైనదో మనకు దీనివల్ల తెలుస్తోంది. "ఉన్నది నలుబది", "ప్రచండ చండీ శతి", ఈశ ఉపనిషత్తుకు భాష్యం రాశారు. 1933లో ఋగ్వేదం ఆధారంగా "భారత చరిత్ర పరీక్ష" అనే ఉద్గ్రంథాన్ని నాయన రాశారు. వేద, పురాణాలను సమన్వయము చేస్తూ రాసిన, అరుదైన, అద్భుతమైన గ్రంథం ఇది. నాయన నిశిత దృష్టికి సమన్వయ దృష్టికి నిలువెత్తు దర్పణం. దీన్ని చదివే ఉపన్యాసాలకు వైస్ చాన్సలర్ సర్వేపల్లి రాధాకృష్ణ పండితుడు ముగ్ధుడై నాయనకు ఆచార్య పదవిలో నియోగిస్తామని కోరారు. తాను తపస్సును విడిచి ఉండలేనని మర్యాదగా తిరస్కరించారు.

## చివరి రోజులు

ఖర్గ పూర్ ఐ.ఐ.టిలోని నేమాని సూర్య నారాయణగారు నాయనను కలకత్తాకు ఆహ్వానించారు. అక్కడ గుంటూరు లక్ష్మీకాంతం గారింట్లో ఉన్నారు. తాను పదేళ్ళ క్రితం కలలో చూసిన సిద్ధ పురుషుడే నాయన అని ఆయన గుర్తించారు. కలకత్తాలో అవతార విశేషాలు, రమణుల సందేశం, వేదకాలం వంటి వాటిపై విస్తృతంగా ప్రసంగించారు. అక్కడ గొపాలస్వామి అనే యోగితోపాటు కంచి చంద్రశుఖర యతీస్ద్రులను దర్శించారు. స్వామి వారు నాయన గారిని గౌరవ, ఆదరాలతో సత్కరించారు.

## స్వర్ణసిద్ధి యోగం

మనుమడి బారసాలకు కలువ రాయి వస్తుంటే నాయనకు అనుకోకుండా దొరికిన రాగి నాణెం బంగారంగా మారింది. మళ్ళీ ఖర్గపూర్ వెళ్లి ఆశ్రమ స్థాపనకు శంకుస్థాపన చేశారు. ఒకరోజు రాత్రి నాయన "స్వర్ణ సిద్ధి యోగం" ప్రదర్శించారు. కలకత్తా వెళ్లారు. అక్కడ నేమాని సూర్యనారాయణ నెత్తిన అడుగున్నర ఎత్తున ఇనుప బీగం (తాళం) పడబోతుంటే దాన్ని పట్టుకొని మూడు నిముషాలున్నారు. అది అయస్కాంతంలా ఇనుప వస్తువుల్ని ఆకర్షించింది. అంటే నాయన శరీరంలో శిరస్సు

నుండి అవిచ్ఛిన్నంగా విద్యుత్తు ప్రవహిస్తోందని అర్థమైంది. విమర్శ మీమాంశకు తాత్పర్యం, ఆత్మకథ, పూర్వ కథ తెలుగులో రాయటం ప్రారంభించారు. కర్మల్లో ప్రయోగించే మంత్రాలకు ఆధ్యాత్మిక వ్యాఖ్యానం రాశారు. 25-4-1936 మళ్ళీ ఖర్గపూర్ చేరారు. వేల సంఖ్యలో భక్తులేర్పడ్డారు. నాయన ఎన్నో అతీంద్రియ శక్తుల్ని ప్రదర్శించారు. "అబిసీనియా చక్రవర్తి రాజ్య భ్రష్టుడు అవుతాడు" అని ముందే నాయన చెప్పారు. నాయన ఆరోగ్యం బాగా క్షీణించింది.

### నాయన అనాయాస మరణం

తాను మరణించే సమయాన్ని నాలుగు రోజుల ముందే అందరికి తెలియజేశారు. 25-7-1936నాడు ధాతు నామ సంవత్సరం శ్రావణ శుద్ధ సప్తమి శనివారం మధ్యాహ్నం శిష్యులతో హోమం చేయించి అనాయాసంగా మరణించారు. భారతీయ వేద, శాస్త్ర, పురాణ, ఇతిహాసాలను నాయనలాగా సమన్వయము చేసినవారు లేరు, లేరు, లేరు. నాయన జీవిత చరిత్రను గుంటూరు లక్ష్మీకాంతంగారు పుస్తకంగా రాశారు. నాయన "అయిదున్నర అడుగుల ఎత్తు, బక్క పలుచని బంగారు రంగు శరీరం, విశాల ఫాలభాగం, బట్టతల, పూర్ణ వికాసం స్ఫురించే శిరస్సు, విజ్ఞాన పూర్ణ నేత్రాలు, గంభీరమైన కనుబొమ్మలు, సన్నని మీసాలు, పటుచని గడ్డం, ఘంటానాదం వంటి కంఠధ్వని, అధికారయుతమైన వాణి, చిరునవ్వులు చిందించే పెదవులు, వాత్సల్య, అనుకంపలను పుట్టించే పితృభావం, కృతయుగపు రుషి ఆకృతితో ఉండేవారిని లక్ష్మీకాంతంగారు రాశారు. శ్రీరామ కృష్ణ పరమహంసకు వివేకానంద స్వామి ఎలాగో శ్రీరమణ మహర్షికి నాయనలాంటివారు.

నాయనను ప్రశంసిస్తూ నవద్వీప పండితులిచ్చిన ప్రశంసా శ్లోకం-

"ప్రాచేనైస్తైమ్ కవికుల వరైహ్ కాళిదాసాది భిర్యా-లబ్ధా కీర్తి ర్భువదనుగాదా శైవ భూయాదిదానీం

సద్భిర్గాత్తో ఇహ, రుచిర: కావ్య కంఠోపహార:-తేవ శ్రీమాని: భువి వానుజ్జ్వలశ్చాపి భూయాత్". ❁





# ఆత్మారామధాన యోగి-జగన్నాథ స్వామి

వైశ్య కులంలో జన్మించి, భగవదాదేశంగా అనేక పెద్ద దేవాలయాలను నిర్మించి, తనకు జయన్తులక్కర్లేదని ఆరాధన చాలు నని ఆరాధన అంటే ఆత్మ అనే రామ ధనాన్ని సంపాదించటమేనని గొప్ప అర్థం చెప్పిన యోగి జగన్నాథ స్వామి.

ఒంగోలులో కోట సుబ్బయ్య, కావమ్మ దంపతులకు 11-8-1885న సగన్నాథ స్వామి జన్మించారు. పసివాడుగా ఉన్నప్పుడే ఉయ్యాలలో యోగాసనాలు వేసేవాడు. మహర్షులు సూక్ష్మరూపంలో వచ్చి మాట్లాడి వెళ్ళేవారట. మిఠాయి దుకాణంలో కొంతకాలం పనిచేశాడు. ఒకసారి కోతికొమ్మచ్చి ఆడుతుంటే కేశవరాజ యోగీంద్రులు వచ్చి ఆకాశమార్గంలో తీసుకొని పోయి శ్రీశైల గుహల్లో దింపాడు. అక్కడి మహర్షులు పరకాయ ప్రవేశం వంటి మహా సిద్ధులు నేర్పారు. త్రిమూర్తులు ప్రత్యక్షమై మానవలోకంలో దేవాలయాలను నిర్మించి భక్తిని ప్రచారం చేయమని ఆదేశించారు. ఆయనతో ఆడుకొంటున్న పిల్లలు ఇతడు కనిపించకపోయే సరికి కంగారు పడ్డారు. కొన్ని రోజుల తర్వాత ఆయన ఇంటికి వచ్చి, జరిగినవి అందరికి చెప్పాడు. ఒకసారి పొర్లు దండాలు పెట్టుకొంటు ఒకచోట ఆగి అక్కడ ఆంజనేయస్వామి ఆలయం నిర్మించమని గురువైన లక్ష్మీకాంత యోగికి చెప్పాడు. వెంటనే అక్కడ దేవాలయం నిర్మించారు. వల్లపాడులో నరసింహ స్వామి కొండపై శివకేశవులు ప్రత్యక్షమై యోగవిద్యను, మంత్ర, ఉపదేశాలు చేసి ధార్మిక ప్రవృత్తిని ప్రజల్లో ప్రచారం చేయమని కోరారు. దాని ప్రకారం ఎల్లలూరు, మందాల, చేబ్రోలు, బ్రాహ్మణ కోడూరులలో భక్తినీ, యోగాన్ని విస్తృతంగా ప్రచారం చేశారు.

జగన్నాథునికి చెంచులమ్మతో వివాహం జరిగింది. ఆమె కొద్ది కాలానికి మరణిస్తే కోటి రత్నమ్మతో మళ్ళీ పెళ్లి జరిగింది. సీతమ్మ అనే ఆడపిల్ల పుట్టింది. భార్యకు రోజు ఇరవై ఒక్క ఇళ్ళల్లో భిక్ష చేసుకొని బ్రతకమని చెప్పి, ఆనందాశ్రమం చేరాడు. భార్య మరణిస్తే, పిల్లను బాపట్లకు తీసుకొని వచ్చాడు. అక్కడ బొమ్మిసెట్టి సుబ్రహ్మణ్యం, శేషారత్నం దంపతులు స్వామికి భిక్షనిచ్చే వారు. ఒకసారి భక్తులందరూ కలిసి కలశ పూజ పెద్ద ఎత్తున చేసి అన్నదానం చేశారు. అప్పుడు ఆకాశం మేఘావృతమై విపరీతంగా వర్షం కురిసేటట్లుంది. చేసిన ప్రయత్నాలన్నీ వృథా అయ్యే ప్రమాదం వచ్చింది. స్వామి మేఘాలను తొలగిపొమ్మని ఆదేశిస్తే అవి ఎక్కడికో వెళ్లిపోయాయి. చుక్క వర్షం కూడా పడకుండా సంతర్పణ జరిగి స్వామి మహిమ బయటపడింది.

జగన్నాథస్వామి ఉత్తర, దక్షిణ యాత్రలు చేశాడు. కాశీలో భక్తులతో గంగలో పవిత్ర స్నానాలను చేయిస్తుండగా వారు "స్వామీ! మా పాపాలు పోయాయి అనటానికి

రుజువేమిటి?" అని అడిగారు. స్వామి వారితో ప్రార్థన చేయించి తమ చేతిలో గంగా జలాన్ని విడువమని చెప్పాడు. అప్పుడు కొన్ని పీపాల నూనె పోసినట్లు గంగ నీటిపై నూనె తెట్టు వ్యాపించింది. అంటే వారి పాపాలన్నీ పంకిలమై బయటికి తెట్టులాగా కొట్టుకుపోయాయన్న మాట.

నల్లపాడులో ఉండగా కేశవరాజ యోగి ఆయన్ను ఆవేశించి ఒక పుడకతో ఇసుకమీద ఆలయ నిర్మాణానికి ప్లాన్ గీసి, కోమ్మమూరు నరసింహం అనే కరణం దాన్ని కాగితం మీద కాపీ చేశాడు. దేవాలయ నిర్మాణం కోసం తగిన స్థలం కోసం వెదుకుతున్నాడు స్వామి. చీరాల నుండి పొన్నూరు దాకా పొర్లుదండాలు పెట్టుకుంటూ అక్కడి బస్‌స్టాండ్ ఎదురుగా ఆగిపోయాడు. అది మహర్షులు పూర్వం తపస్సు చేసిన భూమి అని గుర్తించి అక్కడే దేవాలయాన్ని కట్టాలని సూచించాడు. విరామం లేకుండా చుట్టూ ప్రక్కల గ్రామాలన్నీ తిరిగి చందాలు వసూలు చేసి 1108 మంది దంపతులతో "సహస్ర లింగేశ్వరస్వామి ఆలయం" కట్టించారు. స్వామి ఆదేశం ప్రకారం ఎడ్లపాడు కొండ దగ్గర రెండేళ్లు నిష్టగా ఉండి కనిగాల్పుల ఆంజనేయులు, జాలమ్మ దంపతులు రెండు తాడిచెట్ల ఎత్తున వుండే రాయిని తీయించి చాలా పెద్ద ఆంజనేయస్వామి విగ్రహాన్ని నెటకొల్పారు. ఆ కొండమీద ఉండే చిరుతపులులు ఈ దంపతుల జోలికి రాకుండా స్వామి కట్టడి చేశాడు. కొన్ని వేలమందికి దీక్షలనిచ్చి జపాలు చేయించాడు. బొంబాయి నుంచి పెద్ద ట్రాలీలు తెప్పించి దానిపై ఆ భారీ విగ్రహాన్ని చేర్చి 100 జతల ఎడ్లతో దాన్ని లాగించి చేబ్రోలు వంతెన దాకా తెప్పించారు. వంతెన కూలిపోతుందని ప్రభుత్వం అనుమతించలేదు. స్వామీ తాను పూచీ వహించి, యే ప్రమాదం లేకుండా వంతెన దాటించి యోగబలంతో పొన్నూరు దేవాలయ ప్రాంగణానికి తెప్పించారు. ఆంజనేయ, గరుడ విగ్రహాల ప్రతిష్ట అత్యంత వైభవోపేతంగా జరిపించారు. ఆంజనేయులు దంపతులకు ఒక పిల్లాడున్నాడు. దంపతులను వైకుంఠానికి పంపుతాను వెళ్తారా అని అడిగారు స్వామి వారు వద్దు అన్నారు. అప్పుడు వారి పుణ్యఫలాన్ని కొడుక్కి ధారపోయించి, అతన్ని వైకుంఠం పంపారు జగన్నాథస్వామి. అతని సూక్ష్మ శరీరం ఆంజనేయ ఆలయంలో ఉండేటట్లు చేసి, ఆ దేవాలయానికి గొప్ప ప్రచారం కల్పించారు. జాలమ్మ చేత 108 ఏకాదశీ వ్రతాలు స్వామి చేయించారు.

ఒకసారి శ్రీశైల యాత్ర చేస్తూ కాలినడకన భక్తులతో వెళ్తూ కొండమీద నుంచి లోయలోకి జారిపడ్డాడు. ఒక మహర్షి ఆయన పడిపోకుండా ఒళ్ళోకి తీసుకొని స్వామి నాలుకపై బీజాక్షరాలు రాశాడు. వేరొక సారి కేశవరాజ స్వామి జగన్నాథస్వామిని జీవుడిని పరలోకాలకు తీసుకొని వెళ్లి, త్రిమూర్తుల లోకాలు చూపించి నాలుగు గంటల తర్వాత మళ్ళీ ఆనందాశ్రమంలో చేర్చాడు. స్వామి చీల్చి, ఒక గొట్టంలాంటి నరం పెట్టి మూసేశాడు. అప్పటి నుండి పరకాయ ప్రవేశ విద్య అలవడింది. కేశవస్వామి చెప్పి చూపించిన చెట్టు ఆకులు తిని రెండు నెలలు ఆకలి దప్పులు లేకుండా గడిపాడు. చెట్లు



ఎక్కి దూకటం ఆయనకు అలవాటు. కొమ్మ నుంచి కొమ్మకు దూకటం పూరకం, చిటారు కొమ్మకు ఎగరటం కుంభకం, కింది కొమ్మ మీదికి దూకటం రేచకం కేశవ స్వామే నేర్పారు. ఆయనకేమీ దెబ్బలు తగిలేవి కావు.

కాలభైరవ ఆలయాన్ని అమరా రాధాకృష్ణమూర్తి దంపతులచే కట్టించారు. ఆపరేషన్ లేకుండా మద్దుల వెంకట తర్నమ్మకు బల్ల వ్యాధిని పోగొట్టారు. నొసట బొటన వ్రేలితో నొక్కి సుబ్రహ్మణ్యం అనే భక్తుడి జ్వరం తీసేసి తాను పొందాడు. స్వామి ఒకసారి పరకాయ ప్రవేశం చేస్తున్నాడు. దాన్ని ఎవరు చూడకుండా ఒక గదిలో అటక ఎక్కి కూర్చున్నాడు. స్వామి హంసను వదిలాడు. అప్పుడేర్పడిన ప్రకాశానికి అటకెక్కిన తుంటరి రెండు కళ్ళుపోయాయి. మాటలు రానివాడికి మాటలు నేర్పాడు. ఒకసారి చందోలు వెళ్లి వెంకటేశ్వర్లు అనే ఆయన ఇంటి అరుగుమీద కూచున్నాడు. ఎవరు పలకరించలేదు. అప్పుడు ఆ వూరి బ్రాహ్మీమూర్తి అమ్మ అనుగ్రహానికి పాత్రులై ఏది పలికితే అది జరిగే తాడేపల్లి రాఘవ నారాయణ శాస్త్రిగారు చూసి వెంకటేశ్వర్లకు కబురు చేసి ఆదరించేట్లు చేశారు. భగవద్గీత నేర్పమని బొమ్మిశెట్టి సుబ్రహ్మణ్యం అనే అతను కోరితే చెంబులోని నీళ్ళు మూడు దోసిళ్ళు ఇచ్చి తాగించాడు, తెల్లారేసరికి భగవద్గీత వచ్చేసింది ఆయనకు. ఇలాంటివెన్నో మహిమలు చూపాడు స్వామి.

భక్తులు జగన్నాథస్వామికి ఏటేటా ఆరాధనోత్సవాలు జరిపేవారు. జయన్తులను జరుపుకొనేవారు కాదు. దీనికి కారణం ఏమిటని ఆరాధన అంటే ఏమిటని ప్రశ్నిస్తే "ఆ అంటే ఆత్మా అని, రా అంటే రాముడని, ధన అంటే ధనం" అనీ చెప్పారు. అంటే "ఆత్మా రాముడు అనే ధనం సంపాదించాను. కనుక నాకు ఆరాధనే సరి అయినది" అని విస్పష్టంగా చెప్పాడు. 10-9-1974లో జగన్నాథస్వామి శరీరం చాలించారు. భాద్రపద నవమి నాడు స్వామి ఆరాధనోత్సవాన్ని భక్తులు వైభవంగా నిర్వహిస్తున్నారు.❀

# ఆధునిక శుక యోగీస్ర్దులు మళయాళ స్వామి

అనుష్టాన వేదాంతాన్ని ప్రచారం చేసి కూర్మంలాగా అంతా దాచుకొని ఉండి, స్త్రీలకూ దీక్షనిచ్చి కులంకు ప్రాధాన్యత నివ్వని యోగి పుంగవులు మళయాళ స్వామి.

కేరళలోని తిరువాయుర్ సమీపంలో కరియప్ప, నొత్తియమ్మ దంపతులకు 29-3-1885 జన్మించారు. వేళప్ప అని పేరు పెట్టారు. ఒక బైరాగి చూసి సర్వసంగ పరిత్యాగి అవుతాడని జోస్యం చెప్పాడు. పసితనం నుండే నేలమీదనే హాయిగా నిద్రపోయేవాడు. జీవకారుణ్యం పుట్టుకతోనే వచ్చింది. పంజరంలోని పక్షులను విడిపించేవాడు. ఇంటి దగ్గర కుటీరంలో ఎప్పుడు ధ్యానంలోనే ఉండేవాడు. ఒకసారి అన్న చూసి కోపంతో చెంపమీద చెళ్ళుమనిపించి వెళ్తుంటే ద్వారం దగ్గర అడ్డంగా తెల్లని నంది కనిపించింది. భయమేసి తల్లికి చెప్పాడు. ఇంగ్లీషు చదవటం ఇష్టంలేక సంస్కృతం నేర్వటానికి వెళ్లిపోయాడు.

తిరువంతపురానికి దూరంలో శివగిరి చేరాడు అక్కడి “నారాయణ గురుదేవు”ల ఆశ్రమం ఉంది. ఆయన సామాజిక విప్లవకారుడు. మానవులంతా ఒకే కులం, ఒకే జాతి అనేవాడు. ఆయన శిష్యుడు శివలింగస్వామి పెరింగోత్కర గ్రామంలో ఆధ్యాత్మ విద్య బోధించేవాడు. వేళప్ప ఆయన్ను చేరాడు. అందరు ఇతన్ని “భక్తాన్” అనేవారు. మంత్రోపదేశం చేసి, యోగ రహస్యాలు నేర్పాడు గురువు. పాతంజలి యోగ రహస్యాలు అలవడ్డాయి. నారాయణ గురు దర్శనం చేసి త్వరలోనే బ్రహ్మానంద దర్శనం కలుగుతుందనే ఆశీస్సు పొందాడు వేలన్. ఇంటికి వెళ్లి జబ్బుతో ఉన్న అమ్మకు సేవలు చేసి నయం చేశాడు. వివాహ ప్రయత్నాలు చేస్తే తిరస్కరించాడు.

వేళప్ప కాలి నడకన దేశంలోని అన్ని పుణ్యక్షేత్రాలను సందర్శించాలని బయల్దేరాడు. రోజుకు ఇరవై మైళ్ళు నడిచాడు. ఎవరైనా ఏదైనా పెడితే తినేవాడు. రక్త విరోచనాలతో ఒక వారం ఒక సత్రంలో బాధపడ్డా, ఇంటికి వెళ్ళలేదు. స్వప్నంలో ఎవరో వచ్చి ఒక మాత్ర నోట్లో వేశారు. మళ్ళీ యే రోగము రాలేదు. ఓంకారేశ్వర్, గిర్నార్, ద్వారకలను సందర్శించి కాశ్మీరం వెళ్లాడు. కురుక్షేత్రంలో గీతా పారాయణం ముగించి, హరిద్వారం, ఋషికేశం చేరి, బదరికాశ్రమంలో పితరులకు పిండప్రదానం, సమస్త ప్రాణికోటికి బ్రహ్మార్పణం చేసి, నైమిశారణ్యంలో కొన్ని రోజులుండి, అయోధ్యలో రామ తారక మంత్రం లక్షసార్లు జపించి, ప్రయాగ ప్రతివేణీ సంగమ స్నానం చేసి, ఆ జలాన్ని కాశీ విశ్వేశ్వరునికి అభిషేకించి అక్షర లక్షలు శివ మంత్రం జపించి, నవద్వీపంలో భజనలు చేసి, కలకత్తా, పూరీ, సింహాచలం, శ్రీశైలం క్షేత్రాలు దర్శించి తిరుమల శ్రీనివాస దర్శనం చేసి, గోగర్భ క్షేత్రం చేరాడు. అది తపస్సుకు అనుకూలమైన ప్రదేశంగా



భావించాడు. అరుణాచలం, చిదంబరంలలో అక్షరలక్ష శివమంత్రం జపించి, పతని, రామేశ్వరాల మీదుగా కన్యాకుమారి చేరి, నెల రోజులుండి మళ్ళీ నారాయణ గురు పాద సన్నిధికి చేరాడు. గురువు అనుమతితో ఇంటికి వెళ్లాడు. తండ్రి అప్పటికే చనిపోయాడు. 29 ఏళ్ళ వయసులో మళ్ళీ ఇల్లు వదిలి కుర్తాళం వగైరా ప్రదేశాలు తిరిగి తిరుమలలోని “గోగర్భ క్షేత్రానికి” చేరుకొన్నాడు.

అవి భారత స్వాతంత్ర్య ఉద్యమం రోజులు. స్వరాజ్యంతో పాటు “స్వారాజ్యం” అంటే “ఆత్మా రాజ్యం” రావాలని అప్పుడే శ్రేయస్సు అని భావించాడు. భగవంతున్ని “అతీత వైరాగ్యం”, అఖండ బోధ, ఉత్తమ సమాధి నిష్ఠ, సర్వభూత సమదృష్టి తనకు లభించాలని కోరుకున్నాడు. గోగర్భంలోని పాండవ గుహల్లో తపస్సు చేస్తూ, తిరుమలలో భిక్షాటన చేసి, ఒకపూట మాత్రమే తింటూ కొంతకాలం గడిపి, చివరికి అదీ మాని పితృదేవతలకు పెట్టే పిండాలను అంటే పచ్చి పిండిని తినేవాడు. ఆయన భాష, వేషం చూసి “మళయాళ స్వామి” అని పిలిచేవారు. అదే వాడుక నామము అయింది.

మైసూరు తిరువెంకటాచార్యుడు వెంకటేశ్వర పూజ చేసి రోజు ప్రసాదం ఇచ్చి వెళ్ళేవాడు స్వామికి. మూడు రోజులు విపరీతంగా వర్షాలు పడి కదిలే వీలు లేకపోతే వెంకటేశ్వర స్వామి సుబ్బరామ శెట్టి అనే అతనికి కలలో కన్పించి స్వామికి ఆహారం పెట్టమని ఆదేశించాడు. ఆయన వెదురు గడకు ప్రసాదం రతట్టి ఆవలి ఒడ్డున ఉన్న స్వామికి అందజేశాడు. భగవంతుడే ఆహారం పంపితే తింటాను అని ప్రతిన చేశాడు. అప్పట్నించి ఎవరో ఒకరు సమయానికి ఆహారం సమకూర్చేవారు.

తరిగొండ వెంగమాంబ గుహకు దగ్గరలో పాక వేసుకొని స్వామి ధ్యానం చేశాడు. పెద్దపులి వస్తే, భగవంతుడిని ప్రార్ధించగానె అది పారిపోయింది. ఒకసారి తీవ్ర తపస్సులో ఉండగా మృగం అనుకొని పొదలచాటు నుండి ఒక వేటకాడు రెండుసార్లు తుపాకి పేల్చాడు. అదేమీ ఆయనకు తగల్లేదు. వెంగమాంబ స్వామిని దీవించింది. తనను తానే పరిరక్షించుకోవాలని ఒకసారి సనకస నంద తీర్థం నుండి, తుంబురు తీర్థానికి వెళ్లారు. భక్తులు స్వామి కనపడక కంగారు పడ్డారు. ఒక భక్తుడు దారి తప్పి ఇక్కడికి వచ్చి స్వామిని చూసి ఆనందంతో ఆహారం అందించాడు. ఒకాయన ఎందుకు మీరు తపస్సు చేస్తున్నారని ప్రశ్నిస్తే “భగవంతుని నిరంతర సందర్శనం కోసం” అని చెప్పారు. వేయి కాళ్ళ మండపంలో బిచ్చమెత్తే పిల్లలకు ప్రసాదం పెట్టే ఏర్పాటు చేశారు స్వామి. కొతంబేడులో కలరా వ్యాపిస్తే అక్కడికి వెళ్లి తపశ్శక్తితో తగ్గించారు. తొమ్మిదేళ్ళు తపస్సు చేసినా ఆత్మ సాక్షాత్కారం లభించలేదు. ఒకరోజు పన్నెండేళ్ళు తపస్సు చేస్తే కలుగుతుందని అంతర్వాణి వినిపించింది. ఆయన నలభైవ ఏట అనుకొన్నట్లుగానే ఆత్మ సాక్షాత్కారానుభూతి పొందారు.

తిరుమల విడిచి “ఏర్పేడు” దగ్గర “కాశీ బుగ్గ”లో ఆశ్రమం ఏర్పాటు చేసుకొన్నారు. కాళహస్తి జమీందార్ కుమార వెంకట లింగమ నాయనిగారు స్థల

దానం చేసి ఇప్పుడున్న ఆశ్రమాన్ని నిర్మించే ఏర్పాటు చేశారు దాన్ని "వ్యాసాశ్రమం" అంటారు. వ్యవసాయ క్షేత్రం ఏర్పరచి, పంటలు పండించారు. జంతు బలి మాన్పించారు. "యదార్థ భారతి" అనే పత్రికను స్థాపించి అనేక వేదాంత విషయాలను రాసి పుస్తకాలుగా తెచ్చారు. అన్ని వర్ణాల వారికి సంస్కృతం నేర్పించారు. వ్యాసాశ్రమం ఆధ్యాత్మ విప్లవ కేంద్రమైంది. కేరళలో నారాయణ గురుగారు ఏమి బోధించారో. వ్యాసాశ్రమంలో అది అమలు పరచారు. బందరులో పట్టాభి సీతారామయ్య గారింట్లో గాంధీజీని కలసినపుడు ఆయన స్వామి సేవలను బహుధా ప్రశంసించారు. దగ్గరలో ఉన్న "కురుమద్దాలి పిచ్చమ్మ అవధూత"ను స్వామి దర్శించారు.

1937 "ఓంకార సత్రయాగం" రాజమండ్రిలో ప్రారంభించి స్త్రీలకూ, ఇతర కులాల వారికి ప్రణవాన్ని బోధించారు". 1943లో శివగిరిలో జ్ఞాన యజ్ఞం చేసి చేసిన జ్ఞానబోధ భారతీయ తత్వ చరిత్రలో ఒక అపూర్వ అధ్యాయం" అన్నారు బిరుదు రాజుగారు. 1945 ఒక స్త్రీకి సన్యాస దీక్షనిచ్చి చరిత్ర సృష్టించారు. 1951లో రాజమండ్రిలో రెండవ చాతుర్మాస్యం చేసినపుడు, వేలాదిమంది పంచములు పాల్గొన్నారు. అప్పుడు ఆ దృశ్యాల్ని చూసి మహా పండితులు, సర్వవేద శాస్త్రాధ్యాలు వేద ప్రవచన నిపుణులు బ్రహ్మశ్రీ చర్ల గణపతి శాస్త్రిగారు మహదానందపడి మనస్ఫూర్తిగా ఆశీర్వదించారు. వ్యాసాశ్రమంలో కొన్ని వందల సంఖ్యలో గ్రంథాలను ప్రచురించి ఆస్తిక జనాలకు అందించారు.

మళయాళ స్వామి వేదాంత ప్రచారానికి ఎంత ప్రాముఖ్యత నిచ్చారో సంఘ సంస్కరణకు అంతే ప్రాధాన్యమిచ్చారు. "ఆంధ్ర నారాయణ గురు" అనిపించుకొన్నారు. వ్యాసాశ్రమ పూజా కార్యక్రమాలలో "పరబ్రహ్మ గోత్రోద్భవస్య, పరబ్రహ్మ గోత్రోద్భవాయా" అని సంకల్పం చెప్పించేవారు. ఆహార నియమాలలో, ఆశ్రమ నిర్వహణలో కఠోర నియమాలు పాటించేవారు. ఆ సేతు హిమానగం పాదాలకు చెప్పులు లేకుండా తిరిగిన మహానుభావులు మళయాళ స్వాములు. అనారోగ్యంతో బాధపడుతున్నా పాయకాపురం షాద్ నగర్, టాగిల్లా పురంలో జరిగిన సనాతన సభలకు వెళ్లారు. తన తర్వాతి ఆశ్రమాధిపతులుగా విమలానంద స్వామిని నియమించారు. 12-7-1962లో మళయాళ స్వామి కైవల్యం పొందారు. మండలారాధనలో ముప్పై వేలమంది పాల్గొని స్వామివారిని అర్చించారు. వ్యాసాశ్రమానికి దేశం నిండా అనేక శాఖలున్నాయి. విద్యా ప్రకాశానంద స్వామికి మళయాళ స్వామి గురువులు. వీరి శుకాశ్రమాన్ని వారే ప్రారంభించారు. ఇప్పుడు విద్యానందగిరి ఆశ్రమాన్ని నిర్వహిస్తున్నారు. ఎక్కడో పుట్టి, ఎక్కడో పెరిగి ఆంధ్రదేశం చేరి ఎందరికో మార్గదర్శకులై జీవితాన్ని గడిపిన ఆధునిక శుక యోగీంద్రులు మళయాళ స్వామి చరిత్ర పుణ్య ఫలం.❁





# హఠయోగి బ్రహ్మానంద సరస్వతి స్వామి

కృష్ణాజిల్లా విజయవాడ దగ్గర పటమటలో 27-9-1863న గోవింద రాజు రాఘవయ్య, తిరుమలాబకు జన్మించారు. పానకాలు అని పేరు పెట్టారు. యనమలకుదురు వాస్తవ్యులు గోవింద రాజు సీతమ్మ, నరసింహారావు దంపతులు దత్తపుత్రునిగా స్వీకరించారు. రామప్ప అని పిలిచేవారు. బందరులో చదివారు. గాయత్రి, శివ పంచాక్షరి, రామ షడాక్షరి వగైరాలను దీక్షగా జపించారు. పెంపుడు తల్లిదండ్రులు చనిపోయారు. దేశ యాత్రలు చేస్తూ శ్రీశైలం చేరి ఒక బాబాజీ సత్సంగం పొంది, లోక జ్ఞానం పొందాడు. సాదు, సత్పురుషులను సేవిస్తూ కాలం గడిపాడు. గౌడ యతీశ్వరుడు ఒకాయన కనిపించి దత్తాత్రేయ ఉపాసన చేయమని బోధించారు. మళ్ళీ క్షేత్ర సందర్శన చేస్తూ, ప్రముఖ దత్తోపాసకులైన "వాసుదేవానంద సరస్వతి" వారిని దర్శించి, ప్రబోధం పొందారు. తీర్థయాత్రలు కొనసాగిస్తూ మానసిక ప్రశాంత స్థితిని పొందారు. సన్యాసాశ్రమంపై తీవ్ర కోరిక పెరిగింది. శ్రీ సచ్చిదానంద సరస్వతి యతీంద్రులు సన్యాస దీక్షనిచ్చి, "బ్రహ్మానంద సరస్వతి" అనే యోగనామం పెట్టారు.

బ్రహ్మానందులు నేపాల్ చేరి "ముక్తినాథ క్షేత్రం"లో ఘోర తపస్సు చేసి చిత్తాన్ని ఏకాగ్రం చేస్తేనే మనస్సు స్వాధీనపడుతుందని భావించాడు. హఠయోగమే శరణ్యం అని నిశ్చయించుకొన్నారు. కొన్ని నెలలు "పంచ గవ్య ప్రాసన" చేశారు. మహారాష్ట్ర చేరి నారాయణ దాస బావాజీ ఉపదేశంతో శరీర శోధన చేశారు. ధోతి, బస్తీ, నేతి, నోలి, వజ్రోలి, త్రాటకం అనే ఆరు క్రియలతో ప్రాణాయామ పూర్వకయోగం చేశారు. నైమిశారణ్యం చేరి పరమ విరాగి అయ్యారు. కురుక్షేత్రం వెళ్లి భగవ ధ్యానమే వాసనా క్షయానికి దాని అని తెలుసుకొన్నారు. శృంగేరి చేరి సచ్చిదానంద శివాభినవ నృసింహ భారతీ జగద్గురు వరేణ్యులను దర్శించారు. వారి సన్నిధిలో భాష్య శ్రవణం చేశారు. శ్రీ వాసుదేవానంద సరస్వతి స్వామిని కలిసి, వారు ఆంధ్రదేశంలో పర్యటించినపుడు రాజమండ్రిలో శంకరమఠంలో దత్తాత్రేయ స్వామిని, పాదుకలను ప్రతిష్టింప జేశారు. రుతంభర ప్రజ్ఞతో పాటు అనేక సిద్ధులు సాధించారు.

ఇప్పటి దాకా బ్రహ్మానందులు చేసినది అంతా ఆత్మా ఉద్ధరణ కోసం. ఇప్పుడు లోకోద్ధారణం గురించి ఆలోచించారు. సనాతన ధర్మ ప్రచారం చేస్తూ, దేశ సంచారం చేస్తూ, మంత్ర దీక్షను చాలామందికి ఇచ్చారు. అందరికి అర్థమయ్యే తెలుగులో "శ్రీ దత్తం శరణం మమ" అనే అక్షరాలను అమర్చి చిత్రపటం ముద్రించి, పూజా పుస్తకాన్ని కూడా అచ్చు వేయించి అందరికి పంచారు. శ్రీ శంకరాచార్య సహస్ర నామావళి రచించారు. "శ్రీ దత్తం శరణం మమ" అనే శీర్షికతో 108 శ్లోకాలను సంస్కృతంలో

రాశారు. అనేక పుస్తకాలను రాసి ప్రచురించారు. అందులో "యోగాభ్యాస దర్పణం", సజ్జన సేవ, తీర్థాటనం వగైరాలున్నాయి. కాశీలో ఉండగా గురుదేవులు మరణించిన వార్త తెలిసి అక్కడి నుండి గరుడేశ్వర్ చేరి అంత్యక్రియలను గురుదేవునికి నిర్వహించారు. మహారాజ బంగారు నవర్సులున్న 18 కిరసనాయిల్ డబ్బాలు, వెండి రూపాయలున్న 18 కిరసనాయిలు డబ్బాలు గురువు అందించమన్నారని చెప్పి వీరికి అందజేశారు. అందరితో సంప్రదించి ఆ డబ్బును హరిద్వారం, బదం, గరుడేశ్వర్ మొదలైన చోట్ల మఠాలు నిర్మించటానికి సద్వినియోగం చేశారు.

ఒకసారి బ్రహ్మానందులు నిజాం రాజ్యంలో రైల్‌లో ప్రయాణిస్తుంటే ఒకచోట బండి ఆగిపోయింది. డ్రైవర్ ఆంగ్లేయుడు. ఎంత ప్రయత్నించినా అది కదలలేదు. డ్రైవర్ దగ్గరకు వెళ్లి ఎందుకు కదలటం లేదని అడిగితే వాడు జాతి అహంకారంతో "YOU GO FOOL UNSUCESSFUL DIRTY MAN, A MONK ASKS ME?" అని తిట్టాడు. వెంటనే బ్రహ్మానందులు "Yes, Yes. You are correct. Iam a lesser fool. Dont you see you unsucessful now. Yes Iam a monk. But not a monkey like you. You come down, first, with your fire man" అని సమాధానం చెప్పేసరికి వాడు డంగై దిగాడు. స్వామి ఇంజన్‌లోకి వెళ్లి అక్కడ తమ దండంతో ఒకచోట తాకారు. అది వెంటనే పనిచేయటం ప్రారంభించింది. డ్రైవరు ప్రయాణీకులను బండి దిగమని చెప్పి గార్డ్‌ను రమ్మన్నాడు. గార్డును తీసుకొని రావటానికి ఫయిర్ మాన్‌ను పంపాడు. అతడు వెళ్లి చూస్తే గార్డ్ స్థానంలో బ్రహ్మానందులు మహా నిష్ఠలో తపస్సులో ఉన్నారు. డ్రైవర్ వెంటనే స్వామి దగ్గరకు వెళ్లి నమస్కరించి "Jesus in India. Iam forunate. I have seen with my eyes. You all people say three cheers to the monk Christ" అని చెప్పి అందరి చేతా నమస్కరింపజేశాడా ఆంగ్ల డ్రైవర్.

ఒకసారి స్వామి అహ్మదాబాద్‌లో సంచరిస్తుండగా కర్ఫ్యూ విధించారు. ఆ సమయంలో వారు అర్థరాత్రి రైల్ దిగి ఒంటరిగా ఆశ్రమానికి పోతుంటే, పోలీసులు పట్టుకొని జైలులో పెట్టారు. స్టేషన్ ఇన్స్పెక్టర్ భార్యకు కలలో స్వామి కనిపించాడు. కంగారుగా, ఆమె భర్తను లేపి స్టేషన్‌కు వెళ్ళమంది. ఆయన వెళ్లి చూసి, ఆశ్చర్యపోయి వెంటనే విడుదల చేసి ఇంటికి తీసుకొని వెళ్లి పూజించి శిష్యుడై, దత్త మంత్రం ఉపదేశం పొందాడు. ఆ తర్వాత జన్మించిన కొడుకుకు "దత్త బ్రహ్మానంద మూలే" పేరు పెట్టుకొన్నిరా దంపతులు.

మరోసారి బళ్ళారిలో ఒక జడ్జి ఇంటిముందు భిక్షాటన చేస్తుంటే, ఆయనకు కోపం వచ్చి "వీడిని మెడబెట్టి దూరం తొయ్యి" అని జవానుతో అన్నాడు జడ్జి. స్వామి ప్రశాంతం చిత్తంతో "జవానుకు వీలు కాదు. మీరే రండి"అని వెళ్లిపోయాడు. జడ్జి భార్యకు విపరీతంగా కడుపు నొప్పి వచ్చింది. డాక్టరు వచ్చినా తగ్గలేదు. ఈ కంగారులో జడ్జి కోర్ట్ మాట మరిచాడు. విధి నిర్వహణలో అలసత్వం అని అతన్ని తప్పించి రికార్డు స్వాధీనం చేసుకొన్నది ప్రభుత్వం. అప్పుడు ఎదురింటి వర్తకుడు ఇదంతా స్వామికి చేసిన అపచార ఫలితం అని జడ్జికి చెప్పాడు. జడ్జి ఊరంతా తిరిగి ఒక చెట్టుకింద జపం చేసుకొంటున్న స్వామిని చూసి, కాళ్ళమీద పడి క్షమించమన్నాడు. "అయిదు రోజుల్లో కుర్చీలో నిన్ను కూర్చోబెడతాను" అని స్వామి అభయం ఇచ్చారు కనికరించి. జనం విపరీతంగా అక్కడికి చేరారు. స్వామి ఉన్నట్లుండి అంతర్ధానమైపోయారు. మర్నాడు జడ్జి కోర్టుకు వెళ్లాడు. స్వామికోసం వెదికితే రైల్ ప్లాట్‌ఫాం మీద కన్పించారు. జడ్జిని మద్రాస్ రమ్మని ఆదేశం వచ్చింది. భార్య నెప్పి పోయింది. హైకోర్టు ఆయన్ను మళ్ళీ ఉద్యోగంలో చేర్చుకొనే ఆర్డర్ ఇచ్చింది. నాలుగు నెలల తర్వాత జడ్జి అభ్యర్థన మీద స్వామి ఇంటికి వచ్చి భిక్ష స్వీకరించారు అప్పుడు స్వామి "స్వబోధ దర్పణం" అనే టేబుల్ రాసిచ్చి జడ్జికిచ్చారు. రాత్రి పడుకొనే ముందు ఒకసారి చదువుకొమ్మన్నారు. జడ్జి ఆ తర్వాత సన్యాసం స్వీకరించి, ఆశ్రమ ధర్మాలను పాటించారు.

బ్రహ్మానంద స్వామివారు షష్టిపూర్తిని అందరు తమ ఇళ్ళల్లో జరుపుతామని తొమ్మిదిమంది పోటీపడ్డారు. ఆయన ఒకరింటికి వెళ్లి, మిగతా ఎనిమిది ఇళ్ళల్లోను ప్రత్యక్షమై భిక్ష, పాదపూజ అందుకొని అందర్ని సంతృప్తి పరచారు. 2-12-1938 బహుధాన్య మార్గశిర శుద్ధ దశమి శుక్రవారం నాడు ప్రతిరోజు లాగానే అర్చన కోసం స్వామివారి పాదుకలను శిష్యుడు దత్తుగారు తీసి చూస్తే అవి చెదలు పట్టి కన్పించాయి. ఏదో కీడు జరిగింది అని భక్తులు శంకించారు. రెండు రోజుల తర్వాత దత్తుగారికి కాశీలో స్వామి దశమినాడు అంటే పాదుకలు చెదలు పట్టినట్లు గమనించిన రోజునే సిద్ధిపొందినట్లు టెలిగ్రాం వచ్చింది. ఇది దత్తుగారికి స్వామివారు చూపిన నిదర్శనం. ❀

# బ్రహ్మ జ్ఞాన యోగి-బ్రహ్మస్వామి

**జ**న్మ జన్మల సంస్కారం సాధన, ఉత్తమ గురు శిష్యరికం, తపస్సు ఒక పశువుల కాపరిని బ్రహ్మజ్ఞానిగా రూపొందించాయి. ఆయనే లింగాల దిన్నె బ్రహ్మస్వామి.

తమిళనాడులో సేలంలో నుదురుపాటి లక్ష్మీ నరసయ్యకు 1820లో జన్మించారు. అసలు పేరు నరసయ్య. చిన్నప్పుడే గన్నమ్మతో వివాహమైంది. బర్రెల కాపరిగా బతికారు. పదిహేనేళ్ళ వయసులో సేలం కొండపై శ్రీలక్ష్మీ నరసింహస్వామి జయంతి ఉత్సవాలకు వెళ్లి ఒక గుహలో యోగుల దర్శనాన్ని పొంది, శ్రీలహ నృసింహ మహామంత్రాన్ని ఉపదేశం పొంది, ఆయన అనుగ్రహంతో కళ్ళు మూసి తురిచేలోపు కాశీ వెళ్లాడు నరసయ్య. ఎంత వెదికినా నరసయ్య కనిపించకపోయే సరికి చనిపోయాడని అనుకొన్నారంతా. కాశీలో కడపజిల్లా కంబాల దిన్నెవాసి అచ్చన సోమయాజి కనిపించి, చదువు నేర్పిస్తానని తీసుకొని వెళ్లి గొడ్లకాపరిగా, కూలీగా, మంచి నీళ్ళు మోసే వాడిగా అరవ చాకిరీ చేయించాడు. కాని చదువు నేర్పించనేలేదు. ఏదైనా పెడితే తినటం లేకపోతే పస్తుగా గడిపాడు నరసయ్య. పిచ్చి నరసయ్య అని అందరు పిలిచేవారు. ఒకరోజు మిద్దె మీద అందరితో బాటు పడుకొన్నాడు. కుంభవృష్టి కురిసింది. అందరు కిందికి దిగి వెళ్లిపోయారు. నరసయ్యను మర్చిపోయారు. తెల్లవారి వచ్చి చూస్తే అతను పడుకొన్న భాగంలో చుక్కనీరు కూడా పడకపోవటం గమనించి అందరు ఆశ్చర్యపోయారు. పిచ్చి నరసయ్యకు మహాయోగిను గుర్తించి మర్యాద చేశాడు యజమాని.

ఎవరికి చెప్పకుండా బెస్తవారప్పేట చేరి త్రిపురారి భట్ల బుచ్చి వెంకట దీక్షితుల వద్ద విద్యార్థిగా చేరి ఏదో కొంత నేర్చాడు. మంచి గొంతుతో అలవోకగా పాడేవాడు. తన తండ్రి ఆబ్దికం అని చెబితే దీక్షితులు పట్టించుకోలేదు. కోమటి గురుమూర్తి తద్దినానికి కావలసిన పదార్థాలన్నీ అందజేశాడు. అప్పట్నించి రోజు నరసయ్యకు కావాల్సిన అన్ని పదార్థాలు దీక్షితుల ఇంటికి పంపుతూ, ఆయన వద్ద రామాయణాదులు చెప్పించుకొని వినేవాడు. పిచ్చి నరసయ్యగా ముద్ర పడింది. ఒకసారి ఒక వేశ్యను ఉసిగొల్పి నరసయ్య వద్దకు పంపారు. అతని జితేంద్రియత్వానికి జోహారు చెప్పి పాదాక్రాంతురాలైంది ఆమె. మరోసారి కంబం తీసుకొని వెళ్లారు. వేశ్యల ఇళ్ళల్లో వదిలారు. ఆయన ముసుగు తన్ని పడుకొంటే ఆయన్ను బలాత్కారించటానికి వచ్చిన వేశ్యలకు, ఆయన ముసుగును తొలగిస్తే అయిదు తలల నాగుపాము కనిపించి భయపడి పోయారు. కాళ్ళమీద నడి క్షమా భిక్ష వేడుకొన్నారు. అప్పటి నుంచి నరసయ్య బ్రహ్మ స్వామిగా ప్రసిద్ధుడయ్యాడు.

భీమ గుండం చేరి సూర్యగ్రహణం రోజున గుండ స్నానం చేయటానికి వెళ్లి అందులో మునిగిపోయాడు. నరసయ్య ఎంతకూ రాకపోయేసరికి మునిగి చనిపోయాడని



అనుకొన్నారు. మరుసటి ఏడాది సూర్యగ్రహణం నాడు అందరు గుండానికి స్నానానికి వెళ్తే నీటిపై పద్మాసనంలో బ్రహ్మస్వామి కనిపించి, ఆశ్చర్యపడేశాడు. అప్పటి నుంచి ఆయన భక్తులు పెరిగి అడుగులకు మడుగులొత్తారు. విందు భోజనాలు ఏర్పాటు చేసేవారు. పెండ్లిలో లాగా నలుగు పాటలు, బువ్వం బంతి పాటలు, శోభనపు పాటలు మొదలైనవి పాడేవారు. ఆ పాటల్లో ఆయన్ను "సత్యపురి వాసి" అని పొగిడేవారు. మార్కాపురం తాసీల్దారు ఆయన్ను మేనాలో తీసికొని వెళ్తుండగా, మధ్యలో మాయమై, గుండ్లకమ్మ నదిలో స్నానం చేస్తూ కన్పించాడు. అక్కడికి వెళ్లి ఇంటికి తీసుకువెళ్ళారు.

ఒక శివరాత్రికి భక్తులు కొందరు తమతో శ్రీశైలానికి, కొందరు మహానందికి, కొందరు కాళహస్తికి రమ్మని ఆహ్వానించారు. అలానే అని చెప్పి ఆయా క్షేత్రాలలో వారితో స్నానం చేసినట్లు కనిపించి అందర్ని సంతృప్తిపరిచారు. స్వామి ముప్ఫై ఏళ్లు వచ్చాయి. ఒకసారి వత్తు మడుగు నుండి, తిమ్మరాజు పల్లెకు శిష్యులతో బయల్దేరారు. మార్గమధ్యమంలో కుంభవృష్టి కురుస్తోంది. అందరు భయపడ్డారు. తన వెనకాలే నడవమని చెప్పారు. వారికి ఫర్లాంగు దూరం అవతలే వర్షం పడింది. కాని వీరి మీద ఒక్క చినుకు కూడా పడలేదు, బెస్తవానిపేటలోని సుందరమ్మ అనే ఆమెకు వైకుంఠ ఏకాదశినాడు శ్రీ రంగం వెళ్లాలని కోరిక పుట్టి స్వామికి తెలియజేసింది. ఆయన తన అంగ వస్త్రాన్ని పరచి, ఆమెను అందులో కూర్చోమని, కండ్లు మూసుకోమని చెప్పి, మరుక్షణం శ్రీరంగం చేర్చాడు. అక్కడ తన తోటి వారందరితో రంగనాధుడిని దర్శించి, ద్వాదశి పారణకు స్వస్థలం చేర్చి మహిమ ప్రకటించారు స్వామి.

బ్రహ్మస్వామి భక్తుడు కరి బసప్ప లింగధారి. స్వామిని తన గ్రామంలో స్వామిని ఊరేగించాలని ఆశపడ్డాడు. అలానే పల్లకిలో తీసుకొని వెళ్లి ఊరి బయట విడిది చేయించి, మేళ తాళాలతో ఊర్లోకి తీసుకు వెళ్ళటానికి తోడిలింగధారులన్దర్నీ రమ్మన్నాడు. వారెవరికి ఇష్టం లేదు. లింగధారి కాని వాడికి ఈ సత్కారాలేమిటని విసుక్కొని, అలా చేస్తే వెలివేస్తామని బెదిరించారు. స్వామికి తన శిష్యుడికి వచ్చిన కష్టం తెలిసింది. వెల్దుర్తిలోని లింగధారులంతా భోజనాలకు ముందు తమ లింగకాయలు తెరిస్తే అందులో లింగాలు కనపడలేదు. అప్పుడు స్వామి మహిమ తెలుసుకొని కాళ్ళమీద పడి, బ్రహ్మాండంగా ఊరేగించి సత్కరించారు. ఆ ఊర్లో ప్రచండ శాక్తేయుడు మంత్రగాడు యాదాటి పాపయ్య ఉండేవాడు. సన్మాన సభకు వచ్చాడాయన. మనస్వామి ఆయనకు నమస్కరించనందుకు కోపం వచ్చి స్వామిపై అనేక దుష్ట ప్రయోగాలు చేశాడు. అతి క్రూరమైన "ధూమావతి"ని కూడా ప్రయోగించి విఫలుడైనాడు. మర్నాడు ఉదయం పాపయ్య స్వామి కాళ్ళమీద పడి క్షమించమని కోరాడు. తనకూ తుర్నిచ్చి పెళ్లి చేస్తానన్నాడు. స్వామి దగ్గరుండి, ఆ అమ్మాయికి మేనరిక వివాహం జరిపించారు.

స్వామి గొప్పతనం విన్న పుష్పగిరి పీఠాధిపతి శ్రీ శంకర భారతీ స్వాములు, తమ ఆస్థానానికి రప్పించుకొని "తూగుటుయ్యాల"పై ఊరేగించి సంభాషణం చేశారు.

నంద్యాలలో ఖాదర్బారు వెంకట్రావు ఇంట్లో కొన్నాళ్ళుండి, వారి బాధలు పోగొట్టి బంగారు పాదుకలు అనుగ్రహించారు. తొడుగు పల్లె అగ్రహారంలో బ్రహ్మ సత్రం చేశారు. అక్కడ ఒక బావిని తవ్వించి ఆ బావి నీటిని "కాశీ గంగ" అన్నారు. ఇప్పటికి ఆ జలాన్ని గంగగా భావిస్తారు జనం. రాయప్రోలు సుబ్బయ్య ఇంటికి ఒకసారి వెళ్లగా భక్తుల కోరికపై గాలిలో తేలుతూ ఇల్లంతా తిరిగి అందరిని ఆశ్చర్యపరిచారు. నూకరాజు పుల్లయ్య సంతానార్థం స్వామిని వేడుకొన్నాడు. పుల్లయ్యపై గిట్టనివాళ్ళు సర్ప ప్రయోగం చేయించారు. పెద్ద కొండచిలువ అంత నాగుపాము వచ్చి స్వామి సన్నిధిలో వాకిట్లో ఏమీ చేయలేక వాకిలికి అడ్డంగా పడుకొంది. స్వామి గడ్డిపరకను మంత్రించి దానిపైన వేస్తే చచ్చిపోయింది.

అచ్చమ్మ అనే భక్తురాలు స్వామిని ద్వాదశ పారణకు చాలాసార్లు ఆహ్వానిస్తే వస్తాను, వస్తాను అని దాట వేస్తుండేవారు. మరోసారి ఆమె ప్రార్థిస్తే ఒకసారి పారణ రోజున నల్లని వ్యక్తిగా వచ్చి భోజనం చేసింది తానేనని చెప్పారు. ఆమె కంచి గరుడ సేవ చూడాలని కోరితే ఉత్తరీయంలో మూటగట్టి చూపించి తీసుకొని వచ్చారు. దేవతార్చనలో పెట్టుకోవటానికి భక్తులకు అనేక పాదుకలు ఇచ్చారు. ఆయన అనేక భాషల్లో సంభాషించేవారు. కనిగిరి తాలూకా రామపురం నివాసి పద్మనాభుడు స్వామికి అనన్య భక్తుడు. సేవ బాగా చేసేవాడు. కాని మూగ. అతనితో "రామ" అనిపించి, తరువాత "రామ రామ" అనిపించి మాటలు వచ్చేట్లు చేశాడు. ఒకసారి స్వామికి కడుపునొప్పి విపరీతంగా ఉన్నప్పుడు శిష్యులు విందు భోజనానికి బలవంతం చేశారు. తమ యోగ దండాన్ని కడుపుకు తగిలి ఉండేటట్లు చేసి భోజనం చేశారు. ఆ బాధ అంతా దండం అనుభవిన్చేట్లు చేశారన్న మాట.

పుష్పగిరి అధిపతులు భారతీస్వాములు నిర్యాణం తర్వాత శ్రీలక్ష్మీ నృసింహ స్వామి పీఠాధిపతి అయ్యారు. ఆయన్ను బ్రహ్మస్వామి మీద చర్య తీసుకోమని ఒత్తిడి తెచ్చారు. బహిష్కార పత్రం పంపారు. బ్రాహ్మణ్యం బహిష్కారాన్ని సమర్థించలేదు. బ్రాహ్మణుల గురు ధిక్కారానికి అలిగి కోపించి ప్రాయశ్చిత్తం జరిగే దాకా చంద్రమౌళీశ్వర స్వామికి నివేదన చేయను అని పట్టుబట్టారు. స్వామికి ఇది తెలిసి తనవల్ల బ్రాహ్మణులు ఇబ్బంది పడటం ఇష్టంలేక ఔకును వదిలి జమ్మలమడుగు వెళ్లారు. అడిగిన వారందరికి దగ్గరుండి వడుగులు, పెళ్ళిళ్ళు, ప్రతిష్టలు స్వామి జరిపించేవారు. ఒకసారి కట్టిన ధోవతి మళ్ళీ కట్టుకునేవారు కాదు. మైలవరపు నరసింహారావు అనే ఆయన తిరుపతి వెళ్తూ కడపలో స్వామిని దర్శించటానికి వెళ్లాడు. "నిన్ననే నీ మొక్కు వెంకటేశ్వర స్వామికి చెల్లించారు" అని స్వామి చెప్పగా ఆశ్చర్యపడి తన ముడుపును స్వామి సన్నిధిలోనే అగ్నిహోత్రం కృష్ణమాచార్యులవారికి సమర్పించి తిరుపతి వెళ్లాడు. తిరుమలలో వెంకటేశ్వర స్వామి ఆయనకు కలలో కన్పించి "నీ మొక్కు కడపలోనే నిన్న తీరిపోయింది" అని చెప్పాడు. అప్పటి నుంచి తిరుపతి మొక్కులు స్వామి సన్నిధిలోనే సమర్పించుకొనే



సంప్రదాయం ఏర్పడింది. "బ్రహ్మ స్వామి 32 లక్ష్మీ నరసింహ బంగారు కప్పుతో ఉన్న సాలగ్రామ మాలను ధరించేవారు. కనుక అవిచ్ఛిన్నంగా అన్నదానం జరిపేవారు. తమ సాలగ్రామాలను తమ తర్వాత ధరించే యోగ్యుని కోసం వెతుకుతూ మహాదేవపురంలో నిరతాన్నదానం జరుపుతున్న అనుములు వెంకయ్యకు ఇచ్చారు. ఆయన బంగారు కప్పులు స్వామికే ఇచ్చి, రాగి కప్పులు వేయించి అర్చన చేసేవాడు. ఒకరోజు మంగళ హారతి సమయాన సాలగ్రామాలన్ని పట, పటా పగిలిపోయాయి. వాటిని మహానందిలో కలిపేశాడు వెంకయ్య. అనేకమంది కవులు, రచయితలు, పండితులు రచనలు చేసి స్వామికి అంకితమిచ్చారు.

తాను డెబ్భై అయిదేళ్లకు దేహం చాలిస్తానని తెలియజేశారు స్వామి. ఎవరికి వారు తమ గ్రామంలో దేహం చాలించమని కోరుకున్నారు. కాని ఆయన లింగాల దిన్నె చేరి సన్యసించి "సదాశివ సిద్ధ యోగేశ్వర స్వామి" పేరుతో "పరివ్రాట్టులు" అయి, 13-10-1889 అమావాస్యనాడు "బ్రహ్మ రంధ్రం ఛేదించుకొని" పరమాత్మతో కలిసిపోయారు. ఇప్పటికీ ఆ ప్రాంతంలో స్వామి భక్తుల మనోభీష్టాలను నెరవేరుస్తూనే ఉన్నారు. 11-2-1926 మహాశివ రాత్రికి స్వామి జీవిత చరిత్ర రాసిన మద్దులపల్లి వెంకట సుబ్రహ్మణ్యశాస్త్రిగారు మహానందికి వెళ్ళదలచి డబ్బు లేక ఉండిపోయారు. గారడీవాడి వేషంలో స్వామి స్వప్నంలో కనిపించి కావాల్సినంత ధనం ఇచ్చి యాత్ర చేయించారు. అందుకే బ్రహ్మ స్వామిని "భక్త కల్పద్రుమం" అంటారు.❀

# యోగాఢ్య బలి - కేశవ స్వామి భాగానాగర్కర్

మహారాష్ట్ర నుంచి కొందరు యోగి పుంగవులు హైదరాబాద్ వచ్చి సిద్ధి పొంది ఇక్కడి మతమౌఢ్యాన్ని పెకలించి, సామాజిక ధార్మిక రంగాలలో చైతన్యం తెచ్చారు. అలాంటి వారిలో కేశవస్వామి ప్రముఖులు. ఆయన భాగ్య నగరవాసి అని తెలియజేయటానికి కేశవస్వామి భావ నాగర్కర్ అంటారు.

చత్రపతి శివాజీ మహారాజుకు గురువులైన అయిదుగురు మహాత్ములున్నారు. వారే సమర్థ రామదాస స్వామి, జయరామ స్వామి వరగాన్కర్, రంగనాథ స్వామి నిగిఢీకర్, కేశవస్వామి భాగానాగర్కర్, ఆనంద మూర్తి బ్రహ్మ నాలాకర్ – వీరిని సమర్థ పంచాయతనం అంటారు.

కేశవస్వామిది మహారాష్ట్రలో నీలంగా దగ్గర కళ్యాణీ నగరం. ఇప్పుడు అది కర్నాటకలోని బీదర్‌లో ఉంది. అక్కడ రుగ్‌శాఖకు చెందిన గంగాబాయి, ఆత్మారామ్ దంపతులకు గంగా బాయి 80వ ఏట పండరినాథుని అనుగ్రహంతో కేశవస్వామి జన్మించారు. అయిదేళ్ళ వరకు మాటలు రాలేదు. అప్పుడు జగద్గురు శంకరాచార్యులవారు బాలుడి చెవిలో మంత్రం చదివి, శిరస్సుపై చేతిని ఉంచారు. బాలుడి వైఖరీ వాక్కు బయటపడింది. మాటలు ఊటల్లాగా ప్రవహించాయి. ఉపనయనం చేశారు. వివాహము జరిగింది. కానీ విరక్తుడుగానే ఉండేవాడు. కాశీ రాజస్వామి అనే గురువు వద్ద దీక్ష తీసుకొని భక్తీ, వేదాంత ప్రచారం చేశాడు. దేశాటనం చేస్తూ చివరికి భాగ్యనగరం అనబడే మన హైదరాబాద్ వచ్చాడు. ఆయన బోధనలకు ముస్లింలు కూడా ఆకర్షితులై భక్తులయ్యారు.

ప్రాపంచిక జీవితం గడుపుతూ కూడా, పారమార్థికంగా జీవించిన సత్పురుషుడు కేశవ స్వామి. సమర్థ రామదాస స్వామిని కలిశాడు. సమర్థునితో కేశవస్వామి "నువ్వు సాధువై ఉండి కూడా స్త్రీకి భయపడి పారిపోయావా? మాయకు, సంసారానికి భయపడ్డావా?" అని ప్రశ్నించాడు. అంటే సంసార జీవితం గడుపుతూ నిస్సంగంగా ఉండాలని భావం. వేదాంత విషయాలను సుస్పష్టంగా జనాలకు అర్థమయ్యే భాషలో చెప్పటం కేశవస్వామి ప్రత్యేకత. "శరీరం రోలు. మనస్సు రోకలి. ఆ రోకలితో జీవభావాన్ని దంచి, పిండి కొట్టాలి. జ్ఞానం అజ్ఞానం అనే ఊకను తొలగించి, శుద్ధ రూపం అయిన పిండిని గ్రహించాలి" అని బోధించేవారు.

ఆ రోజుల్లో హైదరాబాద్‌లో హిందువులను "కాఫిర్లు" అనేవారు. అడుగడుగునా హిందువులకు అవమానం జరిగేది. స్వామి ముస్లిములను బాగా ఆకర్షించటం వల్ల స్వామి ధర్మప్రతిష్ఠ బలం పుంజుకొన్నది. హిందువులు కాని వారిలో హిందూ ధర్మం



పట్ల ఆదరాన్ని కల్గించటం, హిందువులకు తాము పాటిస్తున్న దానిలో సత్య స్వరూపం ఏమిటో తెలియజేసి అందర్నీ ఆకట్టుకొన్నారు. పాండురంగని భక్తి ఆయనకు సర్వ విధాలా తోడ్పడింది. షాహ తురాబ్ అనే సూఫీ కవి స్వామి ప్రభావానికి గురై శిష్యుడైనాడు. "రామదాసును, కేశవ స్వామిని ఎప్పుడు చూస్తానో, నా దు:ఖాన్ని ఎప్పుడు పోగొట్టుకొంటానో" అని వాపోయాడు. ఈ సూఫీ కవి సమర్థ రామదాస స్వామి రాసిన "మనాచే శ్లోక" అనే భుజంగ ప్రయాత శ్లోకాలను "మాన్ సంజ్ఞావన్" పేరుతో అనువాదం చేశాడు.

కేశవస్వామి హిందువులకు అనుష్ఠాన వేదాంతాన్ని బోధించాడు. సమర్థులు మహారాష్ట్రలో చేసినట్లు కేశవులు హైదరాబాద్‌లో ప్రేరణ కల్గించారు. భక్తి మార్గాన్ని లోక కళ్యాణం కోసం ప్రచారం చేశారిద్దరూ. పండిత సదాశివ ఖండాల్కర్ "సమర్థ రామదాస చరిత్ర" రాశాడు. అందులో స్వామికి కేశవునికి జరిగిన ఉత్తర ప్రత్యుత్తరాల విషయం చక్కగా వివరించాడు. ఆత్మారాం మహారాజు కేశవ స్వామిని "యోగాఢ్య బలీ" అని తన "దాస విశ్రామ ధామ" అనే గ్రంథంలో పేర్కొన్నాడు. కేశవస్వామి ముకుంద రాజ సంప్రదాయానికి చెందినవారుగా చెప్పుకొంటారు, కాని స్వామి ఎక్కడా చెప్పుకోలేదు. కాని ఆయన ముకుందరాజ సంప్రదాయం, వార్కరీ సంప్రదాయం, సమర్థ సంప్రదాయాలను మూడింటినీ మేళవించి ప్రచారం చేశాడు. ఈ మూడు సంప్రదాయాల త్రివేణీ సంగమమే కేశవస్వామి. జ్ఞాన దేవుని వంటి గొప్ప యోగి అయినా కేశవస్వామి భక్తి మార్గంలోనే నడిచాడు. ఆత్మ సాక్షాత్కారం పొందిన మహా యోగి కేశవస్వామి.

కేశవస్వామి మరాఠీ, హిందీ భాషల్లో అనేక అభంగాలు, పదాలు రచలు రచించాడు. రాగ నిర్దేశం చేసి రాసిన 850 పదాలు అచ్చైనాయి. "శ్రీకేశవ స్వామి ఛీ కవితా" అనే ఆధ్యాత్మిక శ్రుంగార గేయాలు జయదేవుని గీత గోవిందాన్ని తలపిస్తాయి అన్నారు. అనేక ప్రహేళికలు రాశాడు. వీటికి అద్భుతమైన అంతర్థానం ఉంటుంది. మహారాష్ట్రలో వాటిని "కూట రచనలు" అంటారు. కేశవుడు రచించిన 2700 శ్లోకాలు, 231 పదాలు "దులియా"లో శంకర కృష్ణదేవ్‌గారి "సమర్థ వాగ్దేవతా మందిరం"లో అముద్రితంగా ఉండటం శోచనీయమైన విషయమే.

ఒకసారి సమర్థ పంచాయతనం కృష్ణా నది దాటటానికి వచ్చారు. వరద ఉధృతంగా ఉంది. యోగ శక్తితో దాటాలని భావించారు. సమర్థ రామదాస స్వామి హనుమత్ స్తోత్రం చేసి ఆయన్ను ప్రత్యక్షం చేసుకొని కృష్ణను దాటారు. మిగిలిన ముగ్గురు తమ ఇష్ట దైవాలను ప్రసన్నం చేసుకొని దాటేశారు. కాని కేశవ స్వామి అక్కడ ఉన్న పడవవాడికి పావలా డబ్బులిచ్చి నదిని దాటాడు. ఆయన్ను చూసి మిగిలిన నలుగురు నవ్వారు. అప్పుడు కేశవస్వామి "చిన్న చిన్న పనుల కోసం ఉపాసించే దేవుళ్ళను కష్టపెట్టటం మంచిదికాదు. మీరు మీ యోగ శక్తులతో నదిని దాటారు. నేను పావలా ఇచ్చి నదిని దాటాను. నా దృష్టిలో మీ యోగశక్తి నా పావలా కంటే

ఎక్కువేమీ కాదు. భక్తుని ముఖ్య లక్షణం స్వాత్మానుభవం, నిష్కామ భక్తీ" అని తెలిపి వారిని ఆలోచనలో పడేశారు.

హైదరాబాద్‌లో స్వామి ఒకసారి హరికథ చెప్తున్నారు. భక్తి పారవశ్యంలో తాను మునిగి, శ్రోతలకూ ఆ అనుభూతి కలిగిస్తున్నారు. ఒక ముస్లిం వస్తాద్ కూడా వచ్చాడు. అక్కడే గోడకు రాధాకృష్ణుల పటం ఉంది. అందులో రాధ చేతిలో తమలపాకు ఖిల్లీ ఉంది. వాడు పిచ్చిగా ఊగిపోతు "ఆ చిత్రంలోని రాధ కృష్ణుని చేత ఖిల్లీ తినిపిస్తే నువ్వు చెప్పే హరికథ నమ్ముతా. లేకపోతే ఇక్కడున్న వారందరి దగ్గర తలో వంద రూపాయలు వసూలు చేస్తాను" అని స్వామితో చెప్పి తలుపులు మూసి రుబాబు చేశాడు. అందరు భయపడిపోయారు. స్వామి మనసారా శ్రీకృష్ణుని ధ్యానించి, "యది ఆప్కో హో కథావోం మె ప్రీతీ-బతాలో చమత్కార్ దిఖావో ప్రచీతి" అన్నారు అంటే "కృష్ణా! నీ కథల్లో నీకు ఇష్టం ఉంటే సాక్షాత్కరించి, చమత్కారం చెయ్యి" అని అర్థం. కృష్ణ నామస్మరణ చేశారు, చేయించారు. ఒక్కసారిగా మెరుపు మెరిసింది. శ్రీకృష్ణుని నోటిలో రాధ ఇచ్చిన కిల్లీ కనపడింది. "ఈ అద్భుతం చూసి పఠాన్ కాళ్ళమీద పడి క్షమా భిక్ష వేడాడు. స్వామి అనుగ్రహించారు. స్వామి శిష్యుడైపోయాడు వాడు.

ఒకసారి సుల్తాన్ కేశవస్వామిని అందరితో బాటు విందుకు ఆహ్వానించి అందరికి మాంసం వడ్డించే ఏర్పాటు చేశాడు. "అందరిలో ఉన్న ఆత్మ ఒక్కటేనంటారుగా మీరు. మరి ద్వంద్వ భావం లేకుండా ఈ భోజనం ఆరగించండి" అని పరీక్ష పెట్టాడు. కేశవస్వామి సందేహంలో పడ్డాడు. వరాహావతారాన్ని ధ్యానించారు. వెంటనే చిన్న పందిపిల్ల అక్కడ ప్రత్యక్షమై ఆయన పళ్ళెంలో ఉన్న మాంసాన్ని తినేసింది. తురకలకు పంది అంటే అసహ్యం. సుల్తాన్ స్వామితో "ఇదేమిటి ఇలా చేశారు?" అని అడిగితే ఆయన "ఆత్మ భేదానికి అతీతమైంది. మీకూ మాకూ భోజనం చేయటంలో ఎలాంటి సంకోచం ఉండరాదు" అని సమాధానం చెప్పారు. సుల్తాన్‌కు శృంగ భంగమై తల దిన్చుకొన్నాడు.

మరోసారి కేశవస్వామి భజన చేస్తుంటే, మెడలో ఉన్న పూల దండ ఈయన మెడలో పడింది. ఇంకోసారి స్వామికిచ్చే ప్రసాదంలో "వస నాభి" కలిపారు దుష్టులు. అందరు తిన్నారు. ఎవరికి ఏమీ కాలేదు. కాని దేవుడి విగ్రహం నీలం రంగుగా మారింది. మరోసారి స్వామి భజన చేస్తుంటే ఆయన భుజం మీద బాలకృష్ణుడు ఉన్నట్లు ఒక ముస్లిం భక్తుడికి కన్పించింది. అంటే సర్వ కాల సర్వావస్థలలో శ్రీకృష్ణుడు కేశవ స్వామి వెంట ఉన్నాడని అర్థం అవుతోంది. కేశవస్వామి 1610లో జన్మించారని భావిస్తారు. 1-1-1683 దుందుభి నామ సంవత్సర పుష్య శుద్ధ త్రయోదశి సోమవారం హైదరాబాద్‌లో "ముచికుందా నది" అయిన మూసీ నది ఒడ్డున మహా సమాధి చెందారు. ఇప్పుడిది కేశవ నగర్, జియాజి గుడా - హైదరాబాద్‌లో మహా భక్తి కేంద్రంగా వర్ధిల్లుతోంది. ❁





# త్రికాల జ్ఞాని మహాయోగి - గోల్లా పిన్ని మల్లికార్జున శాస్త్రి

పాత నిజాం రాష్ట్రం రాయచూరు జిల్లా అలుకూరు గ్రామంలో శ్రీవత్స గోత్రీకులైన గోల్లా పిన్ని అనే ఇంటి పేరున్న వైదిక బ్రాహ్మణులు ఉండేవారు. ఏడు తరాలకు పూర్వం మోటప్ప అనే ఈ వంశీకుడికి "పల్లెలాంబ" అనే దేవత ప్రత్యక్షమై, బంగారు పలకా, బలపం ఇచ్చి, ఏడు తరాలవారు ఆ వంశంలో పండితులౌతారని దీవించింది. ఆ వంశంలో 1871లో జన్మించిన వాడే మన మల్లికార్జున శాస్త్రి. తండ్రి రామశాస్త్రి - తల్లి సుబ్బమ్మ.

నాలుగేళ్ల వయసులో వీధి బడికి పంపారు శాస్త్రిని. ఆ సాయంత్రం పంతులుగారు ఈ బాలుణ్ణి ఇంటికి తీసుకొని వచ్చి, తండ్రికి అప్పగించి తనకు వచ్చిందంతా శాస్త్రి ఒక్క రోజులోనే నేర్చుకొన్నాడని ఇంకా తాను చెప్పవలసిన్దేమీ లేదని చెప్పాడు. అంతటి "బాల లీలా సరస్వతి" మల్లికార్జున శాస్త్రి. తండ్రి, పిన తండ్రుల వద్ద నాటకాంత సాహిత్యాన్ని, తత్వ బోధినీ వ్యాఖ్యతో కౌముది, న్యాయ వేదాంత శాస్త్రాలు నేర్చాడు. తండ్రి వెంట గద్వాల, వనపర్తి, ఆత్మకూరు సంస్థానాలు తిరిగి తన విద్యా వైదుష్యాన్ని ప్రదర్శించి "భారతీ బాల లీల స్వరూప" బిరుదు పొందాడు. జ్యోతిషం, భాష్యంత వ్యాకరణం ముహూర్త, జాతక, సిద్ధాంత రూప స్కంద త్రయ జ్యోతిషం గురుముఖతా నేర్చాడు. ఆనాటి జ్యోతిష పండితుడు విక్రాల రాఘవాచార్యులు "కన్ను స్వామి" అనే మారుపేరుతో Indian Ephimeries రాశాడు. ఆయనగారి అనుమతి పొంది మల్లికార్జున శాస్త్రి "10 వేల సంవత్సరాలకు సరిపోయే తిథి, వార, నక్షత్ర, యోగ, కరణ, ఘటిక, విఘటికలకు సరైన ప్రమాణం ఉన్న "ఖచర మణిపేటి" అనే అత్యద్భుత పంచాంగాన్ని తయారు చేశాడు. గురువు అనుమతి తీసుకొని కాళహస్తీశ్వరాలయంలో నిష్టగా కూర్చుని "శని అష్ట వర్గు" వేస్తుంటే శనైశ్చరుడు ప్రత్యక్షమైనాడు. అలుకూరు తిరిగి వచ్చి తాతగారి వద్ద వేదాంత అధ్యయనం చేసి మొత్తం చదువునంతా 21ఏళ్ళ వయస్సులోనే సాధించాడు. ఈయన తమ్ముడు రామశాస్త్రి గొప్ప సూర్యోపాసకుడు. సూర్యోదయం నుండి మధ్యాహ్నం పన్నెండు గంటల వరకు రెప్ప వాల్చకుండా సూర్చుని చూస్తూ ధ్యాననిమగ్నం అయ్యేవాడు. మల్లికార్జునిలానే ఈయనా త్రికాలజ్ఞాని.

మల్లికార్జునశాస్త్రి కడప, బళ్ళారి నగరాల్లో అనేక "శతావధానాలు" చేశారు. అనేక సంస్థానాల్లో తన పాండిత్య ప్రకర్ష చూపి "కవితా సార్వభౌమ" బిరుదు పొందారు. ఆది శంకరాచార్యుల జన్మస్థానం "కాలడి"లో శృంగేరి జగద్గురువులు శ్రీనృసింహ భారతీస్వామి ఆహ్వానంపై వెళ్లి జగద్గురువులను "శ్రుత్యంత గీతాల"తో స్తుతిస్తూ తన్మయం చెందుతూ పాడుతూ ఉంటే వీరి బ్రహ్మాత్మానుభవాన్ని గుర్తించిన భారతీస్వామి

అభినందించారు. శృంగేరి స్వామి అనుజ్ఞతో తాను రచించిన "ఖచరమణి" గ్రంథాన్ని తెచ్చి అందులో నుంచి 2000 నాటి స్వాములవారు అడిగిన తిథికి పంచాంగ గణనం చేయమని సభాసదులను కోరారు. చాలామంది చెప్పలేమన్నారు. కొందరు మూడు గంటల వ్యవధి కోరారు. మల్లికార్జున శాస్త్రి ఇరవై నిమిషాలలో గణించి సరైన సమాధానం చెప్పగలిగి తన ప్రజ్ఞను రుజువు చేసుకొన్నారు. స్వామితో సహా అందరు ఆశ్చర్యపోయారు. జగద్గురువులు "పండిత సార్వభౌమ" బిరుదును ప్రదానం చేశారు. సగౌరవంగా సత్కరించారు. "ఉపాధి భేదం చేత మీరు అక్కడ, మేము ఇక్కడ. మీరే మేము, మేమేమ మీరు" అని జగద్గురువుల చేత ప్రశంసలు పొందిన మల్లికార్జున శాస్త్రి ధన్యజీవి.

ఆయన సంస్కృతంలో శ్రీ వాసుదేవానందం అనే అలంకార శాస్త్రాన్ని రాశారు. ఇది చిత్ర విచిత్ర కవితా భాండారం. అనేక కవితా బంధాలు ఉన్నాయి. అందులో బాగా ఆశ్చర్యపరచేది "సహస్ర దళ పద్మ బంధం" 1008 దళ పద్మాలలలో అనేక శ్లోకాలు నిక్షిప్తమైన అపూర్వ సృష్టి. ఇందులో 500 శ్లోకాలు, 16 ప్రకరణాలున్నాయి. అయితే ఇందులో నూరు శ్లోకాలున్న గ్రంథమే ముద్రితమైంది. దీన్ని నలభై రోజుల్లో రాశారు. ఇరవై అయిదు వివిధ ఛందస్సులతో పురుషోత్తమ శతకం రాశారు. జ్యోతిశ్శాస్త్ర సుధర్మ సార నిబంధం, ధర్మ శాస్త్ర రత్నాకరం అనే తెలుగు రచన రాసినా లభ్యం కావటం లేదు. పాతంజలి భాష్యార్థం, ఖచరమణి పేటి, 10,000 సంవత్సర పంచాంగం వీరి ఇతర రచనలు.

శాస్త్రిగారు 15-1-1906 తమ స్వగ్రామం అలుకూరులో ఒక ఏడాది పాటు "దీర్ఘ బ్రహ్మ సత్రయాగం" నిర్వహించారు. వందలాది పండితులు, రాజులు, మంత్రులు ధనవంతులు, వేలాది మంది పేదలకు కుల మత భేదం లేకుండా అన్నసంతర్పణ జరిగింది. అందరిని సత్కరించి పంపిన రాత్రి శ్రీ విరూపాక్ష స్వామి కలలో కన్పించి "అవభ్రుథ స్నానం" కాశీలో చేయమని ఆజ్ఞాపించాడు. బంధుజనంతో కాశీ వెళ్లి ఆ కార్యక్రమం సంతృప్తిగా నిర్వహించి ప్రయాగ, గయాది క్షేత్ర సందర్శనం చేసి ఇంటికి తిరిగి వచ్చారు.

గద్వాల రాజు రాంభూపాల్ మరణించగా సంస్థానం పదేళ్లు "కోర్ట్ ఆఫ్ వార్డ్స్"లో ఉంది. అప్పుడు వారసుడైన సీతారాం మల్లికార్జునుని శరణు వేడాడు. ఈయన ఏడాది గడువు పెట్టి, హంపీ విరూపాక్షునికి "అగ్నిస్టోమ, కోటి బిల్వార్చన చేయ సంకల్పించి అందరి సహకారంతో ఆ పని పూర్తిచేశారు. గడువు లోపలే సీతారాం గద్వాల రాజ్యం దక్కింది.

ఒకసారి యవ్వనంలో శాస్త్రిగారు ఎండలో నడిచి వస్తున్నాడు. ఒక పేద రైతు కనిపించి వర్షాలే లేవని కరువుతో జనం అమటిస్తున్నారని చెప్పాడు. "పెద్ద వర్షం వస్తుంది. ఇంటికి పో" అన్నారు శాస్త్రి. అంతే కుండపోతగా వర్షం కురిసింది. ఇంకోసారి స్వగ్రామం బయట ఏటి ఇసుకలో ధ్యాననిష్ఠలో ఉండగా విపరీతంగా వర్షం కురిసి



ఇసుకలో కూరుకుపోయాడు. కొన్ని రోజుల తర్వాత వాగు ఎండిపోయింది. మంచినీటి కోసం చలమలు తవ్వుతుంటే శాస్త్రిగారు పద్మాసనంలో అలానే చలించకుండా కనిపించారు. ఏదైనా మహిమ చూపమని ఒక శిష్యులు అడిగితే "ఒక శివాలయంలో నాలుగు స్తంభాల మధ్య శివుడికి ఎదురుగుండా కూర్చొని కనులు మూసుకొని ఒక్కసారిగా శరీరాన్ని గాలిలోకి లేపి, ఆ స్తంభాల మధ్య చుట్టూ వేగంగా గిరగిరా తిరిగి, మళ్ళీ కిందికి దిగి శివుని ధ్యానించారు.

మరోసారి మల్లేశ్వరాలయంలో బావమరదితోనే కంటి రామయ్య భాగవతంలో "పురంజనో పాఖ్యానం" చదువుతుంటే శాస్త్రిగారు ఆధ్యాత్మపరంగా వ్యాఖ్యానం చేస్తున్నారు. పూర్తి అవగానే రామయ్య "అంతేనా బావా?" అన్నాడు. శాస్త్రిగారు "అంతేరా" అన్నారు. అంతే – రామయ్య వెంటనే లేచి భుజంపై ఖండువా దులిపి మళ్ళీ బుజంమీద వేసుకొని అదే పోతపోయాడు. తల్లీ, శాస్త్రి భార్యా మొత్తుకొన్నా తిరిగి చూడలేదు. "వాడిక రాడులే అంతే" అని వారికి సమాధానం చెప్పాడు శాస్త్రి. అంటే ఆత్మ బోధ అయిందన్న మాట బావమరదికి.

శాస్త్రిగారి లీల ఇంకోటి. గద్వాల రాజు మూడు రోజుల పండిత గోష్టిలో ఉండగా ఒకరోజు నిజాం ప్రభువు తాను రాయచూరు వస్తున్నానని తనను అక్కడ కలుసుకోమని రాజుకు ఫర్మానా పంపాడు. ఏమి చేయాలో తోచక శాస్త్రిగారిని అడిగాడు రాజు. కంగారేమీ పడక్కరలేదని నిజాం రాడనీ రేపే ఆ విషయం తెలుస్తుందని చెప్పాడు. ఇరకాటంలో పడ్డాడు రాజు. అనుకొన్నట్లే నవాబు వాడీ వరకు వచ్చేసరికి కడుపు నొప్పి ఎక్కువై, హైదరాబాద్ తిరిగి వెళ్లిపోయినట్లు మర్నాడు వార్త వచ్చింది. అంతటి వస్యవాక్కు శాస్త్రిగారిది.

1917లో అలుకూరులో ప్లేగు వ్యాధి విపరీతంగా వ్యాపించింది. శాస్త్రిగారు మల్లికార్జున పుష్కరిణిని "అష్ట దిగ్బంధం" చేసి ఆ నీళ్ళు తాగినవారికి ప్లేగు రాదనీ చెప్పారు. "మారికా దేవి" ప్రత్యక్షమై అంత కఠోర నియమం పనికి రాదనీ అది తనకే నష్టం అనీ చెప్పింది. అందర్నీ ధర్మవరం పంపించి, తానొక్కడే ఆ ఊర్లో ఉండిపోయాడు. గ్రామ ప్రజలందర్నీ బయటికి పంపించేశాడు. తాను కుటుంబంతో తుంగభద్రా నది ఒడ్డున ఉన్న రామాపురం వెళ్లారు. శాస్త్రిగారికి ప్లేగు సోకింది. కుండపోతగా వర్షం కురుస్తోంది. ఎవరు బయటకు వచ్చే అవకాశం లేదు. శాస్త్రిగారికి సమయంలో వైద్యసాయం అందలేదు. అంతే 5-9-1917 నాడు చనిపోయారు. ధర్మవరంలో ఉన్న అల్లుడు శ్రీనివాసశాస్త్రి టెలిగ్రాం చూసి వచ్చాడు. అప్పటికే ఆలస్యమైపోయిందని శవ దహనం చేశారు. చితా భస్మం వర్షపు నీటిలో అంతా కొట్టుకుపోయింది. చితా భస్మం కూడా మిగులకుండా చేసి యాభై ఏళ్ళ వయసులోనే చనిపోయిన మహాజ్ఞాని గోల్లా పిన్ని మల్లికార్జున శాస్త్రిగారు. ❀

# రాజయోగి - దక్షిణామూర్తి పరమహంస స్వామి

ఒక మంగయ్య పరమహంసగా, రాజయోగిగా మారటం ఆశ్చర్యం కలిగించినా, అది నిజమే. అదే ఇప్పుడు మనం తెలుసుకొనే విషయము.

మంగయ్యగారు న్యాయవాది అయిన సూర్యనారాయణ శాస్త్రి, రత్నాలమ్మ దంపతులకు 9-10-1872 నాడు విజయనగరం దగ్గర మెట్టలో జన్మించారు. అయిదవ ఏట ఒక సిద్ధుడు తారసపడితే దక్షిణామూర్తి మంత్రం కావాలని అడిగారు. ఆయన బలవంతంగా హయగ్రీవ మంత్రం ఇచ్చి వెళ్లిపోయాడు. దానితో మంచి వాక్సుద్ధి కలిగింది. ఎప్పుడూ ఊరవతల గుట్టలపై ఏకాంతంగా కూర్చునేవాడు. ఒకరోజు ఎవరో తమ నగ ఇంటి దగ్గరపోయింది అని ఆయనకు చెప్పారు. దానికి ఆయన కాసేపటికి ఆ నగ ఇక్కడికే వస్తుంది అన్నాడు. ఇంతలో ఒక కాకి ఆ నగను తీసుకొని వచ్చి చెట్టుమీద నుంచి కిందికి జారవిడిచింది. ఊరంతా మంగయ్య మహాత్మ్యం గురించి పాకిపోయింది. ఎనిమిదో ఏట ఉపనయనం జరిగి, పిన తండ్రి వెంకన్న పంతులు వద్ద సంస్కృతం, ఆంధ్రం, ఆంగ్లం నేర్చాడు. ఒకసారి బయటికి వెడితే ఒక గుళిక వచ్చి ఆయనపై పడింది. దానిలోని పదార్థాన్ని ఒంటికి పూసుకొని, ఆ కాయను బొడ్లో దాచుకొన్నాడు. దాన్ని గురించి ఆశువుగా రెండు శ్లోకాలు చెప్పాడు. విజయనగరంలో ఉన్నత పాఠశాల చదువు పూర్తి చేసి, తండ్రి వద్ద శైవమంత్రాలను ఉపదేశం పొందాడు.

పదహారవ ఏట పెళ్లైంది. రైల్వేలో పనిచేసే ఒకాయన "రాజయోగం" క్షుణ్ణంగా నేర్పాడు. ఆ యోగ ప్రభావాల్ని చూపించమని స్నేహితులు కోరారు. అప్పుడు ఒక బండి వస్తోంది. దమ్ముంటే దాన్ని వెనక్కి మరల్చమన్నారు. అనేకసార్లు దాన్ని వెనక్కి ముందుకు నడిపించి తన యోగశక్తిని నిరూపించాడు. కొంతకాలం తర్వాత బాలానంద పరమహంస అనే పేరుగల సిద్ధేశ్వర బ్రహ్మచారి అనే ఉత్తర దేశీయుని వద్ద రాజ, హఠ యోగ రహస్యాలు ఆకలింపు చేసుకొన్నాడు. మద్రాస్ క్రిస్టియన్ కాలేజిలో లెక్కల్లో బి.యేలో చేరాడు. ఒక డిబేటింగ్‌లో ఇంగ్లీష్ వాడైన గణిత ఉపన్యాసకుడు "సైకాలజీలో ఆంగ్లేయులే ప్రపంచంలో నంబర్ వన్" అని వాదిస్తే, లెక్కలు వదిలేసి వేదాంత శాస్త్రాన్ని ఎంచుకొన్నాడు. బాబాయి వెంకుపంతులు రాసిన సంస్కృత కావ్యంలోని "ఇరావతీ ఘట్టాన్ని పేరుతో ఉన్న పరమార్థాన్ని సమర్థించి సంస్కృత అధ్యాపకులైన వేదం వెంకటరాయ శాస్త్రిగారి అభిమానం పొందాడు. శిష్యుడైనాడు. గురు శిష్యులిద్దరూ శాస్త్ర కావ్య గోష్ఠి నిరంతరం జరిపేవారు. ఒకసారి ప్రయోగం కోసం ఇద్దరు గంజాయి పీల్చారు. గురువు దిమ్మ తిరిగి పడిపోతే శిష్యుడు నిమ్మకాయ నీళ్ళు తాగించి పైత్యం పోగొట్టాడు. ఇద్దరు శకుంతల నాటకం చూడటానికి వెళ్లి శకుంతలకు దుష్యంతుడు చేసిన దానికి అభ్యంతరం తెలిపి చూడకుండా తిరిగి వచ్చారు. బి.యే. అయ్యేసరికి



మంగయ్య తర్కశక్తి ఎదురులేకుండా ఉంది.

నాడీ శుద్ధి, కుంభక ప్రాణాయామం సాధిస్తూ ఒంటి పూట భోజనం చేస్తుంటే క్షయ రోగం పట్టుకుంది. తండ్రి మహా విద్య దీక్ష పూని తగ్గించారు. కొడుక్కి మేధా దక్షిణామూర్తి మంత్రం నేర్పారు. పర్లాకిమిడిలో పోలీస్ హెడ్ క్లార్క్‌గా పనిచేశాడు. ఉద్యోగం వదిలి కురుపాం రాజు వీరభద్ర రాజుకు కార్యదర్శిగా కొంతకాలం పనిచేశాడు. ఒక సిద్ధుడు శ్రీ స్వప్నాంజనేయ, వీర దక్షిణామూర్తి మంత్రాలను నేర్పి, మంగయ్య పూర్వజన్మ విశేషాలు తెల్పాడు.

మంగయ్య తన భార్య, పిల్లలను మామగారింట విడిచి, మద్రాస్ వెళ్లి ఎల్.టి.ట్రైనింగ్‌లో చేరారు. ఈయన రాసిన ఆంగ్ల రచనలు చూసి "ఈరాక్ ద్రు" అనే దొర గుండెలు బాదుకొన్నాడు. నిజాం రాష్ట్ర విద్యాశాఖలో ఉపాధ్యాయుడిగా చేరారు. ఆయన ప్రతిభ గుర్తించిన విద్యాధికారి బి.ఎడ్.జిల్లా కేంద్ర ఉన్నత విద్యాలయానికి హెడ్ మాస్టర్‌ను చేశాడు.

నిజామాబాద్‌లో పనిచేస్తున్నప్పుడు గోల్లా పిన్ని మల్లికార్జున శాస్త్రిగారు వచ్చి "సమాధి భేదాలు" వీరి వద్ద గ్రహించారు. రుగ్వేద, యజుర్వేదములను గురుముఖత: నేర్చారు. రామస్వామి అయ్యర్ "వాసుదేవ తత్త్వం" ఉపదేశించారు. దానితో శ్రీకృష్ణ సాక్షాత్కారం పొందారు. హైదరాబాద్‌లో గౌలిగూడాలో కాపురం ఉన్నారు. ఇద్దరు స్నేహితులకు వేరుచోట్ల కన్పించి వారిని ఆశ్చర్యపరచారు. హరిహత్ అనే దంపతులు శివ జపం చేస్తుంటే మంగయ్యగారు అనుకోకుండా ప్రత్యక్షమై రుద్రాభిషేకం చేసి మైమరపించారు. ఒక శిష్యుడు ఒకసారి వచ్చి చూస్తే మంగయ్యగారు అగ్నిజ్వాలల మధ్య కన్పించారు. భయపడి పారిపోతుంటే మళ్ళీ యథా స్థితిలో కన్పించారు. పశుశాఖలో పనిచేసే హనుమంతరావుకు ఒక శివలింగం ఇచ్చి ఆ తరువాత వరుసగా పదకొండు ఇచ్చారు. గృహస్థులైన మంగయ్యగారు శ్రీరామ, శ్రీకృష్ణుల వలె బ్రహ్మచారులు. విదేశీ డాక్టర్లే ఈ విషయం పరిశోధించి నిర్ధారణ చేశారు.

పెద్ద కొడుకు పెళ్లి ముహూర్తాన్ని తానే పెట్టి శ్రీకాకుళం జిల్లా రామతీర్థం దేవాలయంలో పెండ్లి చేయాలని నిశర్చయించారు. కాని అక్కడి పంచాంగ కర్తలు, పండితులు ఈ ముహూర్తానికి కేతు, కుజవేధలున్నాయని, ఆ పెళ్లి జరగదని చెప్పారు. పెళ్లి జరుగుతుందని మంగయ్య వాదించారు. దేవాలయానికి పెళ్లికొడుకును తీసుకొని వెళ్తుంటే ఒక పాము అడ్డం వచ్చింది. వెళ్ళటానికి వీల్లేదన్నారు పండితులు. ఇది కేతువేధ అని చెప్పారు ఈయన. పాము మాయమైపోయింది. పెళ్లిపీటల మీద పెళ్లికొడుకును, పెళ్లికూతురును కూర్చోబెట్టి ముహూర్తం కోసం పండితులు గడియారాలను చూస్తున్నారు. ఒకళ్ళ టైం నాలుగు అని. ఒకళ్ళది ఏడు, మరొకరిది ఆగిపోయిందని చెప్పారు. అదే కుజవేధ అని చెప్పి అక్షంతలు తాను తీసుకొని, అందరికి ఇప్పించి అనుకొన్న ముహూర్తం రాగానే తాను వేసి, అందరితో అక్షతలను వేయించారు. "ఇప్పుడు గడియారాలు చూడండి" అన్నారు. అందరి గడియారాలు అనుకొన్న ముహూర్త సమయాన్నే

చూపించాయి. అందరు వారి మహాశక్తికి, అఘటన ఘటనా సమర్థతకు నివ్వెరపోయారు.

దేవీదాసు అనేవాడికి ఎ.బి.సి.డి.లు కూడా రావు. అతనితో కొన్ని గంటల సేపు ఆంగ్లంలో గంభీరమైన ఉపన్యాసం ఇప్పించారు మంగయ్యగారు. తనకు షోడశీ మంత్రాన్ని దేవుజీ మహారాజే వచ్చి ఇస్తారని ముందే చెప్పారు. అందరు గణంజయ మహారాజగారితో ఇప్పించే ఏర్పాట్లు చేశారు. గణంజయుడు రాలేదు. దేవుజీ వచ్చి మంత్ర దీక్షనిచ్చారు. మంగయ్యగారి సంకల్ప బలం అంత గొప్పది.

మంగయ్యగారి వైదుష్యం నిరుపమానమైంది. ఆంగ్లంలో అయిదు పద్య కావ్యాలు, పదహారు ఆధ్యాత్మ గ్రంథాలు రాశారు. సంస్కృతంలో కామ ప్రబంధం, దక్షిణ గీత, సౌభాగ్య రత్నాకరం, అద్వైత పారిజాతం, వ్యావహారిక దర్పణం వంటి అలౌకిక గ్రంథాలు రాశారు. ఇంకా యెన్నో స్తుతి స్తోత్రాలు రాశారు. ధర్మాష్టకం వంటి అష్టకాలు రాశారు. కాలచక్రాన్ని దాని నడకను ప్రత్యక్షంగా చూడాలని ఒక శిష్యుడు కోరితే ప్రత్యక్షంగా చూపించారు. గంటకు వెయ్యిసార్లు వైఖరీవాక్కులో జపించే మంత్రాన్ని మంగయ్యగారు పశ్యంతీ వాక్కుతో, మనోవేగంతో ఒకే నిమిషంలో చేసేవారు. ఒకసారి హైదరాబాద్‌లో మేడ దిగి కిందికి వస్తుంటే ఒక కుక్క వచ్చింది. దానికి ఆసనం వేయించి కూర్చోబెట్టి, అది తన భాషలో తన జన్మ వృత్తాంతాన్ని చెబుతుంటే వెంకయ్యగారు వైఖరీ వాక్కులో అనువాదం చేసి జగన్నాయకులు అనే ఆయనతో రాయించారు. అంటే ఆయనకు సమస్త జీవజాల జన్మ వృత్తాంతాలు తెలుసన్నమాట.

మంగయ్యగారి శిష్యులైన పెద్దలతో జర్మన్ విద్వాంసుడు స్పర్జ్, నిజాం కాలేజి ప్రిన్సిపాల్ బర్నేట్, విద్యా మంత్రి నవాబ్ ఆజమ్యార్జంగ్, ఇంజనీరింగ్ మంత్రి మోహిదీ నవాజ్ జింగ్, గణితాచార్యుడు సయ్యద్ సిరజుల్ హాసన్ మొదలైన వారెందరో జాతి, మత, కుల భేదాలు లేకుండా అభిమానులు, శిష్యులు అయ్యారు. మంగయ్యగారికి ఒక విచిత్రమైన అలవాటు ఉండేది. ఎప్పుడూ చేతిలో అక్షతలనుంచుకొని, తన నెత్తిన తానే వేసుకొంటుంటేవారు. నడుస్తున్నా, కూర్చున్నా, తమలో తాము మాట్లాడుకొంటుండేవారు. మంగయ్యగారు రాసిన ఒక ఆంగ్ల పుస్తకం పీఠిక రాసిన ఆక్స్‌ఫర్డ్ విశ్వవిద్యాలయంవారు “ఇందులోని అభిప్రాయాలను గ్రహించటానికి 300 ఏళ్ళు పడుతుంది” అని రాశారు. బాలబ్రహ్మచారి అని పేరొందిన చిన్మయానంద స్వామి మంగయ్యగారికి సన్యాస దీక్షనిచ్చి, “దక్షిణామూర్తి పరమహంస స్వామి” అని ఆశ్రమ నామకరణం చేశారు. ధవళేశ్వరంలో ఆశ్రమం ఏర్పాటు చేసుకొన్నారు. అది మంచి ఫలితం ఇవ్వలేదు. విశాఖ వెళ్లి “లలితాశ్రమం” ఏర్పాటు చేసి లలితాదేవిని ప్రతిష్టించారు. ఆ ప్రాంతానికి “లలితా నగరం” పేరు వచ్చింది. పరమహంసలు 1954లో సిద్ధి పొందారు. వీరి శిష్యులు వాల్వేకర్ ఆశ్రమాధిపతి అయి, అనేక అభివృద్ధి కార్యాలు నిర్వహించి 1995లో సిద్ధి పొందగా గురువుగారి సమాధి ప్రక్కనే సమాధి చేశారు. ఇప్పుడు లలితాశ్రమాన్ని కుర్తాళం పీఠాధిపతి శ్రీశివచిదానంద భారతీ స్వామి (పూర్వాశ్రమంలో ప్రసాద రాయకుల పతిగారు) 28-6-1998న దత్తత తీసుకొని శ్రీరామానంద భారతీ స్వామివారికి ఆశ్రమ బాధ్యతలను అప్పగించారు. ❁





# కరగ్రహార యోగి-ఫరీద్ మస్తాన్ ఔలియ

ఒక హిందువు ముస్లిం మత పీఠం అధిష్టించిన ఆశ్చర్యకర విషయమే. అప్పలస్వామి ఫరీద్ ఔలియగా మారిన చరిత్ర. విజయ నగరాన్ని పూసపాటి విజయ రామరాజు పాలిస్తున్న కాలం అది. ఆయన సేనాధిపతి నడిపల్లి అప్పలస్వామి. ఆయన భార్యయే పైడితల్లి. అందాల సుగుణ రాశి. రాజు ఆమెపై మోజుపడ్డాడు. తనను చంపి సతీత్వాన్ని కాపాడమని భర్తను కోరింది పైడితల్లి. కత్తి తీసుకొని – ఒకేదెబ్బతో ఆమె శిరస్సు ఖండించి, ఆమె కోర్కె తీర్చి, ఊరు వదిలేసి, బడిపాలెం చేరి పైడితల్లి ఆదేశం మేరకు మళ్ళీ పెళ్లి చేసుకొన్నాడు. పైడితల్లి “ఇక నుంచి రాజు వంశంలో సంతానం ఉండదని, నడిపల్లి వారి ఏడవ తనంలో ఒక సత్పురుషుడు పుట్టి విజయనగరంలో ప్రవేశించినప్పుడు మాత్రమే విజయనగరానికి వారసుడు జన్మిస్తాడు” అని శాపం పెట్టింది. విజయరామరాజు పశ్చాత్తపడి ప్రాయశ్చిత్తం కోసం పైడితల్లికి గుడి కట్టించి ప్రతి ఏటా ఉత్సవాలు నిర్వహించాడు. ఇప్పటికీ మహా వైభవంగా పైడితల్లి ఉత్సవాలు జరుగుతున్నాయి.

దిబ్బడిపాలెంలో అప్పలస్వామి వంశంలో నడిపల్లి పాపయ్య, రాజమ్మ దంపతులకు 19-8-1902లో జన్మించిన మగపిల్లవాడే మన కథానాయకుడు అప్పలస్వామి. లోక కళ్యాణం కోసం విష్ణుమూర్తి ఆమె గర్భంలో జన్మిస్తున్నట్లు తల్లి రాజమ్మకు కలలో చెప్పాడు. అతని మేనమామ కొడుకు ఇతనిపై కుత్రపన్ని మంత్ర ప్రయోగం చేయించాడు. అవి అప్పలస్వామిని ఏమీ చెయ్యలేకపోయాయి. చిన్నతనంలో కావడిలో కూర్చొని విజయనగరం కోటకు వెళ్లాడు. పూర్వం పైడితల్లి ఇచ్చిన శాపం తీరిపోయింది. రాజవంశంలో మళ్ళీ సంతానం కలిగింది.

ఒకప్పుడు అప్పలస్వామిని కాల పిశాచం పట్టుకొంటె, బంధించి ఇంటికి తెచ్చాడు. తొమ్మిదేళ్ళకే నారద తుంబురులు దర్శనమిచ్చారు. దేవతలు బందరు సముద్ర తీరానికి తీసుకొని వెళ్లి భవిష్యత్తులో అతడు ఉండాల్సిన ప్రదేశాన్ని చూపించారు. నెల్లిమర్ల జూట్ మిల్లులో పనిచేశాడు. అప్పుడు ఫాక్టరి కట్టటానికి పునాదులు తవ్వుతుంటే వెంటనే పూడిపోయేవట. అప్పలస్వామి అక్కడ నిలబడితే నిర్మాణం సాగిందట. తోళ్ళకర్మాగారంలో పని చేసేవారితో మద్యపానం మాన్పించాడు. బుచ్చమ్మతో వివాహమైంది. కంటోన్మెంట్ రోడ్డులో టోల్‌గేట్ ఉద్యోగంలో పనిచేశాడు. అక్కడే దగ్గర్లో “ఖాదర్షా ఔలియా” ఉన్నారు. భార్య చనిపోయింది. ఉద్యోగం ఊడిపోయింది. విజయనగరంలో పైడితల్లి సంబరాలకు నాటకం వేసి, ఖాదర్‌శా ఔలియాను సందర్శించాడు. ముప్ఫై ఏళ్ల వయసులో ఉన్నాడు. ఆయనను దర్శిస్తే మళ్ళీ రమ్మని వాయిదా వేశారాయన. ఇలా రెండు మూడుసార్లు అయింది. అయినా విసుగు లేకుండా వెళ్లి వస్తున్నాడు. ఒకసారి ఒక సాధువు కన్పించి వలీగారి దగ్గర ఏమీలేదని తాను తాయత్తు ఇస్తానని ఆశపెట్టాడు. వెళ్ళలేదు. అనుకొన్న

సోమవారం బాబా దగ్గరకు వెళ్లాడు "మా దగ్గరకు వచ్చేవాడెవ్వరు మరొకరి దగ్గరకు పోడు. ఈ పాదాలు పట్టుకొన్న వాడెవ్వడు ఇంకొకరి పాదాలు పట్టడు" అని సాధువు సంగతి తెలిసినట్లు అన్నారు. ఆయన పెట్టే పరీక్షలో గెలిచి అభిమానం పొందాడు. బాబా దగ్గరికి ఎప్పుడైనా వెళ్లి దర్శించే అనుమతి లభించింది.

అయిదేళ్ళ తర్వాత బాబా అప్పలస్వామికి "ఫరీద్ మస్తాన్ ఔలియా" అనే పేరు పెట్టారు. మచిలీపట్నం, తెనాలి, రేపల్లెలలో ఎక్కడో ఒకచోట ఆశ్రమాన్ని స్థాపించి సేవ చేయమని ఆదేశించాడు. అన్నీ చూసి మచిలీపట్నం దగ్గర కరగ్రహారం సరైన స్థలం అని భావించి అక్కడ ఉండిపోవాలనుకొన్నాడు. క్షమంగా శిష్య బృందం ఏర్పడింది. ఎందరో హిందువులు, ముస్లిములు ఆయన శిష్యులైనారు. ప్రత్యర్థులను శాంతపరచి సయోధ్య కూర్చేవారు. "మేము అవసరమైతే గడ్డిపరకతో కూడా పని చేయించుకోగలం" అని ఒకసారి. మరోసారి "మేం నిమిత్తమాత్రులం. అంతా పైవాడి దయ" అని ఔలియా అంటుండేవారు. అందర్నీ గౌరవంగా "మీరు, ఏమండీ, వారు" అంటూ మర్యాదగా సంబోధించటం ఆయన సంస్కార విధానం. తమ గురువులను సందర్శించటానికి విజయనగరం వెడితే వంద గజాల దూరంలో చెప్పులు వదిలేసి ఖాదర్ వలీశాగారిని సమీపించి పాదాల దగ్గర అతి భక్తితో కూర్చొనేవారు. ఆయన అందరి శిష్యుల్లో ఈయనదే అగ్రస్థానం. అంత ప్రత్యేకత పొందారు మస్తాన్ ఔలియా. అన్ని మతాలవారు, అన్ని కులాలవారు ఆయనకు భక్తులయ్యారు. తాడిత, పీడిత జనానికి ఔలియాగారు ఆత్మీయులైనారు. వారి బాధలన్నీ పోగొట్టేవారు.. వ్యాపార, ఉద్యోగ వర్గాలవారు ఆయన సలహాలను తప్పక పాటించేవారు.

ఫరీద్ మస్తాన్‌గారు చేపల వృత్తిలో ఉన్నవారికి సముద్ర మరణ గండాలను చాలాసార్లు తప్పించారు. వారిలో నైతిక ప్రవృత్తి కలిగించారు. వారి పాలిటి దేవుడైనాడు. బాబా గారికి తెలిసినన్ని చేపల్లో రకాలు అక్కడి జాలర్లకు కూడా తెలియవని జాలర్లె ఒప్పుకొన్నారు. పాగోలు లక్ష్మీకాంతమ్మగారి కేన్సర్ వ్యాధిని పోగొట్టారు. ఆదూరి ఉమామహేశ్వరరావుకు ఉబ్బసం తగ్గించారు. ఉద్యోగాలు ఇప్పించటం, అడిగిన వారికి పేర్లు పెట్టటం చేసేవారు. ఇరవై ఏళ్ళ తర్వాత గురువును దర్శించి వచ్చారు. మస్తాన్ బాబా సమాధి చెందటానికి పది రోజుల ముందు అక్క పైడితల్లి మరి కొందరు బంధువులు విజయనగరం నుండి వచ్చారు. 6-12-1968న ఫరీద్ మస్తాన్ ఔలియాగారు సమాధి చెందారు. ప్రతి ఏడు రంజాన్ పండగల్లో ఔలియా ఉరుసు ఉత్సవాలు జరుగుతాయి. అందరు హాజరౌతారు. కరగ్రహారం నిత్యం భక్తుల సందర్శనతో అలరారుతుంది. బాబాకు అత్యంత భక్తులు ఆంధ్రరాష్ట్ర పూర్వ ముఖ్యమంత్రి మర్రి చెన్నారెడ్డి, మాజీ ప్రధాని పి.వి.నరసింహారావు మొదలైన వారున్నారు. ముఖ్యంగా చెన్నారెడ్డి విజయవాడ వైపు వస్తే కరగ్రహారం వెళ్ళకుండా ఉండేవారు కాదు. ఇక పి.వి.గారు బాబా సంస్థాన కార్యవర్గానికి అధ్యక్షులే. షిర్డీ సాయిబాబా, నాగాపురం తాజుద్దీన్ బాబా, విజయనగరం ఖాదర్ బాబాల లాగానే మచిలీపట్నం ఫరీద్ మస్తాన్ ఔలియా ఎన్నో అద్భుతాలు చేసి ప్రజల మనస్సుల్లో శాశ్వతం నిలిచిపోయారు. ఇప్పటికి ఆయన సమాధి నుండే, భక్తుల అభీష్టాలను నెరవేరుస్తారని ప్రగాఢ విశ్వాసం. ❁





# అమృత యోగిని-పెను మత్స సీతమ్మ అవధూత

సాధారణ గృహిణి పూర్వజన్మ వాసన, సంకల్ప బలం, వరిష్ఠ గురుత్వం లభించి, మహి మహిమాన్విత యోగినిగా మారిన ఉదంతమే పెను మత్స సీతమ్మ యోగిని వృత్తాంతం.

సీతమ్మ 26-8-1921న కృష్ణాజిల్లా పెనుమత్స అనే చిన్న పల్లెటూరిలో చెరుకూరి బ్రహ్మయ్య, శ్రీరామమ్మ అనే కమ్మ దంపతులకు జన్మించింది. పుట్టింటిపై మమకారం, ఇరుగు పొరుగుపై ఆదరాభిమానాలు చిన్నప్పటి నుంచే అలవడ్డాయి. ఎనిమిదవ ఏట ఉయ్యూరుకు అతి దగ్గరలో ఉన్న చిన్న కుగ్రామం గండి గుంటలోని నాదెళ్ళ క్రిష్ణయ్య పెద్ద కొడుకు పదిహేనేళ్ళ సీతారామయ్యతో వివాహం జరిగింది. ఈమె తల్లి దండ్రులు అయిదు రోజుల పెళ్లి రంగరంగ వైభవంగా చేశారు. పదహారవ ఏట కాపురానికి వెళ్ళింది. భర్తకు కుడిచేతి మీద వ్రణం పుట్టి, ఎన్ని చికిత్సలకూ తగ్గక చనిపోయాడు. ఆమె కాపురం రెండేళ్ళ ముచ్చట అయిపోయింది.

పుట్టినింటికి తిరిగివచ్చి, ఎప్పుడూ దిగులుగా ఏడుస్తూ గడిపేది. బలవంతం చేస్తే రెండు ముద్దల అన్నం తినేది అంతే. ప్రక్క ఇంటి దండమూడి పూర్ణయ్యగారు రోజు వచ్చి ఓదార్చేవారు. పాటించవలసిన లోకరీతి, ధర్మం, కర్తవ్యం బోధించేవారు. కొంతవరకు తేరుకొని తనకు సంపూర్ణ జ్ఞానం ఇచ్చాడు. ఆమె రామకోటి రాయటం ప్రారంభించి, కఠిన నియమాలను పాటిస్తూ తులసి పూజ చేస్తూ గడిపింది. 1942 సూర్యోపాసన ప్రారంభించింది. ఉదయం ఆరు గంటల నుండి, మధ్యాహ్నం పన్నెండు గంటల వరకు సూర్యునికి ఎదురుగా నిలబడి దీక్షగా కొనసాగించింది. 1945కు రామ కోటి పూర్తిఅయింది. అన్న, వదినలతో భద్రాచలం వెళ్ళింది. రామకోటిని శ్రీరాముని పాదాల వద్ద ఉంచి దగ్గరలో ఉన్న ప్రదేశాలు చూసి హంసలదీవి వేణుగోపాలుణ్ణి దర్శించి చల్లపల్లి కోటకు వెళ్లి, రాణిగారిచే సన్మానం పొంది మళ్ళీ పెనుమత్సకు చేరింది.

### మలుపు

1946వ సంవత్సరంలో ఆమె జీవితం ఒక మలుపు తిరిగింది. ఏలూరు నుండి కమ్ముల అప్పన్న అనే యోగ వ్యాయామ విద్యా ప్రవీణుడు పనిమీద పెనుమత్సకు దగ్గరలోని నరసన్న పాలెం వచ్చాడు. సీతమ్మ విషయం ఆయనకు తెలిసింది. పెనుమత్సకు వచ్చి, ఆసనాలు, యోగం నేర్పి వాటి వల్ల మనస్సు కుదుటబడుతుందని చెప్పాడు. ఆమె సాధన ప్రారంభించింది. అప్పుడప్పుడు అప్పన్నగారు వచ్చి చూసి పోతుండేవాడు. వారానికోసారి అన్నం తినటం, ఆ తర్వాత నిమ్మకాయ నీళ్ళు మాత్రమే తాగి ఉండటంతో సాధన తీవ్రం చేసింది. ఆమె సాధన అప్పన్నగారికే ఆశ్చర్యం వేసింది. తాను సాధించిన

యోగవిద్య తన పెరటిలో అందరికి చూపి అబ్బురంలో ముంచేసింది. ప్రాణాయామం, అందులోని తేడాలు, ఫలితాలు అప్పన్న తెలియజెప్పాడు. వాటినీ సాధించింది. కుండలనీ యోగ సాధన చేసి "అమృత పానాన్ని" అలవాటు చేసుకొన్నది. ఇది సాధారణ యోగులకు అసాధ్యం.

## మహిమల వ్యాప్తి

1948లో అప్పన్నగారు తాను కట్టిన ఇంటి గృహ ప్రవేశ వార్షికోత్సవాలకు సీతమ్మ కుటుంబాన్ని రమ్మని ఆహ్వానించాడు. అప్పన్న శిష్యులు, బంధువులు, అనేకమంది పెద్దలు, ప్రభుత్వోద్యోగులు అందరు వచ్చారు. అప్పన్నగారి కోరిక మీద "భక్తి యోగం" గురించి అద్భుత ప్రసంగం చేసి అందర్నీ ఆకర్షించింది. జిల్లా కలెక్టరు, భార్య కూడా హాజరైన ఆ సమావేశంలో సీతమ్మ "కుండలినీ యోగం ప్రదర్శించి, సహస్రారం నుండి అమృతం తీసింది" హాలు అంతా సువాసనలతో గుబాళించిపోయింది. అప్పుడే ఆమె కీర్తి అన్ని జిల్లాలకు వ్యాపించింది. అమృత పానం చేయటం ఎంతో యోగ సిద్ధి ఉన్న మహాత్ములకే సాధ్యం. ఎందరెందరో భక్తులు పెనుమత్స వచ్చి దర్శించి వెళ్ళేవారు. ఇంట్లోనే తడికల గదిలో ఎనిమిదేళ్ళు యోగ సాధన చేసింది. అప్పటికే పేరు, ప్రఖ్యాతి పొందిన కురుమద్దాలిలోని మాల పిచ్చమ్మ అనే రామావధూతను సందర్శించింది. సీతమ్మను పిచ్చమ్మ ఆప్యాయంగా ఆదరించి "బిడ్డా! కొద్ది రోజుల్లో నీ కోరిక తీరుతుంది" అని ఆశీర్వదించింది.

ఇంటికి తిరిగి వచ్చి తడికల గదిలోనే ఉంది. ధృడమైన వైరాగ్యంతో ఒకే ఆసనంలో 4 నెలలు "సవికల్ప సమాధి"లో ఉంది. పిరుదులు చిల్లిపడి రక్తం కారటం ప్రారంభమైంది. ఇంట్లోవాళ్ళు కంగారుపడి అప్పన్నగారిని పిలిపించారు. ఆయన వచ్చి కంగారేమీ లేదని, ఆమె యోగానికి భంగం కలిగించవద్దని, ఆమె "బ్రహ్మానంద మజ్జ"గా ఉందని తనంత తానే లేస్తుందని ధైర్యం చెప్పాడు. యోగం పూర్తి అవగానే ఆమె మామూలు రూపంలోకి వచ్చింది. కుటీరంలోనే ఉంది. 1951 అంతా గడిపింది. అనేక దివ్య దర్శనాలను పొందింది. శ్రీలక్ష్మీ నారాయణుల వరం లభించింది.

## భక్తులకు దర్శనం

1952లో అప్పన్నగారు వచ్చి భక్తులకు దర్శనం ఇవ్వవలసిందిగా సీతమ్మగారికి సూచించారు. ఇది తెలిసి తండోపతండాలుగా జనం వచ్చేవారు. గ్రామంలోని దేవాలయం వద్ద ఎత్తైన వేదిక నిర్మించారు. దిగంబరంగా వెళ్లి వేదిక మీద పద్మాసనంలో కూర్చొని అయిదు రోజులు దర్శనం ఇచ్చింది. 1952లో తన తడికల గదిలోనే ఉంది. హఠయోగం, రాజయోగం, ఆత్మ రామాయణం రాసిన కాగితాలను బయలకు విసిరింది. వాటిని చూసిన పెద్దలు ఆమె సమాధి నుంచి లేచినపుడు తీరిక వేళల్లో ఈ రచనలు చేసి ఉంటుందని భావించారు. 1954వ సంవత్సనరంలో కూడా ఆగస్ట్ ఎనిమిదో తేది నుండి, సెప్టెంబర్ ఇరవై ఆరవ తేది వరకు దివ్య దర్శనం ఇచ్చింది. అప్పుడు ఆమె తల



వెంట్రుకలన్ని పాము మెలికలు తిరిగి ఉన్నట్లు కనిపించేవి. ఆ గ్రామ కరణం కట్టమూరి పుండరీకాక్షుడు ఆమె తల వెంట్రుకలను భక్తితో తాకి కళ్ళకు అద్దుకొన్నాడు. అప్పుడు అమ్మ ఆయనతో "నేను వెళ్లిపోయిన తర్వాత వాటిని తీసుకొని జాగ్రత్త చేసుకోండి" అని చెప్పింది. 1955 సెప్టెంబర్‌లో "పిండోత్పత్తి" గురించి రాసి కాగితాలను గది బయటకు విసిరేసింది. చాలామంది దర్శనానికి రోజు వచ్చినా, బయటకు రాకుండా తన గదిలోనే ఉండిపోయేది. 1956లో మార్చి ముప్పై నుంచి పదిరోజులు దర్శనం ఇచ్చింది. ఆమెకోసం తండ్రిగారి పొలంలోనే ఒక సమాధి మందిరం నిర్మించారు. 9–2–1957న అశేష భక్తజనం వెంటరాగా ఇంటి నుండి ఊరేగింపుగా వెళ్లి మందిరం చేరింది. రెండు రోజులు మాత్రమే దర్శనమిచ్చింది. ఈ రెండు రోజులు చల్లపల్లి రాణి వెంకట దుర్గాంబగారు వచ్చిన వేలాది జనాలకు అన్నసంతర్పణ చేసింది. జనం ఎక్కువై పదార్థాలు అయిపోతే అక్క నాగరత్నమ్మ వచ్చి సీతమ్మకు చెప్పేది. "నువ్వు వెళ్లి అఖండం వెలిగించి, అన్న రాశులను ముట్టుకో" అనేది అంతే పదార్ధాలన్నీ అందరికి సరిపోయేవి. అంటే అక్షయంగా సమారాధన జరిగిపోయేదన్నమాట.

తన మందిరంలోనే సీతమ్మ యోగిని ఎప్పుడు యోగ సమాధిలోనే ఉండేది. భక్తులు ప్రతి సోమవారం వచ్చి సమాధిని పూజించి వెళ్ళేవారు. మాసశివరాత్రికి అన్నదానం జరిగేది. ప్రతి గురువారం రాత్రి భజనలు, హరి కథలు, జంగం కథా కాలక్షేపం ఉండేవి. సమాధి మందిరంలో దగ్గరే భక్తులు నిద్రపోయి తమ కోరికలను విన్నవించేవారు. ఆమె అనుగ్రహంతో వారి మనోభీష్టాలన్ని నెరవేరేవి.

## లక్షల మందికి దివ్య దర్శనం

5–3–1958 నాడు ఒక్కరోజే దర్శనం లభిస్తుందని తెలిసి ఆంధ్రదేశంలోని అన్ని జిల్లాల నుండి రాష్ట్రేతరాల నుండి లక్షలాది మంది ముందు రోజు రాత్రికే పెనుమత్స చేరారు. సమాధికి ముందు కట్టిన ఎత్తైన వేదికమీద అమ్మ దర్శనమిచ్చి అందరిని సంతృప్తుల్ని చేసింది. ప్రేమ, కరుణ, వాత్సల్యం కురిపించి ఆశీర్వదించింది. దర్శనం ఇచ్చే ముందు తనవారితో "ఈ దర్శన మండపం ఎందుకు? ఇంకో ఏడాదేగా?" అన్నది అమ్మ జీవ సమాధి అవటానికి నిశ్చయించుకొన్నది అన్న వార్త విపరీతంగా వ్యాపించింది. కృష్ణాజిల్లా కలెక్టర్ అమ్మను దర్శించటానికి వచ్చాడు. అమ్మ శీర్షాసనంలో ఉంది. ఆమె తల వద్ద వింత వెలుగు కనిపించి ఆశ్చర్యపోయి వెళ్లిపోయాడు. ఒకసారి అక్క నాగ రత్నమ్మ "నీ మహాత్మ్యం ఏదైనా చూపించమ్మా?" అని అడిగింది. దానికి నవ్వి "నాకు భగవంతుని మెప్పించే విద్య వచ్చు కాని మనుష్యులను మెప్పించే విద్య రాదు" అని అన్నది. మళ్ళీ ఫాల్గుణ పౌర్ణమి నాడు 24–3–1959 దర్శనమిస్తానని ప్రకటించింది. ఆనాటి ఉదయానికే లక్షలాది భక్తులు చేరుకొన్నారు. అందరికి కనులపండువుగా దివ్య దర్శనం అనుగ్రహించి తరింపజేసింది. మళ్ళీ మందిరంలోకి వెళ్లిపోయింది. మందిరం బయట తాళం వేసి తాళం చెవి తల్లి శ్రీ రామమ్మ తన దగ్గర

దాచుకోవటం అలవాటు.

### బ్రహ్మైక్యం

ఎనిమిదేళ్ళు నిరాహారంగా తపస్సు చేస్తున్న అమ్మలో హఠాత్తుగా ఒక పరిణామం కలిగింది. ఎనిమిది రోజుల తర్వాత అమ్మ మందిరంలో ఉండగానే, అక్క నాగరత్నమ్మ గంట కొడుతూ మందిరానికి ప్రదక్షిణాలు చేస్తోంది. సమాధి నుంచి అమ్మ తలుపు తీయమని మూడుసార్లు పిలిచింది. అక్క, అమ్మని పిలుచుకు వచ్చి, తాళం తీయించి తలుపు తెరిచింది. "నేను వెళ్లిపోతున్నాను. నా నెత్తిన బిందెడు నీళ్ళు పోయండి" అంది అమ్మ. వాళ్ళు భయపడి నీళ్ళు పోయకుండా కరణంగారిని పిలుచుకు రావటానికి మనిషిని పంపారు. ఆయన వచ్చే లోపే అమ్మ "కపాలం భేదించుకొని" బ్రహ్మైక్యం చెందింది. ఆరోజు 2-4-1959 ఫాల్గుణ బహుళ అష్టమి సాయంత్రం అయిదు గంటలు. మర్నాడు చల్లపల్లి రాణిగారు వచ్చారు. లెక్కకు మించిన జనాలతో అమ్మను ఊరేగించి ఆమె శిరోజాలను ఖండించి, ముందే ఏర్పాటు చేసిన సమాధిలో అమ్మ పార్థివ శరీరాన్ని నిక్షిప్తం చేశారు. తరువాత అమ్మ సమాధి నుండి దివ్య పరిమళాలు వ్యాపించి అందరిని సంభ్రమాశ్చర్యాలలో ముంచింది. ప్రతి ఏడు ఫాల్గుణ పౌర్ణమి నుండి బహుళ అష్టమి వరకు తొమ్మిది రోజులు అమ్మ ఆరాధన ఉత్సవాలు వైభవంగా నిర్వహిస్తారు.❁





# భుక్త రహిత రాజయోగి-వేటూరి ప్రభాకర శాస్త్రిగారు

**వే**టూరి ప్రభాకర శాస్త్రిగారు అంటే సాహిత్య మేరుపర్వతం. ఆయన రాయని పీఠిక లేదు. తరచని సాహిత్యమూ లేదు, తిరగేయని శాసనం, సేకరించని తాళపత్రం లేదు. దేశభక్తిలో అనుపమానమైనవారు. ఇవన్నీ మనకు అందరికి తెలిసిన విశేషాలే. కాని అందరికి తెలియని మహా పార్శ్వం వేటూరి వారిలో ఉంది. వారు మాస్టర్ సి.వి.వి.గారి శిష్యులై ఎంతో యోగసాధన చేసి ఆధ్యాత్మిక తీరాలను చూసి, తనవంటి వారెందరినో శిష్యలను తయారుచేసి దీనులను ఉద్ధరించారు. అదే మనం తెలుసుకోబోతున్నాం.

కృష్ణాజిల్లాలో దివి తాలూకా చల్లపల్లికి సమీపంలో పెద్ద కళ్ళేపల్లిలో ప్రభాకర శాస్త్రిగారు 7-2-1888న వేటూరి శేషమ్మ, సుందర శాస్త్రి దంపతులకు జన్మించారు. పదహారేళ్ళకే తెలుగు, సంస్కృతం పుక్కిట పట్టారు. కవిత్వమూ చక్కగా అలవడింది. శతావధాన, అష్టావధానాలెన్నో చేశారు. మద్రాసులో తెలుగు పండితులుగా పనిచేశారు. అప్పుడే వేపా రామేశంగారి వద్ద ఖగోళం, చరిత్ర అధ్యయనం చేశారు. 1910లో పిసుపాటి మహాలక్ష్మమ్మగారితో వివాహమైంది. మద్రాస్ ప్రాచ్యలిఖిత భాండాగారంలో పండితునిగా చేరి ఇంగ్లీష్, కన్నడ, తమిళాలు నేర్చారు. చరిత్ర, సంస్కృతి, వాఙ్మయం, శాసనాలు తాళపత్రాలు, కైఫీయతులు, గ్రంథాలు సేకరించి, పరిశీలించి పరిష్కరించి, ముద్రించారు. "ఎన్నో బండ్లకు ఎత్తదగినంత సాహిత్య వాఙ్మయాన్ని శాస్త్రిగారు సంతరించారు" అని ఆయన్ను గురించి అంటారు.

### యోగ సాధన

1912-16 మధ్యకాలంలో శాస్త్రిగారు తీవ్ర బాధలకు గురైనారు. మానసిక స్వాస్థ్యమూ కోల్పోయారు. మద్రాస్‌లో రైలు ఎక్కి ఎక్కడో ఆత్మహత్య చేసుకోవాలని భావించి, రైలు ఎక్కటానికి స్టేషన్‌కు పోతున్నారు. అబ్బూరి జగన్నాధరావు అనే వారితో పరిచయమైంది. ఆయన తన బావగారైన ప్రెసిడెన్సి కళాశాల ఫిలాసఫీ ప్రొఫెసర్ పోతరాజు నరసింహంగారిని పరిచయం చేశారు. ఈయన మాస్టర్ సి.వి.వి.గారి శిష్యులు. పోతరాజుగారు ఇచ్చిన పరిచయ ఉత్తరాన్ని తీసుకొని వేటూరి వారు కుంభకోణంలో ఉన్న మాస్టర్‌గారింటికి చేరి ఉత్తరం ఇచ్చారు. ఆయన చదివి విశ్రాంతి తీసుకోమని సలహా ఇచ్చారు. ఆ మాటతోనే శాస్త్రిగారిలో "ప్రజ్ఞ" ప్రవేశించింది. అప్పటికి ఆయన చేతిగూడు జారి చాలాకాలం నుంచి చాలా బాధ పడుతున్నారు. ఇక్కడికి రాగానే తగ్గిపోయి గూడు మళ్ళీ యధాస్తానం చేరింది. ఒక చెయ్యి పైకి లేపగలిగే వారుకాదు. ఇప్పుడు హాయిగా చెయ్యి పనిచేస్తోంది. మాస్టర్ గారి అనుమతితో రాధాకృష్ణ పిళ్ళే,

మహాదేవగార్లు శాస్త్రిగారిని పరీక్షించి పూర్వజన్మ వృత్తాంతం తెలుసుకొని మాస్టర్‌గారికి నివేదించారు. అప్పటి నుంచి శాస్త్రిగారు మాస్టర్‌గారి శిష్యులైపోయారు.

ఇతరుల బాధలను చూసి శాస్త్రిగారు తట్టుకోలేకపోయేవారు. తన ఆత్మ శక్తితో బాధలు తీర్చేవారు. "నిన్నటి వరకు నువ్వు ప్రజ్ఞా ప్రభాకరుడివి. ఈరోజు నుండి నన్ను గురించి రాయగల యోగ్యత నీకు కల్గింది" అని గురువుగారు శాస్త్రిగారిని మెచ్చారు. 1918లో తంజావూర్ సరస్వతి గ్రంథాలయంలో పనిచేశారు. వారాంతపు శలవల్లో మాస్టర్ గారిని దర్శించి యోగ రహస్యాలు నేర్చేవారు శాస్త్రిగారు "తమలో సమస్త విశ్వాన్ని, సమస్త విశ్వంలో తమను చదర్శించగల యోగి పుంగవులు" అయ్యారు. భార్యను కూడా మాస్టర్‌జీకి శిష్యురాలిని చేశారు. శాస్త్రిగారు "గౌతమబుద్ధుని అవతారం" అని నాడీ గ్రంథాలు తెలిపాయి. అందుకే ఆయనలో కరుణ, ప్రేమ, శాంత గంభీరత స్పష్టంగా కన్పిస్తాయి. ఆయన ముఖం చూస్తేనే చాలు మానసిక ప్రశాంతి లభిస్తుందని చాలామంది చెప్పేవారు.

**యోగ ప్రభాకరామృతం**

ఒక రిక్షాలాగే వాడి కొడుకు నోటమాట రాక మూతి వంకరపోయి చేతులు, కాళ్ళు స్వాధీనంలో లేక శాస్త్రిగారి దగ్గరకు వస్తే, ధ్యానం చేసి వాడితో కాఫీ తాగించి శరీరం అంతా నిమిరి ప్రేమ కురిపించారు. అంతే వాడు తనకే జబ్బు లేనట్లు లేచి కూర్చున్నాడు.

బందరులోని వేమూరి దుర్గా నాగేశ్వరరావుకు రెండు కిడ్నీలలో రాళ్ళు చేరి ఎన్ని మందులు తిన్నా తగ్గక వేటూరి వారి వద్దకు చేరాడు. డాక్టర్లు అది తగ్గే జబ్బు కాదని హేళన చేశారు. ఒకసారి తీవ్రంగా బాధ అనుభవిస్తూ శాస్త్రిగారికి కబురు చేస్తే, తాను అక్కడి నుండే చికిత్స చేస్తున్నానని భయం లేదని చెప్పారు. కాసేపటికి మూత్రం ద్వారా రాళ్ళు పడిపోయి బాధ నివారణ జరిగింది. ఆలస్యం ఎందుకు జరిగింది అని ఆయన వేటూరి వారిని ప్రశ్నిస్తే "నమ్మకం నీకు పూర్తిగా లేనందువల్ల" అని చెప్పారు.

ఒకసారి శాస్త్రిగారు అయాచితుల హనుమచ్ఛాస్త్రి, అప్పల సోమేశ్వర శర్మలతో "భుక్త రహిత రాజయోగం" గురించి, మాస్టర్‌గారి గురించి మాట్లాడుకొంటున్నారు. వారిద్దరూ ఈ యోగా మహాత్యానికి ఏదైనా నిదర్శనం చూపమని అడిగారు. "మీకు యే పువ్వు ఇష్టమో చెప్పండి" అన్నారు శాస్త్రిగారు. "సంపంగి" అన్నారు వారిద్దరూ. వేటూరివారు ధ్యానంలో మునిగిపోయారు. వెంటనే వాళ్ళున్న ప్రదేశమంతా సంపంగిపూల వాసనలు గుబాళించాయి. కాలం కాని కాలంలో సంపంగి పూల వాసన రావటం అందర్నీ ఆశ్చర్యంలోకి నెట్టేసింది. ఇదే ఆ యోగానికి నిదర్శనం.

కల్లూరి వీర భద్రశాస్త్రి వేటూరివారిని దర్శించటానికి మద్రాస్ వెళ్లారు. అక్కడ "కూం నది" మురికి కంపు భరించ లేకుండా ఉంది. వీరభద్రం గారు "శాస్త్రీ! ఈ కంపు పోగొట్టవా" అని మనసులో అనుకొన్నారు. అంతే శాస్త్రిగారు కళ్ళు మూసుకొని ధ్యానిస్తే,



సుగంధ పరిమళాలు అంతటా వ్యాపించాయి.

ఇంకోసారి "అనాసపండు" తినాలని పించింది. కాసేపటిలో ఆయన దర్శనం కోసం రాజమండ్రి నుంచి అప్పుడే వచ్చిన పద్మనాభ స్వామి అనే సాధకుడు అనాసపండ్లు గంపతో వచ్చి ఇచ్చాడు.

ప్రఖ్యాత శాస్త్రవేత్త విస్సా అప్పారావు వేటూరి వారికి వియ్యంకులు. అప్పారావుగారు శాస్త్రిగారి యోగాద్భుతాలు 31ని గ్రంథస్తం చేశారు. అందులో ఒకటి కుష్టు రోగంతో బాధపడుతున్న వకీలు గుమాస్తాకు తన ఇంటి వద్దనుంచే నయం చేశారు. తిరుపతిలో ఉండే నరసింహాచారికి, ఒక రెడ్ల కుర్రాడికి మద్రాస్ నుండే కుష్టు రోగంకు చికిత్స చేసి పోగొట్టారు. దీన్నే "డి స్టంట్ హీలింగ్" అంటారు. తిరుపతిలోని పార్థసారధి అయ్యంగార్ భార్యకు గర్భకోశ కేన్సర్. డాక్టర్లు ఆమె పని రోజుల్లోనే ఉందన్నారు. శాస్త్రిగారు ఆయన కోరితే వాళ్ళింటికి వెళ్లి ప్రార్థన చేశారు. నలుపు, ఎరుపు ద్రవం బయటికిపోయి పదిహేను రోజుల్లో ఆమె మామూలు మనిషి అయింది.

1939–40 ప్రాంతంలో ఆచార్య దివాకర్ల వెంకటావధాని గారికి నిద్రరాక పోవటం, గుండె దడ, వీధిలో నడవటానికి భయం ఉండేవి. శాస్త్రిగారిని సంప్రదించారు. అదేదో సూక్ష్మ శరీరంలోని బాధ అని తెలుసుకొన్నారు. అది అవధానిగారి మొదటి భార్యదే. ఎంతగా ట్రీట్ చేసినా తగ్గలేదు అవధానిగారికి. ఒకసారి "నువ్వు నా మాట వినకపోతే వినేట్లు చేస్తాను" అని గట్టిగా మందలించారు. వారి ఆదేశం ప్రకారం అవధానిగారి రెండో భార్యకు మొదటి సంతానంగా పుట్టి ఋణం తీర్చుకొంది. అప్పటి నుండి అవధానిగారికి యే బాధలు లేవు.

అలాగే కుప్పు స్వామి శాస్త్రిగారి మొదటి భార్య చనిపోయి ఆయన్ను చాలా బాధపెడితే వేటూరి వారు ఆమెను ఆయన కొడుకుశేషగిరికి కూతురుగా పుట్టమని చెప్పి అలానే జరిగితే ఆయనకు ఆనందం కలిగింది.

ప్రఖ్యాత దేశభక్తులు, మహావక్త చెరుకువాడ నరసింహం పంతులుగారికి క్షయ వ్యాధి చాలా తీవ్రంగా వచ్చింది. దాన్ని ట్రీట్ చేసి నయం చేశారు శాస్త్రిగారు. అలానే ప్రముఖ సంపాదకుడు నార్ల వెంకటేశ్వరరావు భార్యకు పార్శ్వపు నొప్పి, తిరుపతి ప్రాచ్య శోధన సంస్థ సంచాలకుడు రామానుజస్వామి భార్యకు జలోదరం తగ్గించారు.

"నా చుట్టూ ఆనందాన్ని, అమృతాన్ని పంచి పెట్టాలనే సంకల్పం ఉన్నవాణ్ని నేను. అందర్నీ ఆపదల నుంచి రక్షించటం, అందర్లో ఆనందాన్ని నెలకొల్పటం అనే రెండు భావాలే నాకు ఉచ్ఛ్వాస నిశ్వాసాలు. అవి రెండు ఆడటంలోనే నా ఊపిరి" అన్న మహానుభావులు వేటూరి ప్రభాకర శాస్త్రిగారు. నిజంగానే ఆయన ప్రభాకరుడు అంటే సూర్యుడులానే ఆరోగ్యాన్నిచ్చేవారు. ఆరోగ్యం భాస్కరాదిచ్ఛేత్ కాదు ఆరోగ్యం ప్రభాకరాదిచ్ఛేత్" అయింది ఆయనపట్ల. సార్థక జీవులు వారు.

ఒకసారి వారు తాళపత్రాల కోసం వూళ్లు తారుగుతూ ఒక వూరిలో ఉండగా

నిద్ర పట్టక బయట తిరుగుతూ, దీపం వెలుగుతున్న ఇంటికి పోయి మంచినీళ్ళు అడిగారు. గృహిణి మంచినీళ్ళ చెంబు అందించి, తన భర్త ప్రాణాపాయ స్తితిలో ఉన్నారని దీనంగా విలపించింది. అంతే కరుణార్ద్ర హృదయులు శాస్త్రిగారు మంచినీళ్ళు తాగకుండా తన బసకు చేరి కాళ్ళు కడుక్కొని నిద్రపోకుండా ప్రార్ధన చేశారు. తెల్లారి వెళ్లి ఆమెను పలకరించారు. "మీరు పలకరించి వెళ్ళిన తర్వాత మా వారికి ఆరోగ్యం కుదుటబడింది" అని కృతజ్ఞత చెప్పింది ఆ ఇల్లాలు. ప్రార్ధనకు, ఈశ్వర అనుగ్రహానికి ఉన్న మహత్తర శక్తి ఇక్కడ మనకు కన్పిస్తుంది. ఆయన అనుకంప అలాంటిది. అందుకే ఆయన బుద్ధుని అపర అవతారం అన్నారు. యోగ ప్రభాకరులు 29-8-1950న తమ హంసను సవిత్రుల మండల నారాయణమూర్తిలోనికి చేర్చి ధన్యులయ్యారు. వారికి దేశం అన్ని విధాలా ఎంతో రుణపడి ఉంది.

**యోగ ప్రభాకర కిరణాలు**

ప్రభాకర శాస్త్రిగారి యోగ శిష్యులలో కొత్త వెంకటేశ్వరరావు, కొత్త రామ కోటయ్య, అర్చకం ఉదయగిరి శ్రీనివాసాచార్యులు, ఏం.ఎల్.నారాయణ రావు, వెన్నెలకంటి మునిక్రిష్ణయ్య, గాలి బాల సుందరరావు, తిమ్మా వజ్ఝల కోదండ రామయ్య, సింగరాజు సచ్చిదానందం, పోచిరాజు శేషగిరిరావు, శ్రీమతి కల్పవల్లి, శ్రీమతి చంద్రకాంతమ్మ మొదలైన వారెందరో ఉన్నారు. ❀





# అవధూత చక్రవర్తి-కురుమద్దాలి పిచ్చమ్మ

మనిషి యే కులమో కాదు, మనసు యే కులమో చూడాలి. అప్పుడే మనం జ్ఞానవంతులమవుతాం. మాల కులంలో జన్మించి, జన్మ జన్మల సంస్కారాన్ని వెంటనిడుకొని, రామ భక్తి సామ్రాజ్యాన్ని యేలి మహాత్మాగాంధీని, రమణ మహర్షిని, మళయాళ స్వామి వంటి వారినే సంభ్రమాశ్చర్యాలలో ముంచివేసిన కురుమద్దాలి పిచ్చమ్మ చరిత్ర సర్వ పాపహారం. ఆ అమ్మ ప్రత్యక్ష సచ్చిదానందమూర్తి, అవధూత చక్రవర్తి.

పిచ్చమ్మ మాల కులంలో బెజవాడ బందరు రోడ్డులో పామర్రుకు దగ్గరగా ఉన్న కుగ్రామం కురుమద్దాలిలో వర్రే ముత్తయ్య, వీరమ్మ దంపతులకు 1870లో జన్మించింది. మంచి ఆజానుబాహువు శరీరంతో ముచ్చటగా ఉండేది. పిల్లగా ఉన్నప్పుడే మంత్రం వేసినట్లు పడిపోయేది. ఆడుతూ, పాడుతూ పరవశించేది. ఏది చేసినా తాదాత్మ్యం చెంది చేయటం ఆమెకు అలవాటైనది. ఆమెకేదో రోగం అనుకొన్నారు దల్లిదండ్రులు. రామాలయంలో రామచంద్రుని రూపం చూస్తూ పరవశించేది. ఎన్నో వైద్యాలు చేయించినా తీరు మారలేదు. "పిచ్చి పిచ్చమ్మ" అని పిలిచేవారు. తుమ్మలపల్లి గ్రామంలో నీలి శోభనాద్రి కిచ్చి వివాహం చేశారు. కాపురానికి వెళ్ళినా ఏకాంత జీవితమే. గోసేవ చేసేది. నిర్జన ప్రదేశం దొరికితే ధ్యానంలో మునిగి స్పృహ తప్పి పడిపోయేది. ఆమెకు రామనామమే అండా, దండా.

పిచ్చమ్మ గర్భవతి అయింది. నాల్గవ నెలలోనే భర్త చనిపోయాడు. ఆడపిల్లను కని భాగ్యమ్మ అని పేరు పెట్టింది. మళ్ళీ పెళ్లి చేసుకోమని తల్లి తండ్రి కోరితే తిరస్కరించింది. కూలి చేసి బిడ్డను సాకింది. కష్టపడి పనిచేసి ముఠామేస్త్రి అయింది. ఆమె పని అంటే అందరికి ఇష్టం. ఒళ్ళు దాచుకోకుండా చేసేది, చేయించేది. పిల్లను పోషిస్తూ మిగిలిన డబ్బును మంచి పనులకు ఖర్చు చేసేది. యుక్త వయసు రాగానే భాగ్యమ్మను ఒక అయ్య చేతిలో పుట్టి పెళ్లి చేసింది. అల్లుణ్ని కన్న కొడుకుగా చూసుకొంది. కాని అత్తవారు ఆమెను రాచి రంపాన పెట్టేవారు. తల్లికి వచ్చి చెప్పుకొని ఏడ్చేది. బతిమిలాడి పంపించేది. ఒకసారి అత్తారింటికి వెళ్లనని భీష్మిస్తే "యే నూతిలోనో పడి చచ్చినా బాగుండును కూతురు" అనుకొన్నది మనసులో. అనుకొన్నట్లే భాగ్యమ్మ నూతిలో దూకి చనిపోయింది. పోలీసులకు తెలిసి వచ్చి విచారిస్తే అత్తమామల మీద నేరం చెప్పకుండా తన కూతురికి మూర్ఛ రోగం అందుకే తెలీకుండా నూతిలో పడి చనిపోయిందని చెప్పిన ఉత్తమ ఇల్లాలు పిచ్చమ్మ.

**రామావధూతగా పరిణామం**

పిచ్చమ్మకు వైరాగ్య భావన పెరిగిపోయింది. మొలకు ఒక గోనె సంచి మాత్రం

కట్టుకొని తిరిగేది. స్మశానంలో నివాసం. రామ నామం, హనుమన్నామం జపిస్తూ తిండీ తిప్పలు లేకుండా గడిపింది. కూతురు భాగ్యమ్మ కోసం యిప్పటిదాకా ఏడ్చిన పిచ్చమ్మ భగవద్భాగ్యం కోసం ఏడవటం ప్రారంభించింది. అలాంటి సమయంలో ఎక్కడి నుంచో ఒక గోసాయి వచ్చి, ఓదార్చి ఏదో ఉపదేశించి వెళ్లాడు. ఆయన కోసం వెదికితే కనిపించలేదు. వచ్చిన వాడు సాక్షాత్తు శ్రీరాముడే అని నమ్మింది. ఆ దు:ఖంలో జ్ఞానసిద్ధి కలిగింది. త్యాగరాజు కృతులు, రామదాసు భజనలు, వేమన పద్యాలు, బ్రహ్మంగారి తత్త్వాలు పాడుకొంటూ ఉండేది. ఆకులు అలములు స్మశానంలో ఒంట్రుమన్నే ఆహారం. పాములతో సహజీవనం. అవి ఆమెను ఏమీ చేసేవి కావు. ఆమెకు పిచ్చి బాగా ముదిరిందని పిల్లలు రాళ్ళతో కొట్టేవారు. అలానే సహించేది. ఒకసారి ఒక కుర్రకుంక విపరీతంగా రాళ్ళు విసిరాడు. "ఒరి కుర్ర కుంకా! చేతులు బొబ్బలెక్కుతాయిరా" అంది. నిజంగా వాడి చేతులకు ఎర్రగా బొబ్బలెక్కి పోయాయి. వాడి తల్లి దండ్రులు వచ్చి ఏడుస్తూ కాళ్ళమీద పడ్డారు. "పోతాయిలే పోరా" అన్నది. అంతే వాడి బొబ్బలు మాయం. పిచ్చమ్మలో ఏదో శక్తి ఉందని అప్పుడు కురుమద్దాలి జనం గ్రహించారు. కుటీరం నిర్మించి అమ్మకు ఆశ్రయం కల్పించారు. వారి బలవంతాన అందులో చేరింది. ఒకసారి కాళ్ళుపడి పోయిన ఒక వ్యక్తి బండిలో ఆస్పత్రికి తీసుకు వెళ్తుండగా బండిని ఆపించి ఆ రోగిని కిందికి దింపి, వీపు మీద చెయ్యి వేసి రాసింది. "ఇంటికి పోరా" అంది. వాడు హాయిగా నడుచుకొంటూ ఇంటికి వెళ్లాడు. ఇలా క్రమక్రమంగా ఆమె మహత్తు జనాలకు తెలిసి గురి బాగా కుదిరింది. పిచ్చి పిచ్చమ్మ రామావధూత పిచ్చమ్మగా పరిణామం చెందింది.

### జ్ఞానయోగిని పిచ్చమ్మ

పిచ్చమ్మను చూడటానికి వచ్చే జనం పెరిగిపోతున్నారు. ఆమె క్రమంగా తత్త్వ రహస్యాలను, ఉపనిషద్ రహస్యాలను పామర భాషలో తెలియజెప్పేది. ఆమె "పని అవుతుంది" అంటే అయ్యేది. "కాదు" అంటే పని జరిగేది కాదు. రాముడు ఏది పలికిస్తే అది పలుకుతున్నాను అనేది. తనను "వీడు" అనుకొనేది. అమ్మ దేహం నుండి జ్ఞానాగ్ని, యోగాగ్ని సెగలు, పొగలు వచ్చేవి. అప్పుడు చన్నీళ్ళు ధారగా పోసి వెంకమ్మ, వరలక్ష్మి తాపం తీర్చేవారు. ఆమెలో "బ్రహ్మానంద భావన" క్రమంగా పెరిగింది. రాముడు, కృష్ణుడు మొదలైన దశావతారాలు తనకు కన్పించినా మనశ్శాంతి ముఖ్యమని వారిని తిరస్కరించానని చెప్పేది. 1925 పిన్నమనేని రామయ్య వగైరాలు ఆశ్రమం నిర్మించారు. ఆమె తపస్సుకు అనుకూలంగా "భూగర్భ భువనేశ్వరం" నిర్మించారు. రోజు విడిచి రోజు సమాధిలోకి, మూడు రోజులకోసారి మౌనంలోకి వెళ్ళేది.

### మహిమాన్విత యోగిని

అమ్మ సమాధి నుంచి లేచినప్పుడు దర్శించుకొన్న వారి బాధలు తీరేవి. "అమ్మా నీకేమివ్వమంటావు?" అని ఎవరైనా అడిగితే "వీడికేమి కావాల్రా-గోడకట్టు" అని ఆశ్రమ



సేవ చేయించేది. మనుష్యుల ముఖాలు చూసి వాళ్ల అర్హతలను చెప్పేది. ఎప్పుడు అర్ధ నగ్నంగా ఉండేది. దురుద్దేశం ఉన్నవాళ్ళు వస్తే "వాడి కంట్లో దోషం ఉంది. నాకు దుప్పటి కప్పండి" అనేది. అక్కలు, బంధువులు ఇళ్లకు రమ్మని పిలిస్తే వెళ్ళేది కాదు. తాను మంచి మార్గంలో నడుస్తున్నానని, వాళ్ళనూ సన్మార్గంలో నడవమని బోధించేది. అమ్మ దగ్గర ఎప్పుడో అప్పు తీసుకున్న వాడు చెల్లించటానికి వస్తే "వీడు ఎవ్వరికీ ఋణం లేడు. ఎవ్వరూ వీడికి ఋణం లేరు ఫో" అన్నది. బ్రాహ్మణులు దర్శించటానికి వస్తే వాళ్లకు ఆచారం ఎక్కువ, మలినం పోలేదు అని దూరంగా ఉండి దండం పెట్టమనేది.

"వీడు అనేది రాముడే" అని అద్వైత భావనలో అనేది. డబ్బు బంగారం లాంటివాటిని ముట్టుకొనేది కాదు. వాటిని "రోత" అనేది. వాటిని దానధర్మాలు చేసి బాగుపడమని చెప్పేది. ఆమెకు తెలీకుండా వ్రేలికి బంగారు ఉంగరం ఒకడు తొడిగితే మురికి కాల్వలోకి విసిరేసింది. ఒకడు వెండి గ్లాసును కొంగుకు కట్టితే వాడి గొడ్ల సావిడి అంటుకుంది. ఆమెను పరీక్షించాలనుకొన్న వారి ముఖాలు వెలవెలబోయాయి. ఆమె మాటల్లో "అడవి" అంటే అజ్ఞానం. ఒకసారి మళయాళ స్వాములతో "ఒరేయ్ నీకు చొక్కా వుందిరోయ్" అన్నది. అంటే ఇంకో జన్మ ఎత్తాల్సి ఉంది అని అర్ధం. ఆమె పాముల్ని దూడలు అనేది. ఒకసారి భక్తుడు ఒకడు పామును కర్రతో కొడితే అమ్మకు దెబ్బలు తగిలినంత బాధపడింది. దాన్ని చేతిలోకి తీసుకొని "నువ్వు మనిషివౌతావు" అన్నది. ఆ పాము ఆమె ఒడిలోనే కన్ను మూసింది. పదేళ్లు తనతో సహవాసం చేసిన కుక్క చనిపోతుంటే "మానవ లోకం వదిలిపోతున్నావా. పో. మనిషిగానే పుట్టావులే" అంది. "ఎద్దల్లె తిని మొద్దల్లె తిరిగితే దేవుడు కనిపించడు" అనేది. ఆడవాళ్ళను "ఒసెయ్ ముండలారా! మాయ మగాణ్ణి చూసి మిడిసిపోకండి. కమ్మని మగడు ఇక్కడ ఎలా రమిస్తున్నాడో చూడండే" అని తన భ్రుకుటి మధ్యలో వేలు పెట్టుకొని సమాధిలోకి పోయిందొకసారి.

### తీర్థయాత్రలు-మహాత్ముల దర్శనం

భద్రాచలం, తిరుపతి, శ్రీశైలం, కాశీ, ప్రయాగ వంటి పుణ్యక్షేత్రాలన్నీ వల్లభనేని అన్నపూర్ణ, పిన్నమనేని నాగయ్యల మొదలైన భక్త బృందంతో సందర్శించింది. దక్షిణేశ్వరంలో "శ్రీరామకృష్ణ పరమహంస దేవిలో ఇమిడిపోయాడు. దేవి పరమ హంసలో ఇమిడిపోయింది. పరమ హంసకు చావుపుట్టుకలు లేవు" అని అద్భుత భాష్యం చెప్పింది. శ్రీరమణాశ్రమానికి వెళ్లి సరాసరి రమణ మహర్షి కూర్చునే ఆసనంపై కూర్చుంటే రమణులు ఆమె ప్రక్కన ఆసీనులయ్యారు. అమాంతంగా మహర్షిపై వాలిపోయింది. లేచి "ఎప్పుడూ అంత దూరం ఏమి చూస్తున్నావు?" అని ఆయన్ను అడిగింది. ఆయన భావ గర్భితంగా "నువ్వు చూస్తున్నదే నేనూ చూస్తున్నాను" అన్నారు.

తిరుమలకు వెళ్లి అర్చకులు చూస్తుండగానే గర్భగుడిలోకి వెళ్లి "ఏరా వెంకన్నా! ఇక్కడున్నావా?" అని పసిపిల్లాణ్ణి పలకరించినట్లు పలకరించింది. 1936 శ్రీ మళయాళ

స్వాములు కురుమద్దాలి ఆశ్రమానికి అమ్మను దర్శించటానికి వస్తే ఆయనకు ఎదురు వెళ్లి కౌగిలించుకొన్నది. 1924లో గాంధి మహాత్ముడు బందరు వస్తే స్వామి సీతారాం అమ్మను వెంటబెట్టుకొని గాంధి గారికి దర్శనం కల్గించారు. మహాత్మున్ని ఆలింగనం చేసుకొని అరటిపండు బోసినవ్వుల తాత నోటికందించి "ఒరేయ్! లోక సేవ బాగా చేస్తున్నావు. ఇంకా బాగా చెయ్యి" అంది. పెనుమత్స యోగిని, లలితానంద సరస్వతి ప్రణవానంద స్వామి వంటి వాళ్ళు వచ్చి అమ్మతో తత్వగోష్టి చేసేవారు. గుడిపాటి వెంకటచలం, ఆయన కూతురు పదమూడేళ్ళ సౌరీస్‌తో వచ్చి చాలాసార్లు అమ్మ దర్శనం చేసుకొన్నారు. ఆ అనుభవాలను చలం, చింతా దీక్షితులు గారికి రాశారు. ఆంధ్ర ప్రదేశ్ మొదటి ఆస్థాన కవి శ్రీ పాద కృష్ణమూర్తి శాస్త్రి, ఉన్నవ లక్ష్మీనారాయణ, కాటూరి వెంకటేశ్వరరావు, త్రిపురనేని గోపీచంద్, వేలూరి శివరామశాస్త్రి వంటి కవి పండితులెందరో అమ్మ దర్శనంతో పులకరించిపోయారు.

1938లో వేలూరి శివరామశాస్త్రిగారు ఆంధ్రపత్రికలో అమ్మను గురించి అనేక వ్యాసాలు రాశారు. మహాభక్త విజయం గ్రంధకర్త పంగులూరి వీరరాఘవుడు అమ్మ సమాధి నుండి లేచే సమయానికి వెడితే లేచి వచ్చి కౌగిలించుకొని "నీకు ఆకలవుతోంది" అని లడ్డు చేతిలో పెడితే "నువ్వు మాల దానివి. నేను బ్రాహ్మణ్ణి" అంటే ఆమె "ఒర్! బత్తికి కులం ఉందట్రా" అన్నది. ఆయన మహా సంతోషంగా కళ్ళకద్దుకొని తిన్నాడు. ఆమె ఇచ్చిన మంచినీళ్ళు అమృతంగా తాగాడు.

శ్రీ లలితానంద సరస్వతి స్వామి ఆహ్వానిస్తే ఆయన నిర్వహించిన రుద్ర యాగానికి వెళ్లి సన్మానం పొందింది. గాలిలాగా తేలికైె కొండెక్కి నాగసర్ప రూపంలో సుబ్రహ్మణ్యేశ్వరుణ్ణి సందర్శించి వచ్చింది. పిన్నమనేని వీరయ్య చౌదరికి రైస్ మిల్లు కట్టుకోవటానికి ప్రభుత్వం అనుమతిని ఇవ్వకపోతే, వాళ్లకు నచ్చచెప్పి ఇప్పించింది.

1951 జనవరిలో భక్తులతో "ఈ మఠం తగలబడిపోతోంది ఒరేయ్ వంటవాడు పైకి ఎక్కుతున్నాడు. ఇక వంట తయారు కాదు" అని నర్మగర్భంగా పలికింది. 15-1-1951 ఖరనామ సంవత్సర పుష్య శుద్ధ అష్టమి నాడు రాత్రి ఒంటి గంటకు తనువు చాలిస్తున్నట్లు తెలిసింది. ఎవరేమి పెట్టినా తిన్నది. రామనామం చేస్తూ, చేయిస్తూ సరిగ్గా రాత్రి ఒంటిగంటకు అమ్మ భ్రూ మధ్యమం నుండి గొప్ప వెలుగు వెలువడి ఆశ్రమం అంతా ప్రకాశింపజేసింది. అమ్మ పునరావృత్తి రహిత శాశ్వత బ్రహ్మలోకం చేరింది. శాస్త్రోక్తంగా ఆమె దేహాన్ని నిక్షేపం చేశారు. ఆమె ఆజ్ఞ ప్రకారం దేవీ రూపంలో ఉన్న నల్లరాతి విగ్రహాన్ని అమ్మ సమాధిపై ప్రతిష్టించారు. తరువాత ఇంకో తెల్లరాతి విగ్రహ ప్రతిష్ట చేశారు. రోజు ఈ విగ్రహాలకు అర్చన జరుగుతుంది. ఖమ్మం జిల్లా బూర్గం పహాడ్‌లో కూడా పిచ్చమ్మ అవధూత ఆశ్రమం ఉంది.

ఈ విధంగా కృష్ణాజిల్లాలో దగ్గర దగ్గరలోనే పిచ్చమ్మ, పెన్మత్స యోగిని వెలసి భక్తుల కోర్కెలు తీరుస్తున్నారు.❀





# బాలా త్రిపుర సుందరీ మంత్ర మహాయోగి-
# శ్రీ తాడేపల్లి రాఘవ నారాయణ శాస్త్రి

"నాకోసం మీరు కంచికి ఇంత దూరం రావలసిన పనిలేదు. చందోలులో లలితా త్రిపుర సుందరీ ఉపాసకులు తాడేపల్లి రాఘవ నారాయణ శాస్త్రి గారున్నారు కదా! ప్రతి గురువారం వారిని దర్శించండి" అని కంచి కామకోటి పీఠ పరమాచార్యులు శ్రీశ్రీశ్రీ చంద్రశేఖర యతీంద్రులవారు చెప్పారు అంటే శాస్త్రిగారి యోగ సిద్ధి మహిమ ఎంతటిదో మనకు అర్థమవుతుంది.

గుంటూరు జిల్లా చంద వోలు తాడేపల్లి వెంకటప్పయ్య శాస్త్రి, హనుమమ్మ దంపతులకు శాస్త్రిగారు 1896 ఆగస్ట్ ఇరవై అయిదున జన్మించారు. నిష్ఠా గరిష్ట కుటుంబం వారిది. చందవోలు శాస్త్రిగారని అందరు పిలుస్తారు. తాడికొండ వాసి కేదార లింగంగారు "బాలా త్రిపుర సుందరి మంత్రాన్ని" వీరికి ఇచ్చారు. పదహారో సంవత్సరం దాకా ఆ మంత్రోపాసన చేసినందువల్ల అమ్మవారు వీరికి పిలిస్తే పలికేది. దెందుకూరి పానకాల శాస్త్రి వద్ద తర్కం, పొదిలి సీతారామ శాస్త్రి వద్ద మంత్రం నేర్చారు. యవ్వనంలోనే సన్యసించాలి అనే కోరిక కలిగింది. శ్యామలాంబ అనే యోగిని వీరి తండ్రిగారితో శాస్త్రిగారు సూర్య మండలాన్తర్వర్తి అయిన మహాసిద్ధుడు. ఈ రూపంలో జన్మించాడని చెప్పింది. శాస్త్రిగారికి చిన్నతనంలోనే పినతల్లి చూపించిన ఒక దృశ్యం గోచరించింది. అందులో తాను ఒక సిద్ధుడు శ్రీ చక్రేశ్వరి అయిన కామేశ్వరి దూరంగా ఉన్న యువతుల్ని తీసుకు రమ్మన్నది. ఒకరిని మోసుకొని ఇద్దర్నీ తీసుకొచ్చాడు. అమ్మవారు చిరునవ్వుతో అతని మనసు కొంచెం చలించింది అని భూలోకంలో జన్మించమని తాను మోసుకొచ్చిన అమ్మాయే భార్య అవుతుందని అన్నది. 19వ ఏట అద్దేపల్లి మంగమ్మ. పాపయ్య శాస్త్రిల కూతురు పార్వతితో వివాహమైంది. పిన్ని చూపించింది కూడా ఈమెనే. ఆమె పేరును శ్రీదేవిగా శాస్త్రిగారు మార్చారు.

**పాండిత్య ప్రకర్ష**

శాస్త్రిగారు తండ్రిగారి వేద పాఠశాల నిర్వహణలో తోడు పడుతూ ఉన్నారు. ఆయన పద్ధతి నచ్చిన చాలామంది అమెరికాకు రమ్మన్నారు. వారికి ఇష్టంలేదు. పిసపాటి వీరభద్రయ్యతో నేత్రావధానం, ఏలేశ్వరపు పురుషోత్తమ శాస్త్రితో కవిత్వ సాధన చేశారు. అప్పటికే అనేక సభలవారు శాస్త్రిగారికి 400కు పైగా సర్టిఫికేట్స్ ఇచ్చారు. వ్యాకరణ గురువుగారు ముదిగొండ నాగలింగ శాస్త్రిగారితో అనేక అవధానాలు చేసి, ఆ డబ్బు

అంతా గురువుగారికే సమర్పించారు. పుష్పగిరి పీఠాధిపతులు శ్రీచంద్రశేఖర భారతీ స్వామి సన్నిధిలో జరిగిన అష్టావధానానికి వారు మెచ్చి ఉభయ శ్లేషకు లక్ష్యంగా ఒక శ్లోకం చెప్పమంటే ఆశువుగా అద్భుతంగా చెప్పి ఒప్పించారు.

**అమ్మవారి సాక్షాత్కారం**

దేశ సంచారం చేస్తూ ఒకసారి ఇంటికి వస్తే ఇల్లు "అయ్యవారి నట్టిల్లు"లా ఉంది. ఇంటి వద్దే ఉండి తండ్రికి తోడ్పడ్డారు. తిండికి గడవని పరిస్థితి. మూడు రోజులు అంతా ఉపవాసమే. మూడవ రోజు రాత్రి 27సార్లు లలితా సహస్ర నామ పూజ చేసి నైవేద్యం పెట్టిన జలాన్ని త్రాగి అంగోస్త్రం నేలమీద పరచి నిద్రపోయారు. 10ఏళ్ళ బాలిక కలలో కన్పించి "ఒరే! ముష్టి పెడతాను. కొంగు పట్టు" అన్నది. దోసెడు బియ్యం కొంగులో పోసి, "బండి వస్తుంది. అందులో కావలసిన సామగ్రి అంతా వస్తుంది" అన్నది. తెల్లారే సరికి ఖాజీ పాలెం సీతారామరాజుగారి బండి వచ్చింది. అక్కడ రాజుగారు కోరిక మీదట పురాణం చెప్పి రాత్రి ఇంటికి వచ్చేసరికి తలుపు దగ్గర రాజుగారు పోయించిన పుట్టెడు ధాన్యపు రాశి కన్పించింది. అప్పటి నుంచి శాస్త్రిగారింట లక్ష్మీ దేవి నిత్య సాక్షాత్కారమే.

అనేక గ్రామాలలో భాగవతం, హరివంశం, పురాణం చెబుతూ రాత్రికి ఇంటికి చేరేవారు. పరమ నిష్టా గరిష్టంగా జీవించేవారు. ప్రాణాయామం, తపస్సు కొనసాగించారు. ఇంట్లో వేరుసెనగ నూనె, వేరుసెనగ వాడ లేదు. దొండకాయ, టమోటా, బంగాళాదుంప, ముల్లంగి, కాబేజీ, నిషేధం. కాశీకి తప్ప ఎప్పుడు రైలు ప్రయాణం చేయలేదు. శాస్త్రిగారికి మగ సంతానం లేదు. కూతురు లక్ష్మిని చెరువు సత్యనారాయణ శాస్త్రికిచ్చి వివాహం చేశారు. ఆయనే శాస్త్రిగారి జీవిత చరిత్ర రాశారు.

**అష్టసిద్ధులు కైవశం**

శాస్త్రిగారికి అష్టసిద్ధులు వశమైనాయి. వాటిని స్వంతానికి ఎప్పుడూ వాడుకోలేదు. తాడికొండ వేద పాఠశాలలో దెయ్యాలు తిరిగి ఇబ్బంది పెడుతుంటే శాస్త్రిగారు మంత్రం పఠించి పార ద్రోలారు. ఒకసారి "వశ్యంకర ఔషధి"ని సేకరించాలని చంద్ర గ్రహణం రోజున కొండ ఎక్కి దాన్ని గుర్తుపట్టి తీసుకొందామని దగ్గరకు వెళ్తే ఒక బాలుడు అడ్డుకొన్నాడు. బలవంతాన లాక్కోబోతే "నీకు ఈ మొక్కతో పనిలేదు. నీ ముఖం చూస్తేనే అందరు వశులౌతారు" అన్నాడు. ఇంతలో గ్రహణం వదిలింది. బాలుడు మాయమయ్యాడు. తనకు దాన్ని పొందే యోగం లేదని భావించారు. అది దత్తాత్రేయ స్వామి అధిపతిగా ఉన్న ఔషధి. పూర్వజన్మ సఖుడైన ఒక యోగి కన్పించి సుఖ దు:ఖాలను సమానంగా భావించాలని చెప్పి మళ్ళీ 50 ఏళ్ళకు కనిపిస్తానని చెప్పి వెళ్లాడు. సరిగ్గా యాభై ఏళ్ళ తరువాత శాస్త్రిగారు అమరావతి వెళ్లి అమరేశ్వర స్వామిని దర్శించి తమ గదిలో ప్రాణాయామం చేస్తూ చాలా పైకి లేచి తలక్రిందులుగా పడిపోతుంటే తల నేలకు తగిలే సమయాన ఆ యోగి వచ్చి చేయి అడ్డం పెట్టి కాపాడాడు. శాస్త్రిగారు



నమస్కరించగానే యోగి అదృస్యుడైనాడు.

తండ్రిగారు మొదలుపెట్టిన "శ్రీరామ కథామృతం"ను వారి మరణానంతరం శాస్త్రిగారు పూర్తి చేస్తున్నారు. అయోధ్యా కాండంలో గాయత్రీ మంత్రంలోని "భకార" వర్ణంతో పద్యం రావటం లేదు. అమ్మను ఉపాసించి నిద్రపోయారు. కలలో ఒక బీబీ జగన్మోహిని నిద్రిస్తుండగా 30 ఏళ్ళ గడ్డం వాడొకడు ఆమె చొక్కా పైకెత్తి పాలు తాగుతున్నాడు. శాస్త్రిగారు ఆ దృశ్యం చూస్తుంటే "ఎందుకు నిలబడ్డావు?" అని అడిగింది. "నాకూ పాలు ఇస్తావా?" అని అడిగారు. మెలకువ వచ్చి "భర్మ మయ రమ్య హర్మ్యము" అనే భవర్ణంతో పద్యం తేలిగ్గా వచ్చింది.

ఒకసారి పుస్తక ముద్రణ కోసం చందాలకు తిరుగుతూ వుంటే సత్తెనపల్లిలో ఒక బ్రాహ్మణుల ఇంట్లోకి ఇరవైయేళ్ళ యువతి కనిపించి, నమస్కరించి లోపలికి వెళ్ళింది. ఆమె గ్రహపీడితురాలు. అందర్నీ కొడుతూ, తిడుతూ ఉండేది. అలాంటిది శాస్త్రిగారిని చూడగానే అత్యంత వినయాన్ని ప్రదర్శించటం ఇంట్లో వారందరికి ఆశ్చర్యం కలిగింది. ఆమెను గ్రహ ప్రేరణ చేసి "ఏం చేస్తే నువ్వు పోతావు?" అని అడిగారు. "సహస్ర గాయత్రీ జపఫలం ధారపోస్తే పోతాను" అంది. శాస్త్రిగారు సహస్ర గాయత్రి జపం చేసి ధారపోశారు. ఇంటి ముందున్న వేపచెట్టు కొమ్మ విరిగి పడింది. దెయ్యం వదిలింది. వేరొకసారి నాగుల చవితి రోజు కాలవలో స్నానం చేసి వస్తుంటే నాగలి చాలులో పడుకొన్న నాగుపాము తోకపై ఆయన కాలు పడింది. అది బుసలు కొడుతూ పైకి లేచి కాటు వేయబూనితే "గరుడ మంత్రం" జపించారు. సర్పం తల నేలకు వాల్చింది. "స్వామీ! నీ జోలికి నేను రాలేదు. నా జోలికి నువ్వు రావద్దు. పొరపాటున కాలు తగిలింది. వెళ్లిపొండి" అనగానే పాము వెళ్లిపోయింది. ఆ రోజంతా గరుడ మంత్రం పఠిస్తూనే ఉన్నారు.

శాస్త్రిగారు 90 ఏళ్ళ జీవితకాలంలో 80 ఏళ్ళు "బాలా మంత్రానుష్టానం" చేసిన మహనీయులు. ఒకసారి కాశీలో గంగా స్నానం చేస్తుంటే గంగాదేవి గలగలలాడే బంగారు గాజులున్న చెయ్యి చూపించి "నాకేమి కానుక తెచ్చావు?" అని అడిగింది. శాస్త్రిగారికి ఏమీ పాలుపోక తన వ్రేలికున్న బంగారు దర్భ ఉంగరం తీసి ఆమె చేతిలో పెట్టారు. బసకు తిరిగి వచ్చి దేవతార్చన పెట్టె తెరిస్తే గంగకు అర్పించిన ఉంగరం అందులోనే ఉంది. తానేమైనా పొరబడి దర్భ ఉంగరం ఇవ్వలేదా అని సందేహించి ధ్యాన నిమగ్నమయ్యారు. గంగమ్మ కనిపించి "కానుక ఇమ్మంటే దర్భ ఉంగరం ఇచ్చావేరా?" అన్నది. "అది నీకు పితృ తర్పణం చెయ్యటానికి ఉపయోగ పడుతుంది కాని నాకు ఆభరణం ఎలా అవుతుంది?" అని గద్దించింది. "అమ్మా నేనేమీ నీ కోసం తేలేదు. ఆ సమయానికి అది స్ఫురించి ఇచ్చానంతే." అన్నారు. మళ్ళీ గంగమ్మ "నీ భార్య దగ్గర నాకోసం తెచ్చిన నగ ఉంది అది తెచ్చివ్వు" అన్నది గంగ. శాస్త్రిగారు భార్యను అడిగి నగను తీసుకొని పోయి "గంగార్పణం" చేశారు.

ఆయన తన కార్యక్రమాలన్నీ ముగించుకొని వాకిలి అరుగుమీద కూర్చుంటే వందలాది మంది వచ్చి తమకు ముహూర్తం పెట్టమనో, పేరు పెట్టమనో అడిగేవారు. కాసేపు కళ్ళు మూసుకొని ముహూర్త నిర్ణయం చేసేవారు. అంతే. ఆ కార్యక్రమం శుభప్రదంగా జరిగిపోయేది. దానికి తిరుగులేదు. అదీ వారి మంత్రసిద్ధి.

దాదాపు ముప్పై ఏళ్ళ క్రితం కాంచి పరమాచార్యులు ఉయ్యూరు కే.సి.పి. వారి ఆహ్వానం, గురజాడలోని చల్లాశర్మగారు ఏర్పాటు చేసిన కార్యక్రమంలో వారం రోజులున్నారు. అప్పుడు రాఘవశాస్త్రిగారు ఇక్కడే ఉన్నారు అన్ని రోజులు. అప్పుడు వారిని చూశాను. జగద్గురువులను వీరినీ ఒకేసారి చూసే భాగ్యం కలిగింది. అప్పుడే "నడయాడే దైవం" అని పరమాచార్య మీద పుస్తకం ఆవిష్కరణ జరిగినట్లు జ్ఞాపకం. 10-12-1990 ప్రమోదూత మార్గశిర బహుళ నవమినాడు శాస్త్రిగారు బాలా త్రిపుర సుందరి అమ్మవారి ఒడిలోకి శాశ్వతంగా చేరిపోయారు. వారి పార్థివ దేహానికి అగ్ని సంస్కారం చేస్తున్నప్పుడు అమ్మవారి ఆకారంగా చితి మంటలు ఆకాశానికి లేవటం ఎందరో చూసి పరమాద్భుతంగా వర్ణించారు. శాస్త్రిగారు కారణ జన్ములు. వారి పేరు వింటే చాలు సకల శుభాలు జరుగుతాయి.❀





# త్రికాల జ్ఞాన యోగి-ప్రకాశానంద స్వామి

ఈ కాలంలో భాగస్వామిగా ఉంటూ, కోరికలు లేకుండా ముక్తులై బ్రహ్మాన్ని పొందేవారు చాలా అరుదుగా ఉంటారు అలాంటి అరుదైన త్రికాలవేదే అనంతయ్య అనే సామాన్యుడు బ్రహ్మ ప్రకాశాన్ని పొంది ప్రకాశానందులైనారు.

విజయనగరం ప్రాంతంలో గౌరమ్మ, అనంత రామయ్యల కుమారుడే అనంతయ్య. 1871లో జన్మించాడు. ఎనిమిదవ ఏట, తండ్రి, పందొమ్మిదవ ఏట తల్లి చనిపోయిన దురదృష్టవంతుడు. తాతగారి పెంపకంలో ఉపనయనం జరిగింది. పదిహేనవ ఏట బడి చదువులు వదిలి సంస్కృతం, జ్యోతిషం నేర్చాడు. పెళ్లి చేద్దామని తాత, మామ్మ ప్రయత్నాలు చేసి యోగ్యురాలిని చూసి తాంబూలాలు పుచ్చుకొన్నారు. కాని ఆ పిల్ల పెళ్ళికాక ముందే చనిపోయింది. ఇంగ్లీష్ బోధించిన దత్తయ్య పంతులు మంచి వేదాంతి. తగిన గురువు వెతుక్కొంటూ వస్తాడని శిష్యుడికి చెప్పాడు. అత్యంత మిత్రుడొకడు సైన్యంలో సుబేదార్. అతని భార్య అందాల సౌందర్య రాసి. ఆమె పిల్లను ప్రసవించి చనిపోయింది. స్నేహితునితో స్మశానానికి వెళ్ళిన అనంతయ్య ఆ అందం భస్మం అవటంతో తీవ్ర వైరాగ్యం చెందాడు.

## గురు అన్వేషణ

1887లో అంటే పదహారేళ్ళ వయసులో ఇల్లు వదలి బెల్గాం చేరాడు. అక్కడ లల్లూభాయ్ గోవర్ధన్ దాస అనే ఉపదేశకునితో పరిచయం కలిగింది. ఆయన గుజరాతే వైశ్యుడు. ఈయన వద్ద యోగ వాశిష్టం మొదలైన వేదాంత గ్రంథాలు చదివారు. ఆయన అనుమతితో తీర్థ యాత్రలు చేస్తూ తిరుమల చేరి, పుష్కరిణిలో స్నానంచేసి, ప్రేష మంత్రం చెప్పుకొని, శిఖా, యజ్ఞోపవీతాలను తీసి వేశాడు. అక్కడే బుచ్చయ్యపంతులు దగ్గర ఉపనిషత్ భాష్యం అధ్యయనం చేశాడు. నాసిక్ వగైరాలు తిరిగి నాసిక్ చూసి హరిద్వారం వెళ్లి అమరేశానందుల వద్ద సిద్ధాంత కౌముది, వ్యాకరణ మహా భాష్యం నేర్చాడు. గురువుగారు అనంతయ్యలోని జ్ఞాన ప్రకాశాన్ని గుర్తించి "ప్రకాశానంద స్వామి" అనే ఆశ్రమ నామం పెట్టాడు.

ప్రకాశానంద స్వామి ఋషీకేశం వెళ్లి సుఖానందస్వామి వద్ద హఠ యోగం నేర్చాడు. గుజరాత్‌లోని నడియాద్ చేరి జానకి దాస వద్ద వృత్తి ప్రభాకరం, మొదలైన వన్నీ నేర్చారు. లల్లూభాయ్‌ని తరచూ సేవిస్తూ పదిహేనేళ్ళు గడిపారు. ఆయన మరణం తరువాత మాధుకర వృత్తి చేస్తూ దొరికినదాన్ని తింటూ కాలక్షేపం చేశారు. ఎందరో శ్రీమంతులు ఆశ్రమాలు నిర్మించి ఇస్తామన్నా, ధనం కురిపిస్తామన్నా తిరస్కరించారు. స్మశానం లేక పాడుబడ్డ దేవాలయమే ఆయన నివాసం. సర్వసంగ పరిత్యాగిగా ఉంటూ వేలాది జనానికి జ్ఞానభిక్ష పెట్టారు. ఒక చినిగిన బొంత, ఒక మట్టి పిడత, నల్లని

దుస్తులు ఆయన ఆస్తులు. అందుకే జనం ఆయన్ను బొంత ముంత స్వామి (గోదాదియా స్వామి) అనేవారు.

### త్రికాలజ్ఞుని మహిమలు

ఒకసారి భావనగర కాలేజి సంస్కృత ప్రొఫెసర్ సందర్శించినపుడు "మీ ఇంటి నుంచి ఉత్తరం ఏదైనా వచ్చిందా?" అని అడిగారు. రాలేదని చెప్పాడాయన. అంతా కులాసానేనా? అని స్వామి అడిగితే అంతా క్షేమమేనని ఆయన చెప్పాడు. తాను రెండు రోజుల్లో ప్రొఫెసర్‌గారి ఊరు నడియాద్ వెళ్తున్నానని, వాళ్లింటికీ వెళ్లి వస్తానని చెప్పారు. స్వామి అక్కడికి వెళ్ళేసరికి ప్రొఫెసర్‌గారి ఆరునెలల పసివాడు మసూచికంతో బాధపడుతున్నాడు. "శరీరం అశాశ్వతం. మోహం వద్దు" అని ఆ పిల్లాడి తల్లికి చెప్పి రెండు రోజుల తర్వాతా వస్తానని చెప్పి స్వామి వెళ్లిపోయారు. మళ్ళీ వచ్చి చూస్తే పిల్లాడు చనిపోయాడు. ఆ స్వామి త్రికాల వేది అని అందరు గుర్తించారు. ప్రొఫెసర్‌గారికి ఒక శివరాత్రి రోజు స్వామి తపస్సులో ఉండగా నొసట త్రిశూలం కనిపించింది. ద్వారకలో విశ్వనాథ నందీశ్వరుల మందిరం దగ్గర గదిలో ఓంకారాన్ని స్వామి జపిస్తుంటే ఫాల భాగాన ఓంకారం దర్శనమిచ్చేది.

స్వామి సర్వమత సమభావంగా ఉండేవారు. స్వార్థం వదిలి సమాజసేవ చేయమని ధనవంతులకు నచ్చజెప్పేవారు. ఒకసారి "మోరబీ మహారాజు"కు ప్రాణాపాయమైన జబ్బు చేసింది. స్వామి వచ్చి ఆశీర్వదించారు. ఆరు మాసాలు మోరాబీలో ఉండి రాజు జబ్బు తగ్గిన తర్వాత వెళ్ళబోతుంటే రాజు లక్ష రూపాయలు ఇచ్చి ధర్మ కార్యాలకు ఉపయోగించమని కోరాడు. దాన్ని తృణ ప్రాయంగా భావించి పంటలు నష్టపోయి ప్రజలు బాధపడుతున్నారని పన్నులు తీసేయ్యమని కోరారు. వెంటనే 20 లక్షల ఆదాయం వచ్చే ఆ ఏడాది పన్నులను రైతులు ఇవ్వక్కర లేదని శాసనం చేశాడు రాజు. పిల్లలంటే మహా ఇష్టం తాతా(దాదా) అని ఆయన్ను పిలిచేవారు. గుజరాతు, సౌరాష్ట్రలలో అనేకమంది సాధు సంతులను దర్శించి, వేదాంత గోష్టి జరిపారు. అహ్మదాబాద్ సరయు దాస, కచ్చ నివాసి నారాయణ దాస, చరోతార్ వాసి జానకీ దాస, పీతియా నివాసి నిత్యానంద స్వాములు మహా త్యాగ పురుషులుగా పేరు పొందారు. ఆ నలుగురితోపాటు మన స్వామికి ఎక్కడా ఆశ్రమాలు లేవు.

నిత్యానందులు 24 లక్షల గాయత్రి మంత్రం చేసిన ధన్యులు రాజకోట దగ్గర బాణ గంగా నదీ తీరంలో నివాసం ఉంటున్నారు. ప్రకాశానందులు వీరిని దర్శించి వేదాంత గోష్టి జరిపారు. ప్రకాశానందుల సమక్షంలో నిత్యానందులు 1934లో శివైక్యం చెందారు. బ్రహ్మ విద్యా రహస్యాన్ని తెలియజేసే "వార్తాలాపం"ను స్వామి గొప్ప గ్రంథంగా రాశారు. 1032 పేజీల బృహత్ గ్రంథం. 1965 నాటికే ఎనిమిది ముద్రణలు పొంది విశేషంగా ఖ్యాతి పొందింది. వీరి శిష్యురాలు "శిరోహి రాజ మాత" ఆంధ్రులకు కూడా స్వామివారి అమృతవాణి చేరాలని రాజమండ్రి నుండి హిందీ, తెలుగు, సంస్కృతం తెలిసిన ఆంధ్ర పండితుణ్ణి గుజరాత్‌కు రప్పించి నాలుగు నెలలు సకల సౌకర్యాలు



కలుగజేసి అనువాదం చేయించి ఆ బృహత్ గ్రంథాన్ని ప్రచురింపజేశారు. జిజ్ఞాసులకు, ముక్షులకు ఉచితంగా ఆ గ్రంథాన్ని అందజేశారు. స్వామి అనంత గురు పరిచయం, అపనో ధర్మ, ధర్మ జ్యోతి, సప్త శ్లోక గీత గుజరాతీలో రాశారు. ఆయన అముద్రిత సాహిత్యం చాలా ఉంది. స్వామి తెలుగు లిపిలోనే తెలుగు, గుజరాతీ భాషలు రాసేవారట. అదీ వారి ప్రత్యేకత. వార్తాలాపంలో ఎన్నో వేదాంత విషయాలు సులభ బోధకంగా రాశారు.

ప్రకాశానంద స్వామి నిత్యానంద స్వామిని "బుద్ధభవానుని"తో పోల్చేవారు. నిత్యానందులే ఒకసారి స్వహస్తాలతో ప్రకాశానంద స్వామికి పాద్యం ఇచ్చారు. అంతటి అన్యోన్యం వారిద్దరిది. ఇంత మంది శిష్యులుండగా మీకెందుకు ఈ శ్రమ అని అడిగితే "శ్రీకృష్ణుడికి రుక్మిణి సపర్యలు చేసిందని, దాసీలు కాదని" చెప్పారు. ఒకసారి చేతిలో డబ్బులు లేక గురు దర్శనానికి వెళ్ళలేక గురువుగారినే వచ్చి కటాక్షించమని కోరి జాబు రాస్తే నిత్యానందులు వైద్యునితో సహా వెళ్లి ఆయనకు ఆరోగ్యం కలిగించారు.

### మహాప్రస్థానం

ఒకసారి స్వామి నారాయణ పరమహంసను చూడటానికి వెళ్లారు. ఆయనకు పంచ శిఖలుండటం చేత గుర్తు పట్టలేదు. మౌనంలో ఉన్న పరమహంస గుర్తు పట్టి "రెండు కర్రలెందుకు?" అని మౌనంగానే స్వామిని ప్రశ్నించారు. "నాకు ఇంకా అద్వైత సిద్ధి కలగలేదు" అన్నారు. పరమహంస ఆయన దగ్గరున్న రెండు కర్రల్లో ఒక దాన్ని తాను తీసేసుకొన్నారు. "ఇప్పుడు అద్వైతం కుదిరిందా?" అని ప్రశ్నించారు. ఆరోజు నుండి స్వామి ఒకే కర్రతో ఉంటున్నారు. ప్రకాశానందులు ద్వారకలో దేహ త్యాగం చేయ నిర్ణయించి అక్కడికి చేరారు. అప్పటికి వారి వయస్సు 92. తనకు ఆతిథ్యమిచ్చిన గృహస్తు కొడుకుకు నామకరణం చేయమని కోరితే తన పేరే పెట్టి ఆనంద్ ప్రకాశ్ అని పిలుచుకోమన్నారు. 22-2-1962న జబ్బు చేసింది. అందరికి వార్త వెళ్ళింది. కాషాయ వస్త్రాలు తెప్పించి కట్టుకొన్నారు. బాగైనట్లనిపించి చాలామంది వెళ్లిపోయారు. మధ్యాహ్నం స్వామి అందర్ని చూసి నవ్వారు. అందరు నవ్వారు. స్వామి చిటిక వేసి "చలో" అన్నారు. అప్పుడు సమయం మధ్యాహ్నం 12-20 ద్వారకాదీశుడైన కృష్ణ దేవాలయంలో కోటి రూపాయలకు పైన విలువ చేసే శ్రీకృష్ణుని కిరీట, కుండలాలు హఠాత్తుగా జారి పడిపోయాయి. అంతా ఏదో విపరీతం జరుగుతుంది అనుకొన్నారు. స్వామి "చలో" మన్నప్పుడే ఇది జరిగిందని తెలుసుకొన్నారు. అదే సమయంలో స్వామి అనంత వాయువుల్లో తమ శ్వాశను కలిపారు. వారు భౌతికంగా లేకపోయినా వారి సమాధి భక్త జనానికి జ్ఞాన ప్రకాశాన్ని నిరంతరం అందిస్తూనే ఉంది. ఎక్కడో పుట్టి, ఎక్కడో పెరిగి, ఎక్కడో ఆధ్యాత్మిక గురువులై, ద్వారకలో సిద్ధి పొందిన స్వామి ఆశ్రమం లేకుండానే లక్షలాది మందికి జ్ఞానబోధ చేసి అతి సాధారణంగా జీవించి మిగిలిన వారిలో తానూ ఒక్కరిగా మిగిలిపోయారు. ❁

# ఆంధ్ర యోగినీ సామ్రాజ్ఞి-తరిగొండ వేంగమాంబ

బ్రహ్మానుభవం పొందటంతోపాటు అనేక కృతులను రచించిన రచయిత్రిగా తరిగొండ వేంగమాంబ యోగినుల్లో మహాయోగిని అయింది.

చిత్తూరు జిల్లా వాయల్పాడుకు రెండు కిలోమీటర్ల దూరంలో ఉన్న తరిగొండ శ్రీలక్ష్మీ నరసింహ క్షేత్రం. కర్నూలు జిల్లా కానాల నుండి ఈమె వంశీకులు ఇక్కడికి వచ్చి స్థిరపడ్డారు. కానాల క్రిష్ణయ్య, మంగమ్మ దంపతులకు 1750లో శ్రీ వెంకటేశ్వరస్వామి కరుణ వల్ల వేంగమాంబ జన్మించింది. స్వామి పేరే పెట్టారు. కన్నవారితో పాటు పూజలో పాల్గొనేది. ఈడుతో పాటు భక్తీ పెరిగింది. పరవశించి పాడుతూ నామ సంకీర్తన చేసేది. తగిన భర్త కోసం వెతుకుతుంటే లౌకిక వివాహం వద్దన్నా, ఆమెను ఇంజేటి తిమ్మయ్య కొడుకు వెంకటాచలపతితో వివాహం జరిపించారు. అయినా ఆమె భక్తి సాధన మానలేదు. శోభన గృహంలో భర్తకు తన శరీరం, మనసు వెంకటేశునికే అంకితం కనుక శరీర సుఖం కోరవద్దని చెప్పింది. అతడు స్వగ్రామం వెళ్లిపోయాడు. మనోవేదనతో చనిపోయాడు. ఆమెలో మార్పులేదు. సంఘాన్ని ఎదిర్చి నిలబడింది. రూపావతారం సుబ్రహ్మణ్యశాస్త్రిని బ్రహ్మోపదేశం చేయమని కోరింది.

ఆయన అంగీకరించి సోమేశ్వర స్వామి సన్నిధిలో వేదాంతం బోధించాడు. గురువును త్రిమూర్తి స్వరూపుడిగా కొలిచింది. మంత్రోపదేశం చేసి వేదశాస్త్ర రహస్యాలూ నేర్పాడు. తీవ్ర సాధన చేసి జ్ఞానాన్ని పరిపక్వం చేసుకొన్నది. తరిగొండకు వచ్చి, నరసింహ దేవాలయంలో విగ్రహం చాటున యోగ సమాధిలో ఉండేది. ఇది ఎవరికి తెలీదు. ఇంటికి వచ్చి భక్తి కవితా రచనలు చేసేది. అందులో మొదటిది "తరిగొండ లక్ష్మీనరసింహ శతకం". అది ఆ స్వామికే అంకితమిచ్చింది. శివ విలాస యక్షగానాన్ని రాయచోటి వీరభద్రస్వామికి అంకితం చేసింది. ఆమెను అందరు ఎగతాళి చేసేవారు. యోగంతోపాటు కవిత్వమూ పరిపక్వమైంది. "రాజయోగామృత సారం" అనే తాత్విక ద్విపద కావ్యం రాసి, నరసింహస్వామికి, బాల కృష్ణ నాటక యక్షగానాన్ని వాసుదేవ పరబ్రహ్మకు అంకితమిచ్చింది.

వేంగమాంబ వైరాగ్యం బ్రాహ్మణులకు నచ్చలేదు. ఆమెకు వైధవ్యం కల్పించాలని, తల గొరగాలని ఆంక్ష పెట్టారు. మంగలి వచ్చి నిలబడితే పులిని చూసినట్లు భయపడి పారిపోయాడు. మిగతావారు పరుగులంకిన్చుకొన్నారు. పుష్పగిరి పీఠాధిపతి విద్యా నృసింహ స్వామి దేవాలయంలో విడిది చేసి వెంగమ్మను రమ్మని కబురు చేశారు. ఆమెను చూడరాదని తెర కట్టించారు. ఆమెను తల గొరిగించుకోమన్నారు. ఆమె పరపురుషుడైన మంగలిని తాను తాకటం ధర్మమా అనీ, కేశాలు తీయిస్తే, పాతివ్రత్యం నిలుస్తుందని యే శాస్త్రంలో ఉందో చెప్పమని సవాలు చేసింది. ఆమె సమాధానాలు స్వాములకు కోపం తెప్పించాయి. తమకు ఎందుకు నమస్కరించ లేదో చెప్పమన్నారు. సింహాసనం దిగి పక్కకు వస్తే నమస్కరిస్తాను అంది. ఆమె చెప్పిన దానిలో ఏదో రహస్యం ఉందని భావించి తెర తీయించి, సింహాసనం దిగి పక్కన నిలబడ్డారు. ఆమె లక్ష్మీ నృసింహ స్వామిని ధ్యానిస్తూ రెండు చేతులు జోడించి నమస్కరించింది. వెంటనే సింహాసనం భగ్గున మండిపోయింది. స్వాములు వెంగమ్మ ప్రహ్లాదుని అవతారం అని ప్రకటించి, బ్రాహ్మణులను మందలించి వెళ్లిపోయారు. ఆమె మూలంగా తమ జీవితం అవమానాల పాలైందని ఇంటి నుండి తరిమేశారు.

మళ్ళీ ఆలయం చేరి తపస్సు తీవ్రం చేసింది. ఆంజనేయస్వామి సన్నిధిలో తీవ్ర మగ్న అయింది. ఒకసారి వెంకటేశ్వరస్వామి ప్రత్యక్షమై తిరుమలకు రమ్మని కోరారు. తిరుమల చేరి, భక్తితో ఆవేశంతో స్వామిని స్తుతించింది. ఆనాటి మహంతు ఆమెకు తూర్పు మాడ వీధిలో ఒక పూరిల్లు నివాసానికి ఏర్పరచి పాకశాల నుండి వకుళమాలిక పేరుతో సంబారాలు పంపించేవాడు. ఆమె స్వయంపాకం చేసుకొని, వెంకన్నకు నివేదించి తినేది. ఆమె భక్తిని గుర్తించి అన్నమాచార్యుల వారి వంశీకులు ఉత్తర మాడ వీధిలో తమ ఇంటికి ప్రక్కమిద్దె ఇల్లు ఇచ్చారు. అక్కడ తులసి వనం నుంచి మాలలు కట్టి స్వామికి కైంకర్యం చేసేది. "రమా పరిణయం" అనే ద్విపద కావ్యం పెళ్లిపాటగా రాసినది. ఇలా చేయటం అక్కా రామయ్య దీక్షితులు అనే పొరుగాయనకు ఇష్టం లేదు. ఆమె ధ్యానంలో ఉండగా ఎంగిలి విస్తళ్ళు ఆమెపై విసిరేశాడు. "నీ వంశం నిర్వీర్యమవుతుంది" అని శపించింది. చాలామంది పుట్టి చనిపోయారు. బుద్ధి వచ్చి ఆమె కాళ్ళమీద పడితే ఇక నుంచి నీ కుటుంబంలో ఒక్కడే ఒక్కడు పుడతాడని శాపాపన్ని మరల్చింది.

స్వామి మందిరానికి ఉత్తరాన తుంబురు కోనలో తపస్సు చేసింది. బ్రహ్మచర్యం, ప్రాణాయామం తపస్సు చేసేవారే అక్కడ ఉండగల రమణీయ ప్రదేశం అది. ఆ సమయంలోనే "చెంచు నాటకం" యక్షగానం రాసింది. ఈమెను వెదికి వేసారి ఇక్కడ చూసి మళ్ళీ ఇంటికి తీసుకువెళ్లారు. పూటతోట వేసింది. బావి తవ్విస్తే నీళ్ళు పడలేదు. బావిలోకి దిగి గంగను కీర్తించింది. పుష్కలంగా నీరు పడింది. వెంకటేశ్వర స్వామికి రోజు ఏకాంత సేవలో "కర్పూర హారతి" ఆమె ఇవ్వటం అలవాటు. ఇది పూజారులకు నచ్చక ఈసడించుకొనేవారు. గుడికి వెళ్లి హారతి ఇవ్వకుండా ఇంట్లోనే ఇచ్చేది. ఒక రథోత్సవం రోజు రథం వచ్చి వెంగమ్మ ఇంటి ముందు ఆగిపోయింది. ఎంత లాగినా కదలలేదు. అర్చకులు వెంగమ్మను క్షమాభిక్ష వేడారు. ఆమెను హారతి ఇవ్వమన్నారు. ఆమె హారతి ఇవ్వగానే రథం కదిలింది. అదే ఇప్పుడు "తరిగొండ వారి ముత్యాల హారతి" అయింది.

ఆమెకు నరసింహ స్వామికి, వెంకన్నకు భేదం లేదు. నృసింహ ఉత్సవాలు

ప్రతి ఏటా జరిపేది. అన్నదానం నిర్వహించేది. అనేకులు భూరి విరాళాలు ఇచ్చేవారు. ఎనిమిది మంది వ్రాయసగాళ్ళను పెట్టుకొని "ద్విపద భాగవతం" రచించింది. వేంకటాచల మహాత్మ్యాన్ని చంపూ కావ్యంగా రాసింది. 18వ శతాబ్ద ఉత్తర భాగం 19వ శతాబ్ద పూర్వ భాగం ఆమె దివ్య సారస్వతాధి దేవతగా వెలుగొందింది. 3-8-1817న ఆ ఆధ్యాత్మ తేజోరాసి శ్రీ వెంకటేశ్వర స్వామి పాదారవిన్దాల్లో ఒక పూరేకు అయిపోయింది. ఆమె రోజు ధ్యాన సమాధిలో కూర్చునే చోట సమాధి నిర్మించారు. దాని మధ్య తులసి వనం, మండపం కట్టారు. సమాధికి ఎదురుగా నేరేడు చెట్టు కింద గూటిలో ఆంజనేయ స్వామిని ప్రతిష్టించారు. అన్నమయ్య, హథీరాం బాబా, వెంగమాంబ తిరుమలేశునితో అభేదంగా జీవించిన పుణ్య మూర్తులు.❁





# అపర పతంజలి యోగి-మాస్టర్ సి.వి.వి

క్రీ.పూ. మూడవ శతాబ్దిలో పతంజలి మహర్షి రాసిన యోగసూత్రాలను, ఆధునిక జగత్తుకు అనుకూలంగా మార్చి, మేడం బ్లావస్కీ సిద్ధాంతాలను జోడించి "భుక్త రహిత తారక రాజ యోగం" పేరుతో తయారు చేసి, వారు మాస్టర్ సి.వి.వి. అని మంత్ర నామాన్ని పొందిన వారు కంచుపాటి వెంకట వేంకా స్వామిరావుగారు.

విజయనగర సామ్రాజ్య కాలంలో ఆంధ్ర దేశం నుంచి అరవ దేశానికి ఎన్నో కుటుంబాలు వలస పోయాయి. అందులో కుంభకోణం దగ్గర అమ్మార్ సత్రం అనే ఊరిలో 19 శతాబ్దంలో వెళ్ళిన కామమ్మ, కుప్పస్వామి దంపతులు ఉన్నారు. ఆయనకు సుబ్బమ్మ, ధర్మాంబ అనే ఇద్దరు తోబుట్టువులు, సుబ్బమ్మకు కుంభకోణం మునసబు, భూస్వామి అయిన కంచుపాటి ధర్మారావు కొడుకు వెంకట్రావుకు, ధర్మాంబను తన బావమరిదికి ఇచ్చి వివాహం చేశాడు. రంగారావు భార్య అమ్మణమ్మ మహా పతివ్రత. కోడలు సుబ్బమ్మను కన్న కూతురులాగా చూసింది. సుబ్బమ్మకు అన్నా, వదినలంటే ప్రాణం. కామమ్మకు కుంభకోణంలో 4-8-1868న మన మాస్టర్ జన్మించారు. వేంకా స్వామి అని పేరు పెట్టారు. రంగారావు దేశాంతరం పోయి తిరిగి రాలేదు. సంసార బాధ్యత కొడుకు మీద పడింది. వేంకా స్వామి తలిదండ్రుల వద్ద పెరిగాడు. కుప్పుస్వామి వేంకా స్వామికి ఉపనయనం చేశాడు. వెంకట్రావు చనిపోయాడు. సుబ్బమ్మకు సంతానం లేదు. ఆమెకు ఈ పిల్లాణ్ణి దత్తత ఇచ్చారు కామమ్మ, కుప్పుస్వామి దంపతులు. కనుక అతను ఇప్పుడు కంచుపాటి దత్త తండ్రి వెంకట్రావు వేంకాస్వామి తాత పేరు రావు కలిసి కంచుపాటి వెంకట వేంకాస్వామి రావు అయాడు. ఆయనే సి.వి.వి.

సుబ్బమ్మ శ్రీమంతురాలు. మగ దిక్కు లేనిది. కనుక దగ్గరుంటే మంచిదని కుప్పుస్వామి దంపతులు కుంభకోణం కాపురం మార్చి చెల్లెలి ఇంటికి దగ్గర ఇంట్లో ఉన్నాడు. వేంకా స్వామి వీధి బడిలో తెలుగు, తమిళం, సంస్కృతం ఇంట్లో సుబ్బమ్మ వద్ద సంస్కృతం నేర్చాడు. వెంకట్రావు చెల్లెలి కూతురు రుక్మిణమ్మనిచ్చి వేంకా స్వామికి పెళ్లి చేశారు. ఆయన పద్నాలుగో ఏట మెట్రిక్ మొదటి వాడుగా పాస్ అయిడు. శ్రీరంగంలో చేరాడు. శ్రీరంగం, పుదుక్కోట జమీందార్ల పిల్లలు సహాధ్యాయులైనారు. ఇంటర్ అయింది. డిగ్రీకి మద్రాస్ పంపటం తల్లికి ఇష్టం లేనందున ఇంటి వద్దే ఆధ్యాత్మిక గ్రంథాలు చదివాడు.

### యోగ ప్రవేశం

అప్పుడు మెద్రాస్‌లో దివ్య జ్ఞాన మహాసభలు జరిగాయి. మిత్రులతో కలిసి వెంకాస్వామి వెళ్లాడు. ఎందరెందరో మహానుభావులు వచ్చారు. మేడం బ్లావేస్కీతో

పరిచయం అయింది. ఆమెతో కలిసి యోగసాధన చేశారు. నిష్ఠ కుదిరింది. స్వామి మునిసి పాలిటి అధ్యక్షులైనారు. యోగంలో బ్లావేస్కీ దర్శనమిచ్చేవారు. రైల్వే కాంట్రాక్టులు తీసుకొని నష్టపోయి ఆస్తి అమ్మేయాల్సి వచిచంది. భార్య మరణించింది. మద్దూరు వారమ్మాయి వెంకమ్మను ద్వితీయం చేసుకొన్నారు. పురోహితుని స్వామి నిజంగానే అరుంధతీ నక్షత్రం చూపించారు. కొత్త భార్య ఆయన యోగసిద్ధికి, ఉన్నతికి బాగా సహకరించింది. బ్లవేస్కీయే వెంకమ్మగా జన్మించిందని భావిస్తారు.

స్థూల, సూక్ష్మ శరీరాలపై వ్యూహాలపై ఆధిపత్యం సాధించారు. ఆయన ప్రజ్ఞా భావం ముందుగా భార్య మీద పడింది. ఆమె ప్రజ్ఞను వదిలించి ఆమెతో వివిధ కోశాలలోని విజ్ఞాన విషయాలను పలికించి రాయించారు. 1908లో వచ్చిన హేలీస్ తోకచుక్కను తన శరీరంలోకి ఆవాహన చేసుకొన్నారు. దానితో శక్తి విపరీతంగా చేరింది. సృష్టి క్రమం తెలుసుకొన్నారు. జన్మించటానికి ముందు మనుషులు అణురూపంలో పురుషునిలో ప్రవేశించి వ్యాపించి మూడు నెలల తర్వాత స్త్రీ గర్భంలో ప్రవేశిస్తారు. స్వామిగారు తనలో జరుగుతున్న అండోత్పత్తిని స్థూల ప్రజ్ఞా చెడనీకుండా, సూక్ష్మ రూపాన్ని వేరు చేసి నవగ్రహాల ప్రభావం తగలకుండా ఆ అండాన్ని వెంకమ్మగారి గర్భంలో ప్రవేశ పెట్టారు. ప్రతిరోజు ప్రార్థన సమయంలో ఆమె స్థూల శరీరం నుండి సూక్ష్మ శరీరాన్ని వేరు చేస్తూ, ఆమె గర్భంలోని పిండానికి కుండలినీ ప్రభావంతో శక్తిని అందించేవారు. తొమ్మిది నెలల తర్వాత 13-4-1999న బ్రహ్మ స్వరూపుడైన కొడుకు పుట్టాడు. అతనికి "చందు" అని పేరు పెట్టారు.

చందు భిన్నంగా ప్రవర్తించాడు. ఒక నెలకే మాటలొచ్చాయి. ఇంటికి వచ్చేవారి భూత భవిష్యత్తులను చెప్పేవాడు. నాస్తికుడై జందాలు తెంపుకొన్న తాత కుప్పుస్వామిని నాలుగు నెలల చందు జందెం వేసి సంధ్యా వందనం చేయించాడు. పదో నెలలో తండ్రికి 'ఎమ్.టి.ఏ' అనే కొత్త మంత్రాన్ని నేర్పి వారానికొక కొత్త మంత్రాన్ని నేర్పించాడు. లోకానికి కొత్త వెలుగు ప్రసాదించమని చెప్పి చనిపోయాడు. అతన్ని స్వామి 24 సార్లు బ్రతికించారు. బంధువులు ఒకావిడను మీడియం చేసి ప్రాణధార తెప్పించి బ్రతికించారు. కాని చందు తను భూమి మీద ఉంటే సృష్టి ఆగిపోతుందని తండ్రికి నచ్చచెప్పి చనిపోయాడు.

ఈ రకమైన సాధన ద్వారా తనను పిలిచిన వారికందరికీ అందుబాటులో ఉండే సి.వి.వి.మంత్రం 29-5-1910ను నేర్పారు. ముందు కుటుంబ సభ్యులకు నేర్పి పరీక్షించి తరవాత మిగిలిన వారికి అందించారు. అప్పటినుండే మాస్టర్ సి.వి.వి.గా ప్రసిద్ధులయ్యారు.

### మహిమల ప్రదర్శన

ఒకసారి మాస్టర్‌గారు ముక్కులోని రంధ్రం ద్వారా ఆరు గంటలు నిర్విరామంగా గాలి పీల్చి, రెండో రంధ్రం ద్వారా ఆరు గంటల సేపు వదిలారు. మరో ఆరు గంటలు ఉచ్ఛ్వాస, నిశ్వాసాలు లేకుండా ఉన్నారు. వారి శరీరం దూదిలాగా తేలికై గాలిలో



తేలింది. తన మనుమడు మట్టిబొమ్మ తిని చనిపోతే సమాధి స్థితిలో ఉండి ప్రాణ సప్లై చేసి బ్రతికించారు. ఆయన్ను దత్తత తీసుకొన్న సుబ్బమ్మగారు ఏటిలో స్నానం చేసి ఒడ్డుకు వచ్చి కళ్ళు తిరిగి పడిపోతే మూడు, రోజులు ఆమెను చూస్తూ ఉండమని ఊరికి వెళ్లి, అక్కడినుంచే ఆమెను బ్రతికించారు.

మనుష్యులను ట్రాన్స్ లోకి పంపి విషయాలను సేకరించే వారు. గ్రహ మండలాలలో ప్రవేశించి అనుభూతులను గ్రంధస్తం చేశారు. చంద్రమండలం విస్తరించి పది మైళ్ళు వెనిక్కి ఎడుతుందని చెప్పారు. ఆరు నెలల తర్వాత సైంటిస్టులు నిజమేనని రుజువు చేశారు. భూమి వంకరగా ఉందని అందుకని సూర్యుని వెలుగు చంద్రునిపై సరిగ్గా పడటం లేదని అందుకే కృష్ణ పక్షం వస్తోందని, వంకరపోతే ఎన్నుడూ పౌర్ణమి నాటి చంద్రుడే కనిపిస్తాడని చెప్పారు. ఖగోళ శాస్త్రవేత్తల పరిశోధనలో భూమి రెండు వందల మైళ్ళు వంకరగా ఉన్నట్లు తేలింది. అంతటి సూక్ష్మ పరిశీలన మాస్టరుగారిది.

### భ్రుక్త రహిత తారక రాజయోగం

మాస్టర్‌గారు స్థాపించిన కొత్త యోగ పద్ధతిని "భ్రుక్త రహిత తారక రాజయోగం" అంటారు. భ్రుక్తం అంటే పూర్వకర్మ. రహితం అంటే లేకుండా చేయటం. అంటే తమ దగ్గరకు వచ్చి శరణు కోరితే పూర్వకర్మలన్నీ పోయి తరిస్తారు అని అర్థం. ఆయన్ను తలిస్తే చాలు అన్నీ ఆయనే చూసుకొంటారనే నమ్మకం. మాస్టరుగారి శిష్యపరంపరలో ఎక్కి రాజు కృష్ణమాచార్యులు వేటూరి ప్రభాకర శాస్త్రి మొదలైన ప్రముఖులు ఎందరో ఉన్నారు. మాస్టరుగారు 12-5-1922న శరీరాన్ని వదిలేశారు. కొడుకు అంత్యక్రియలు నిర్వహించగా అకాల వర్షాలవల్ల వారి చితా భస్మం అంతా కావేరి నది నీటిలో కొట్టుకుపోయి ఏమీ మిగలలేదు. 22-5-1922న అంటే పదిరోజుల తర్వాత మాస్టరుగారి సూక్ష్మ శరీరం భార్య వెంకమ్మకు దర్శనమైంది.❁

సిద్ధ యోగి పుంగవులు-21

# అవతార పురుషుడు మెహర్ బాబా మెహర్‌వాణి

భౌతికతో ఊగిపోతున్న మానవ జాతిని ఆధ్యాత్మిక వైపుకు జీసెస్ మరల్చినట్లు, నేను మానవాళిని ఉద్ధరించటానికి వచ్చాను. అలాంటి పనికి కాలము సమయము కలిసివచ్చి నప్పుడే మహా పురుషులు మానవాళిని ఉద్ధరించటానికి సంభవిస్తారు. వారే అవతార పురుషులు బుద్ధుడు, మహమ్మద్ జొరాస్టర్ అందరు అలాంటి వారే వీరందరూ ఒకే భగవంతుని నుండి వచ్చినవారే. అది ఒక బంగారు దారం. శారీరక ఆనందం ముఖ్యమైన సమయంలో మతానికి మనుగడ తగ్గినప్పుడు, ధనంపై వ్యామోహం పెరిగినప్పుడు భగవంతుడు స్వయంగా వీరి ఆవిర్భావానికి దారి చూపిస్తాడు. ఈ పరంపరలో నేనూ ఒక అవతార పురుషుడినే. మత సంస్థలు పాత బాణీలోనే నడిచి ప్రజల ఆలోచనలను పట్టించుకోవటం లేదు. ప్రవక్తుల ఉపదేశ సారం ఒకటే. మానవాళిని సంక్షోభం నుంచి బయటపడెయ్యటమే. నేనేమీ కొత్తమతాన్ని స్తాపించటం లేదు. ప్రజలందరి మత భావాలను పునరుద్ధరించి వాటికి కొత్త రూపు నివ్వటమే నా ధ్యేయం. జీవితన్ని గురించి వారికి అవగాహన కల్గిస్తాను. ప్రవక్తల మరణం తర్వాత వారి భావనలు పక్క దారి పడుతున్నాయి. అసలు చెప్పినదానికి, ఆచరించే దానికి సంబంధం లేకుండా పోయింది. ప్రవక్తలందరూ భగవంతుని నుండి వచ్చినవారే. కనుక వారు చెప్పేదంతా ఒకటిగానే ఉంటుంది. సంకుచిత భావాలను దూరం చేస్తాను. అసలు సత్యాలను ఆవిష్కరిస్తాను. నా మౌనాన్ని త్వరలోనే వదిలి జనం ముందుకు వచ్చి నా మనోభావాలను నా నోటితో తెలియజేస్తాను. దానికి తగిన సమయం ఇంకా రాలేదు. వచ్చినప్పుడు నేనే తెలియజేస్తాను. "తర్వలోనే విశ్వవాప్త ఆధ్యాత్మికతను నేను ప్రచారం చేస్తాను. ఇది అన్ని దేశాలవారికి, అన్ని మతాలవారికి అన్ని జాతుల వారికి సంబంధించిందిగా ఉంటుంది. భవిష్యత్తుపై నాకు అపార నమ్మకం ఉంది. పాశ్చాత్య దేశాలలో యుద్ధ భయం ఉంది. అది తగ్గాలి. నేను ఎప్పుడు మౌనాన్ని వీడుతానో నేను ముందుగా చెప్పలేను. త్వరలో జరిగే ప్రపంచ యుద్ధం జరగబోతోంది. అది చాలా ప్రమాదం. నా భావవ్యాప్తిని ఒక ఉద్యమంగా చేస్తాను. ఈ భూమిలో శాంతిని స్తాపించటానికి నేనే చేబట్టే ఉద్యమం దోహదం చేస్తుంది. నేను ఒక అవతార పురుషుడినిగా అవతరించబోతున్నాను. యుద్ధం తర్వాత అపూర్వ శాంతి ఏర్పడుతుంది. నిరాయుధీ కరణ ఒక సమస్యగా ఉండదు. జాతిభేదాలు సమసిపోతాయి. మత సంస్థల మధ్య విభేదాలు ఉండవు. నేను ప్రపంచం అంతటా పర్యటిస్తాను. ప్రతి గ్రామం, పట్టణం, నగరం సందర్శిస్తాను. అంతర్జాతీయ సోదర భావాన్ని, మనుష్యుల మధ్య శాంతిని, బీదుల యెడ, నిర్లక్షానికి గురి అయిన వారిపట్ల ప్రేమను కురిపిస్తాను. భగవంతుని



ప్రేమను అందరికి అందజేయుటయే నా ముఖ్య ధ్యేయం."

"భారతదేశం ప్రపంచ దేశాలలో ముఖ్యపాత్ర వహిస్తుంది. అనేక లోపాలున్న భారతదేశం ఆధ్యాత్మిక భావ లహరిని వ్యాప్తి చేయటంలో ఎప్పుడూ ముందు ఉంది. నైతిక నాయకత్వం భారతదేశం వల్లనే సాధ్యం. ప్రపంచానికి ఆధ్యాత్మిక జ్యోతిని ఇవ్వగలిగేది మనమే. నాకు అతీత శక్తులు చాలా ఉన్నా వాటిని అనవసరంగా వృధా చేయను. అవి మానవులకు ఉపయోగపడుతాయి అన్నప్పుడే వాటిని వాడతాను. నన్ను నేను ఆవిష్కరించుకొన్న రోజున నన్ను అడ్డగించే శక్తి ఏదీ ఉండదు. గుడ్డివారికి చూపును, కుంటివారికి నడకను, ఇవ్వగలను ముసలితనాన్ని దూరం చేయగలను. మరణించినవారిని పునర్జీవులను చేస్తాను. ఇవన్నీ నిజంగా జిమ్మిక్కులే. వీటితో నమ్మకం రావచ్చు కాని మనసు కుదుటబడదు." "నాకు పన్నెండు మంది శిష్య పరంపర ఉంది. ఇది ఒక వలయం. నా తర్వాత వీరిలో ఒకర్ని నా స్థానంలో ప్రతిష్టిస్తాను. వారి కోసమే నేను నిరాహార దీక్ష, మౌనం పాటిస్తున్నాను. వారంతా నా పూర్వజన్మలో సహచరులే. వారిని నేను ఆదుకోవాలి. వీరికి బయటి వలయంలో 44మంది ఉన్నారు. అందులో ఆడవారు మగవారూ కూడా ఉన్నారు. అయితే పైవారి కంటే వీరి స్తాయి తక్కువ. వీరందరి ద్వారా కావలసిన పనులన్నీ జరిపిస్తాను. నా గురువు "ఉపాసని మహారాజ్" నాకు ఆధ్యాత్మిక భావన కలిగించిన వారు "హజరత్ బాబా జన్" అనే సుమారు వందేళ్ళున్న ముస్లిం మహిళా ఫకీర్". ఇదీ అవతార్ మెహర్ బాబాగారి వాణి, బాణీ. ఇదంతా ఆయన్ను ఇంగ్లండ్‌కు చెందిన పత్రికా విలేఖరి భారతీయ ఆధ్యాత్మిక రహస్యాలను తెలుసుకోవటానికి భారతదేశం అంతటా పర్యటించిన Paul Brunton ఇంటర్వ్యూ చేసినప్పుడు మౌనంగా ఉన్న బాబా తన వద్ద ఉన్న అక్షర మాల సహాయంతో రాసి చెప్పిన విషయాలు.❁

# నడయాడే దైవం పరమాచార్య జగద్గురువులు
# శ్రీశ్రీ చంద్రశేఖర యతీంద్రులు

## పరమాచార్య పథం

'**పొ**ట్టి మనిషి. కషాయాంబర దారి. నెత్తిన కూడా కప్పుకొన్న వస్త్రం. బలహీనమైన శరీరం. చేతిలో దండం. నలభై ఏళ్ళను దాటిన వయసు. తెల్లబడిన జుట్టు. కళ్ళు నల్లగా కాంతివంతం. భావ గంభీరమైన నుదురు. కమనీయమైన కనులలో అలౌకిక కాంతి. కోటేరు తీసిన ముక్కు. బిరుసు గడ్డం. చిన్న నుదురు. నోరు విశాలం. కూర్చున్న భంగిమలో పరమ మేధావిత్వం. కలలు కాక ఏదో లోకంలో విహరిస్తున్నట్లున్న కనులు." ఇదీ Paul Brunton దర్శించిన కంచి పరమాచార్య జగద్గురువులు శ్రీశ్రీ చంద్రశేఖర యతీంద్రుల వారి దివ్య స్వరూపం. వారు ఆంగ్లాన్ని చక్కగా అర్థం చేసుకోగలిగి మాట్లాడగలిగినా తమిళం ఆంగ్లము తెలిసిన మధ్యవర్తి చేత అనువాదవం చేయించి సందేశమిచ్చారు. "ప్రపంచ పరిస్థితులు ఎప్పుడు చక్కబడతాయి?" అని అడిగిన ప్రశ్నకు "మార్పు రావటానికి చాలా సమయం పడుతుంది. అదొక క్రమ పద్ధతిలో రావాలి. ఆయుధాలను విసర్జించి, దేశాలు శాంతి కోసం ప్రయత్నించాలి" అని సమాధానం. "ఆ దిశలో దేశాలు కొంత ప్రయత్నిస్తున్నాయి." అని అంటే "ఆయుధాలు విసర్జించినంత మాత్రానే శాంతి రాదు, యుద్ధం ఆగదు. కొట్టుకోవటానికి కర్రలు చాలు. దీనికి పరిష్కారం ఆధ్యాత్మిక భావవ్యాప్తి మాత్రమే. అది దేశాల మధ్య, మనుషుల మధ్య, బీద ధనికుల మధ్య పరి వ్యాప్తమైతేనే కుదురుతుంది. సుహృద్భావం పెరగాలి. అప్పుడే నిజమైన శాంతి, అభ్యుదయం కలుగుతాయి. "అయితే అది చాలా దూరం చాలా కాలం పడుతుందేమో" అని సందేహించాడు పాల్. దానికి స్వామి "ఇంకా దేవుడున్నాడు" అన్నారు. "దేవుడెక్కడో లేడు దేవుడంటే ప్రేమ స్వరూపం. జీవుల మీద ప్రేమే దైవం." అని సమాధానం "దేవుడు మానవ పరికరాలను అవసరం వచ్చినప్పుడు వాడుతాడు. మానవాళి, సంక్షోభాన్ని ఎదుర్కొన్నప్పుడు ఏదో రూపంలో వచ్చి పరిష్కరిస్తాడు. ప్రతి శతాబ్దంలోను దివ్య విభూతి కలిగిన మహాత్ములు జన్మించి, మానవాళిని ఉద్ధరించారు. ఈ విధానం అంతా భౌతిక శాస్త్ర నియమాలుగా పని చస్తుంది. భౌతికత పెరిగి, ఆధ్యాత్మికకు జనం దూరమైన ప్రతిసారీ ఇలా జరుగుతూనే ఉండటం అందరికి తెలిసిన విషయమే. పాల్ "మన కాలంలో కూడా అలాంటి మహాత్ముడు జన్మిస్తాడా?" అని అడిగితే "మా దేశంలో ఇది తప్పక జరుగుతుంది, జరిగింది. భౌతికత అనే చీకటి



విస్తరించి జ్ఞాన జ్యోతి మినుకు మినుకు మన్నప్పుడల్లా ఇలా జరగటం మాకు సహజమే. వారినే మేము దైవాంత సంభూతులు అంటాం" అన్నారు ఆచార్యులు.

"మనుష్యులు బాగా పతనమైపోయారా" అన్న ప్రశ్నకు "అంతగా నాకు అనిపించటం లేదు. మనిషిలో దివ్యత్వం జాగృతం అవ్వాలి. అప్పుడే మనిషి దేవుని వైపుకు అడుగులేస్తాడు." బ్రంటన్ "మా పశ్చిమ దేశాల్లో దెయ్యాలలాగా మానవులు ప్రవర్తించటం బాధాకరంగా ఉంది" అంటే "అలా వేరు చేసి మాట్లాడవద్దు. అక్కడి దేశ రాజకీయ ఆర్థిక స్తితి గతులను మనం దృష్టిలో ఉంచుకోవాలి. పిడుక్కు, బియ్యానికి ఒకటే మంత్రం కాదు. సమాజాన్ని ఉన్నత స్తితికి తీసుకొని వెళ్ళాలి. భౌతికతను ఆదర్శం (ఐడియలిజం)తో సమానం చేయాలి. ప్రపంచం ఎదుర్కొనే క్లిష్ట పరిస్తితికి నిజమైన నివారణ అంటూ ఏదీ లేదు." అన్నారు. "అయితే నిత్య జీవితంలో ఆధ్యాత్మికతను జోడించాలా?" అని అడిగితే "ఖచ్చితంగా. సరైన ఫలితాలు రావాలి అంటే అదొక్కటే మార్గం. ప్రపంచంలో ఆ స్థాయి మనుష్యులు ఎక్కువైన కొద్దీ మార్పు వేగవంతమవుతుంది. మా అదృష్టవశాత్తు మా దేశంలో అలాంటి వారికి కొదవ లేదు. ఈ మార్పు ప్రపంచం అంతటా వస్తే మంచి రావటానికి స్వల్ప సమయం చాలు. పాల్ "తమరికి ఈ ఆశ్రమాధి కారం సంక్రమించి ఎంతకాలమైంది?" అని ప్రశ్నిస్తే 1907లో నేను పన్నెండేళ్ళ వయసులో ఉండగా లభించింది. నాకు ఆశ్రమాధి కారం వచ్చిన తర్వాత నాలుగేళ్లకు, నేను కావేరి నది ఒడ్డున ఒక గ్రామంలో తపస్సు చేసి, మూడేళ్ళు వేద వేదాంగ విద్యలన్ని నేర్చాను." అని చెప్పారు. "మీరు నిత్యం సంచారం చేస్తూనే ఉంటారా?" అన్నదానికి "1918లో నేపాల్‌లో జరిగే ఒక కార్యక్రమానికి నేపాల్ రాజు ఆహ్వానించారు. దానికి సమ్మతించి నేను అప్పటి నుండి దేశ సంచారం చేస్తూ ప్రతిగ్రామమూ తిరుగుతున్నాను. మా ఆశ్రమ ధర్మ ప్రకారం ప్రతి గ్రామము సందర్శించాలి. ప్రజల్ని ఆధ్యాత్మికత వైపు మరల్చే ప్రసంగాలు చేయాలి. మా ఆశ్రమ సంప్రదాయాలను పాటించాలి. నిత్యార్చన అవీ మాకు చాలా నియమాలుంటాయి." అని సమాధానమిచ్చారు.

"నాకు మార్గదర్శనం చేయగలిగిన యోగుల కోసం నేను భారత దేశమంతా పర్యటిస్తున్నాను. సరైన వారిని మీరు నాకు సూచించగలరా?" అని అడిగిన దానికి సమాధానంగా కంచి స్వామి "మీకు నిజంగా అలాంటి కోరిక ఉంటే అదేమీ అత్యాస కాదు. మీలోని నిజాయితీ తప్పక మీ కోరిక తీరుస్తుంది. ఇప్పుడే మీలో జాగృతి కలిగింది. అదే మీకు మార్గ దర్శనం చేస్తుంది. మీ సందేహాలన్నీ పటా పంచలవుతాయి. పాల్ మళ్ళీ "ఆ ఆలోచనే నాకు ఇప్పటి దాకా మార్గ దర్శకత్వం చేసింది. నేను ఏ మహానుభావుడిని కలిసినా 'దేవుడు వేరుగా లేడు నీలోనే ఉన్నాడు' అంటున్నారు. చూపించండి" అంటే నవ్వుతూ స్వామి "దేవుడు అంతటా ఉన్నాడు. మనిషిలో మాత్రమే ఉన్నాడని అక్కడే బంధించక్కరలేదు. ఈ విశ్వానికి అంతటికి ఆధారం ఆయనే కదా" అన్నారు. "అయితే స్వామీ! ఏ ప్రయోగాత్మక పద్ధతిని నేను అవలంబించాలి?" "మీ

యాత్రలో మీరు అన్వేషించుకొంటూ వెళ్ళండి. మీకు నచ్చిన వారిని ఎన్నుకొండి" అన్నారు. "వారిలో ఎవరూ నాకు సరైన మార్గదర్శనం చెయ్యలేకపోతే?" సందేహించాడు పాల్. "అలా అయితే మీరు ఒంటరిగా ప్రయాణం చేసి దైవ విభూతిని పొందే వరకు ఆ మార్గం వదలకండి ధ్యానం క్రమం తప్పకుండా చేస్తూ ఉండండి. ఉన్నత భావాలమీద ఆసక్తి, ప్రేమ పెంచుకోండి. మనసంతా ప్రేమతో నింపుకోండి. తెల్లవారుజామున, సాయంసంధ్యలో ధ్యానం సత్ఫలితాలనిస్తుంది. అప్పుడు ప్రపంచమంతా పరమ ప్రశాంతంగా ఉంటుంది. దీన్ని మాత్రం సాధన చేయటం మరవకండి" అని హితవు చెప్పారు. "స్వామీ! నా ప్రయత్నాలన్ని వ్యర్థమై, నా సాధన ఉపయోగ పడకపోతే మీరు నాకు మార్గ దర్శనం చేస్తారా?" అని సూటిగా ప్రశ్నించాడు బ్రంటన్ బ్లంట్‌గా. దీనికి సమాధానంగా పరమాచార్యులు "నేను ఒక సంస్థానానికి అధిపతిని. ఇక్కడ నా సమయం అంటూ ఏమీ ఉండదు. నా నిత్యకార్యక్రమాలతో నా సమయం అంతా వదిలి పెట్టరాదు. నేను ఎన్నో ఏళ్ళుగా రోజురాత్రిళ్ళు నిద్రపోయేది "మూడు గంటలే". అలాంటి పరిస్థితుల్లో నేను ఒక వ్యక్తిమీద శ్రద్ధ పెట్టటం జరిగేపని కాదు. మీరే మీకోసం సమయాన్ని పూర్తిగా కేటాయించే గురువును ఎన్నుకోండి" అని విస్పష్టంగా చెప్పారు. "బాధ గురువులే తప్ప బోధ గురువులు లేరు అని అంతా అంటున్నారు. అందులో నేను ఒక యూరోపియుడిని. నాకు బోధించే వారు దొరకరేమో?" అని సందేహం వెలిబుచ్చాడు. "సత్యం ఉంది. దాన్ని కనుగొనవచ్చు" అని సమాధానం. "మీరే ఒకరిద్దరి పేర్లను సూచించి నా అన్వేషణకు దగ్గరి దారి చూపించండి మహాత్మా" అని అంటే "నాకు తెలిసి ఇద్దరే మీకు గురువులు అనిపించుకోనదగిన సమర్థులు ఉన్నారు. అందులో ఒకాయన కాశీలో ఎక్కడో విశాలమైన భవంతిలో దాగి ఉంటారు. ఆయన దర్శనం అంత తేలిక కాదు. అదీ గాక వారు పాశ్చాత్యులకు ప్రవేశం కల్గిస్తారని నేను భావించటం లేదు" అన్నారు పాల్ మీద కృపా దృష్టితో. పట్టువదలని విక్రమార్కుడు పాల్. "రెండో వారు?" అని ప్రశ్నించాడు. "ఎక్కడో దక్షిణ భారతదేశంలో మారుమూల ఉన్నారు. ఆయన్ను "మహర్షి" అంటారు. నేను ఇంతవరకు వారిని చూడలేదు. కాని వారు ఉత్తమ దేశికులు అని తెలుసు. వారు మీకు చక్కని మార్గదర్శనం చేస్తారని నమ్మకం ఉంది. వారు అరుణాచల జ్యోతి స్వరూపమైన అరుణాచలంలో ఉంటారు. వారి దర్శనం మీకు మనో భీష్టం కల్గిస్తుంది." అని చెప్పగానే పాల్ పరమానంద భరితుడయ్యాడు. తన అన్వేషణ ఫలించే రోజు దగ్గరలో ఉందని సంబరపడ్డాడు. అరుణాచలం వెళ్లి రమణ మహర్షిని ఎప్పుడు సందర్శిద్దామా అనే తహతహ పెరిగిపోయింది. చివరగా ఒక మాట చెప్పారు శంకరులు "రమణ మహర్షిని దర్శించకుండా ఇండియా నుండి తిరిగి మీ దేశం వెళ్ళను అని నాకు మాట ఇవ్వండి" అన్నారు కృపా దృష్టితో. శ్రీవారిలోని ఆ కారుణ్యం, తన తపనను అర్థం చేసుకొన్నవారి మనోభావం చూసి పాల్ చలించిపోయాడు. "మీ మాట జవదాటను మహాత్మా!" అని మనస్ఫూర్తిగా చెప్పాడు. చివరి సారిగా శంకరులు "ఆదుర్దా పడకండి. మీరు సత్యాన్ని



కనుక్కొంటారు. మీరు వెతుకుతున్న వారు మీకు లభించి మీ కోరిక తీరుస్తారు" అని అభయం ఇస్తూ "మీరు నన్నెప్పుడూ గుర్తుంచుకోండి. నేనూ మిమ్మల్ని ఎప్పుడూ గుర్తుంచుకొంటాను" అని Paul the seekerకు వీడ్కోలు చెప్పారు పరమాచార్యులు. ఆయన దేశ సంచారాన్ని ఆది శంకరుల దేశ సంచారంతో సరిపోల్చాడు పాల్. ఒక ఆధ్యాత్మిక జ్యోతిని సందర్శించిన మహదానందంతో పాటు మరో అద్భుత మహర్షిని సందర్శించబోతున్న ఉద్వేగం పాల్‌ను కుదిపేస్తోంది. మహాత్ములు ఎంత ఉన్నతులో, ఎంత మార్గ దర్శనం చేస్తారో ఆధ్యాత్మికానుభూతి పొందాలనుకొనే వారంటే వారికి ఎంత అభిమానమో వ్యక్తమయ్యే సన్నివేశాలను ఇందులో మనం చూశాం. ఇదే పరమాచార్య పథం. ❁

## మౌనయోగి (the sage who never speaks)

ఒక చిన్న తాళాలు వేసిన గదిలో ఆయన ఒక్కరే పద్మాసనంలో కూర్చుని ఉన్నారు. గోచీ గుడ్డ తప్ప యే వస్త్రధారణా లేదు. అప్పటికే సమాధి స్తితిలో ఉన్నారు. భౌతిక విషయాలేమీ ఆయనకు తెలీవు. ఆయన చిరునవ్వులో ప్రపంచాన్ని జయిన్చానన్న భావం గోచరిస్తోంది. కళ్ళు తీక్షణంగా దేనినో వెతుకుతున్నాయన్నట్లుంది. అది అనిర్వచనీయ సమాధి. ఆయకే అనుభవైక వేద్యం. కళ్ళు ఆర్పటం లేదు. కను రెప్ప కూడా కదలటం లేదు. అలా రెండు గంటల నుండి ఉండిపోయారు. ఆయన మనసుకు ఇహ లోకజ్ఞానం ఉండదు. శరీరభాగాలన్ని నిద్రపోతాయి. వాటికి చలనం ఉండనే ఉండదు. అప్పుడప్పుడు కనుకొనల నుండి, ఒక నీటి బిందువు రాలుతోంది. దృష్టిని కేంద్రీకరించటం వల్ల కన్నీటి గ్రంధుల పని ఆగిపోయింది. ఒక కాంశ్య విగ్రహంలాగా అనిపిస్తున్నారు మౌనయోగి. ఆయన శ్వాస జరుగుతూనే ఉంది. అదీ చాలా నిదానంగా, ఎవ్వరికీ వినపడనంతగా ఉంది. కాని చాలా క్రమబద్ధంగా, లయగా శ్వాశిస్తున్నట్లు కనబడుతోంది. ఆయన ఈ శరీరాన్ని వదలలేదు అని చెప్పటానికి శ్వాస ఒక్కటే ఆధారం అనిపిస్తుంది. ఆయన గురించి బర్టన్ చాలా విన్నాడు, తెలుసుకొన్నాడు. అయినా అన్నీ సందేహాలే. మౌనయోగి వివరాలు ఆయన దగ్గర నిరంతరం ఉన్న అతన్ని అడిగాడు. అతను చెప్పటం ప్రారంభించాడు. స్వామి ఎప్పుడు వచ్చాడో, ఎక్కడి నుండి వచ్చాడో తెలీదు. ఇంతవరకు ఎవ్వరితోను మాట్లాడినట్లు గమనించలేదు. ఎవరి గురించీ ఆయనకు తెలీదు. ఎవరి గురించీ అడగరు. ఇక్కడికి వచ్చి ఎనిమిదేళ్ళు అయింది. అప్పుడప్పుడు కొబ్బరి చిప్పలో అన్నాన్ని అడిగి వేసింది తినేవాడు. రోడ్డుమీద ఒక చెట్టు కింద ఎత్తైన రాతి మీదే ఆయన జీవితం. ఎండా, వాన, చలి అంతా అక్కడే. ఆయన కూర్చునే విధానం ఎప్పుడూ మారలేదు. యువకులు ఆయన్ని హేళన చేస్తున్నా, వారినేమీ అనేవాడు కాదు. ఒకసారి మద్రాస్ వెళ్తున్న ఒక పెద్దమనిషి ఈ దృశ్యం చూశాడు. వెంటనే మద్రాస్ నుండి ఇక్కడి పోలీసులతో చెప్పి ఆ మౌన యోగికి రక్షణ కల్పించే ఏర్పాటు చేశాడు. పోలీసు వచ్చి ఆయన్ను ఎంతో అడిగితే కాని తన గురించి చెప్పలేదు. "నేను మారకాయర్ అనే గురువు శిష్యుడిని. ఆయన నన్ను దక్షిణ మద్రాస్‌కు వెళ్ళమని ఆదేశించారు. ఇక్కడ ఉండటానికి అనువుగా ఉందని చేరాను. నాకు ఇహ భోగాల మీద ఆసక్తేమీ లేదు. సత్య దర్శనం కోసమే జీవిస్తున్నాను" అని యోగి చెప్పాడు. మరకార్ అంటే ఆ మధ్యనే చనిపోయిన మహమ్మదీయ గురువు అని పోలీసాఫీసరు గ్రహించాడు. మద్రాస్‌లో ఆయన చాలా మందికి తెలుసు. ఒక బంగ్లాలో బస ఏర్పాటు



చేస్తానంటే వద్దన్నాడు. అప్పుడు ఇప్పుడున్న గదిలో ఉంచి తనను సేవకునిగా నియమించారని మౌన యోగి దగ్గరుండే సేవకుడు చెప్పాడు. యోగికి ఒక్కడంటే ఒక్క శిష్యుడు కూడా లేడు. ఏకాంతంగా ఆత్మ ముక్తి కోసమే ఆయన ఉంటున్నారని చెప్పాడు.

సంచార యోగి మరిన్ని వివరాలు చెప్పాడు. ఇక్కడికి రావటానికి ముందు మౌనయోగి సైన్యంలో సిపాయిగా పనిచేశాడు. తర్వాత మారకాయర్ శిష్యుడైనాడు. మౌనయోగి నుండి తనకు ఏదో "టేలిపతిక్" కరెంటు ఆవేశించినట్లుగా పాల్ బ్రంటన్ అభిప్రాయ పడ్డాడు. ఆయన తన దృష్టిని ఆలోచనల కన్నా లోతుగా కేంద్రీకరించటం వల్ల ఆయన చేతన అంతా విశ్రాంతి స్థితిలోకి వెళ్ళింది. ఇదే ప్రపంచం కంటే ప్రేమగా మారిపోయింది. ఆ ఆత్మానందంలో రమిస్తూ జీవితాన్ని ధన్యం చేసుకొంటున్నారు మౌనయోగి" అని పాల్ అభిప్రాయపడ్డాడు. అంతటి తాదాత్మ్య స్తితిని పొందిన ఒక మహా యోగిని దర్శించినందుకు తన జన్మ ధన్యం అయిందనుకొన్నాడు బ్రంటన్.❁

# అతీంద్రియ యోగి బ్రామా

(the yoga which conquers death)

బ్రామా నిరంతర సాధకుడు. అడయార్ దగ్గర ఉండేవాడు. బ్రంటన్ ఈయనను సందర్శించి, ఆయన అనుభూతులను తెలుసుకొన్నాడు. ఈయన చక్కగా మాట్లాడి వివరించాడు. యోగ విద్యలన్నీ పూర్తిగా గురుముఖంగా బ్రామా నేర్చుకొన్నాడు. ఆయన చూపే అద్భుతాలు మనల్ని వివశుల్ని చేస్తాయి. ఒకసారి పాల్ వెళ్లినప్పుడు బ్రామా శిలా విగ్రహంలాగా కూర్చుండిపోయాడు. కదలిక లేనేలేదు. ఆయన గుండెచప్పుడు క్షీణిస్తోంది. చివరికి గుండె కొట్టుకోవటం మానేసింది. అలా యేడు సెకన్లు గడిచింది. చనిపోయాడనుకొన్నాడు. రక్షించాలి అనే ప్రయత్నంలో పాల్ ఉన్నాడు. క్రమంగా శరీర అవయవాలు కదలటం ప్రారంభించాయి. "హమ్మయ్య" అనుకొన్నాడు. మళ్ళీ గుండె కొట్టుకోవటం ప్రారంభించింది. మామూలు మనిషి అయ్యాడు బ్రామా. "గుండె ఆగిపోవటం గమనించావా?" అని బ్రామా అడిగాడు. "స్పష్టంగా. అది విభ్రాంతి కాదు" అని స్పష్టం చేశాడు బ్రంటన్. ఇదేమీ గొప్ప విషయం కాదని తన గురువు రక్త ప్రసరణను కూడా ఆపివేయగల సమర్థులని తెలిపాడు. బ్రామాను ఆ విధానం చూపించమని అర్థించాడు పాల్. బ్రామా బ్రంటన్‌ను తన మణికట్టు వద్ద నాడిని పట్టుకోమన్నాడు. అప్పుడు రక్త ప్రసరణ స్పష్టంగా కనిపించింది పాల్‌కు. రెండు లేక మూడు నిమిషాల తర్వాత క్రమంగా రక్త ప్రసరణ తగ్గుతున్నట్లు గమనించాడు. నాడి స్పందన తగ్గుతోంది. మరికొద్ది సేపటికి నాడి కొట్టుకోవటం ఆగిపోవటం స్పష్టంగా గమనించాడు బ్రంటన్. పల్సును ఆపేశాడు బ్రామా. తర్వాత మూడో నిమిషం వరకు అలాగే నాడీ స్పందన ఆగిపోయింది. నాలుగో నిమిషానికి నెమ్మదిగా స్పందన ప్రారంభం అయినట్లు గమనించాడు. చివరకు మామూలుగానే నాడి కొట్టుకుంది. పాల్ ఆశ్చర్యపోయాడు. "ఇదేమీ ఆశ్చర్యపడాల్సిన విషయం కాదు" అన్నాడు బ్రామా తాపీగా. "కావాలంటే శ్వాస కూడా ఆపేస్తాను చూస్తావా" అన్నాడు. సరేనన్నాడు పాల్.

బ్రామా కళ్ళు మూసుకొన్నాడు. తన ఉచ్ఛ్వాస, నిశ్వాసలను గమనించమని ముందే చెప్పాడు. అలాగే చూస్తున్నాడు పాల్. బ్రామా ఒక రాయిలాగా మారిపోయాడు కాసేపటిలో. ఒక రకమైన సమాధి స్థితిలోకి వెళ్లిపోయాడు. ఆయన ముక్కు దగ్గర వేళ్ళు పెట్టి చూశాడు పాల్. ఎక్కడా ప్రాణ స్పందన కనిపించలేదు. శ్వాస పూర్తిగా స్తంభించిపోయింది. ఆయన నాసా పుటాలను, భుజాలను, పెదిమలను, ఛాతీని అన్నీ తట్టి చూశాడు. కాని, ఎక్కడా ప్రాణం కనిపించలేదు. ఒక పాలిష్ చేసిన అద్దం తెచ్చి ముక్కు పుటాల దగ్గర పెట్టాడు. శ్వాస జరిగితే దానిపై నీటి బిందువులు ఏర్పడాలి.



అదీ లేదు. పెదిమల దగ్గర పాలిష్ చేసిన ఇత్తడి పళ్ళెం పెట్టాడు. ఎక్కడా నీటి బిందువులు జాడేలేదు. అంటే ఖచ్చితంగా శ్వాస ఆగిపోయిందని నిర్ణయానికి వచ్చాడు బ్రంటన్. తాను ఊహించని విషయాలు బ్రామా చేసి చూపించటంతో "మైండు బ్లాంక్" అయిపోయింది పాల్‌కు. యోగా అంటే పనికి మాలింది అని ఇప్పటి దాకా అనుకొన్నందుకు సిగ్గుపడ్డాడు. బ్రామా క్రమంగా స్పృహలోకి వచ్చాడు. "ఎంతో గొప్పగా ఉంది" అని పొగిడాడు. దాని విధానం వివరించమని బ్రామాను కోరాడు. అలా చెప్పలేమని ఇదంతా "అడ్వాన్సుడు యోగా"కు చెందిన క్రియలు అని తెలిపాడు. "వీటిలో ఇమిడి ఉన్న సూత్రం ఏమిటి" అని అడిగాడు పాల్. కొన్ని జంతువులను గమనిస్తే మనకు చాలా విషయాలు తెలుస్తాయి. ఏనుగు చాలా నెమ్మదిగా శ్వాసిస్తుంది. అందుకే ఎక్కువ కాలం బతుకుతుంది. పెద్ద సర్పాలు ఇంకా నెమ్మదిగా శ్వాసిస్తాయి. కనుక ఎక్కువ కాలం జీవిస్తాయి. హిమాలయాల్లో శీతాకాలంలో చాలా జంతువులూ "వింటర్ స్లీప్"లో హిమాలయ గుహల్లో ఉంటాయి. అక్కడ ఒక్కసారి కూడా శ్వాస పీల్చుకోవు కొన్ని వారాల తరబడి. హిమాలయ ఎలుగుబంట్లు, ధృవపు ఎలుగు బంట్లు ఇలానే చలికాలం గడుపుతాయి. కొన్ని నెలలు ఇలా ఉండగలవు. శ్వాసను నిలిపివేసుకొంటాయి. ప్రాణం నిరంతరం కొనసాగుతుంది. చావు శరీరానికి ఒక అలవాటు మాత్రమే.

రాజా రంజిత్ సింగ్ హరిదాస్ అనే ఒక ఫకీరును లాహోరులో ఒక సమాధిలో బంధించాడు. ఆ తర్వాత బ్రిటీష్ సైన్యం, రంజిత సింగు సమక్షంలో ఆ సమాధిని తవ్వి చూశారు. ఆరు వారాల తర్వాత కూడా ఆ ఫకీరు జీవించే ఉండి హాయిగా నవ్వుకొంటూ బయటకి వచ్చాడు. ఇది ప్రభుత్వ రికార్డులలో నమోదై ఉంది. ఆత్మబలంతో శ్వాసను నిరోధించుకొని ఆ యోగి చావు నుండి తప్పించుకొన్నాడు. ఇవన్నీ యోగ రహస్యాలే. వీటిని గురువు సమక్షంలో అభ్యాసం చేయాలి. వీటిని ప్రదర్శనగా చేయరాదు. అయితే వాటిపై నమ్మకం కలిగించటానికి అప్పుడప్పుడు తప్పదు. ❁

సిద్ధ యోగి పుంగవులు-25

# సామాజిక యోగి శ్రీజగ్గీ వాసుదేవ్

శ్రీసద్గురు వాసపుదేవ్‌ను అందరు "జగ్గీ వాసుదేవ్" అని ఆప్యాయంగా పిలుచుకొంటారు. అసలు పేరు జగదీశ్. అదే జగ్గీ అయింది. జగత్తుకు నాయకత్వం వహించే లక్షణాలు ఆయనలో ఉన్నందుకే ఆ పేరు పెట్టారట. ఆయన 3-9-1957 సుశీలా, డాక్టర్ వాసుదేవ్ అనే తెలుగు దంపతులకు కర్నాటకలోని మైసూర్‌లో జన్మించారు. చిన్నప్పుడే గురువు "మల్లాది హళ్లి రాఘవేంద్ర స్వామి" వద్ద యోగాభ్యాసం నేర్చారు. అప్పటి నుండి అది ఆయనకు నిత్యకృత్యమైంది. మైసూర్ వర్సిటిలో ఇంగ్లీష్ లిటరేచర్‌లో డిగ్రీ సాధించారు. మోటారు సైకిల్‌పై దేశమంతటా పర్యటించారు. కారునడపగలరు. ఆయనకు రాని విద్యలేదు. ఆయన మైసూర్లోని చాముండీ హిల్‌పై ఒక రాతిమీద కూర్చుని తీవ్ర ధ్యానంలో నిమగ్నమయ్యారు. 23-9-1983 వారికి అకస్మాత్తుగా దివ్య దర్శనం అయి, జ్ఞానోదయం అయింది. మంచి యోగా కేంద్రాన్ని స్థాపించమని గురువు ఆదేశించారాయన్ను. తగిన స్థలం కోసం తీవ్రంగా గాలించారు. చివరకు తమిళ్‌నాడులోని కోయంబత్తూర్‌కు నలభై కిలోమీటర్ల దూరంలో ప్రశాంత వాతావరణంలో "వెళ్ళిం గిరిమౌంటేన్" వద్ద మంచి ప్రదేశం లభించింది. అక్కడ ఒక ఆశ్రమాన్ని నిర్మించి, యోగాను నేర్పుతున్నారు. "ఈశా ఫౌండేషన్"ను స్థాపించి ఎన్నో సేవా కార్యక్రమాలను నిర్వహిస్తున్నారు. "ఈశా" అంటే ఆయన "నిర్గుణ పరబ్రహ్మ" అని అర్థం చెప్పారు. ఇక్కడే "యోగిక్ టెంపుల్"ను నిర్మించి ధ్యానానికి కేంద్ర బిందువుగా "ధ్యాన లింగాన్ని" ప్రతిష్టించారు. అక్కడ అందరు యే భేదం లేకుండా ధ్యానం చేసుకోవచ్చు. సర్వ జన సన్నిహితుడు ఆయన. ఆ కేంద్రంలో అన్నీ నేర్పుతారు. ఆయనకు అన్ని ఆటలు వచ్చు. హాకీ కూడా ఆడతారు. తమిళ్‌నాడు, కర్నాటక రాష్ట్రాలలో తరచు భారీ "సత్సంగాలు" నిర్వహిస్తారు. ఆయనకు ఆరు ఖండాలలో, అనేక దేశాలలో శిష్య పరంపర ఉంది. పర్యటనలు చేస్తూ వారిని ఉత్తేజితులను చేస్తుంటారు.

"ప్రముఖ భారతీయుడు"గా అనేక పత్రికల నిర్వహించిన అభిప్రాయాలలో స్థానం సంపాదించారు. ఆయన అంతగా భారీ కార్యక్రమాలను నిర్వహించిన వారు అరుదు. క్రిందటి ఏడాది మద్రాస్‌లో "ఆనంద్ అలై" (A Wave of Bliss) అనే పేరున "భారీ సత్సంగ్‌ను నిర్వహిస్తే, లక్షా యాభై వేలమంది పాల్గొని, "న భూతో" అనిపించారు. ఆయన చాలా సాధారణంగా ఉంటారు. ముఖంలో దివ్య తేజస్సు వెలుగుతూ ఉంటుంది. చక్కని గడ్డం. జుట్టుకు, గడ్డానికి రంగులు వేసుకోరు. ప్రాచీన మహర్షి ఆయనలో దర్శనమిస్తారు. ఈశా ఫౌండేషన్ గిన్నీస్ బుక్ రికార్డు సాధించింది.



తమిళ్‌నాడులో ఆయన ఆధ్వర్యంలో ఒకేరోజు 80,000 మొక్కలు 27 జిల్లాలలో నాటి, రికార్డు సృష్టించారు. ఆ సంస్థ గ్రామీణ ఆర్థిక విధానాన్ని, ఆధునిక అభివృద్ధి మార్గాలు చేబట్టింది. ఆరోగ్య కేంద్రాలను ఏర్పటు చేసి నిర్వహిస్తోంది. సంచార విద్యాలయాల ద్వారా 4,200 గ్రామాలకు సేవలందిస్తున్నారు. వీటివల్ల 70 లక్షలమంది వైద్య సదుపాయాన్ని పొందుతున్నారు. అమెరికాలోని టెన్నిసీ రాష్ట్రంలో కంబర్లాండ్‌లో mc Minvillei 1200 ఎకరాల స్థలంలో Isha Foundation " isha institute of inner sciences" 2006లో నిర్మించి, సేవలందిస్తున్నారు. ప్రపంచ శాంతి, సుహృద్భావం, సమాజ పరిరక్షణ, అందరికి విద్యా, ఆరోగ్యం, సాంకేతిక వినియోగం, స్త్రీ విద్యా, శిశు సంరక్షణ కోసం అవిరళ కృషి చేస్తున్నారు. ఏది బోధించినా తేలిక మాటలతో హృదయంలో నిలిచిపోయేటట్లు చేసే శక్తి సద్గురువులది. వారి వాసుదేవ వాణిని విందాం.

### సద్గురు వాసుదేవవాణి

మానవాళి కేవలం జీవించటం అనేదాన్ని అధిగమించింది. ప్రతి మనిషిలో మేధస్సు ఉంది. దాన్ని తెలుసుకొని సాధనలోకి తెచ్చుకోవాలి. దాన్ని తిండికో, విలాస జీవితానికో, ధన సంపాదనకో ఖర్చుపెడితే ప్రయోజనం లేదు. మనిషి మానసిక పరిస్థితిని వృద్ధి చెందించాలి. సమానత్వం అనేది "ఒకే రకంగా ఉండటం" అనుకొంటే పొరబాటే. అలా అయితే రెండో వారి అవసరం లేదు కదా. సమానత్వం అంటే సమాన అవకాశాలు. నువ్వు ఇష్టపడే వ్యక్తి నీతో సమానం కాదు. అతనెప్పుడూ నీ కంటే పైనే ఉంటాడు. మనం ఇవాళ విలువలను కోల్పోతున్నాం. అన్నీ డబ్బు, హోదాలతో ముడిపెడుతున్నాం. స్త్రీ కూడా సమానత్వాన్ని కోరుతుంది. అంటే పురుషునితో సమానంగా సంపాదించాలని మాత్రమే భావించరాదు. ఆమెకు గృహ బాధ్యతలుంటాయి. కుటుంబాన్ని ఉన్నత స్తితికి తీసుకురావాలనే తపన ఆమెలో ఉంటుంది. సాంకేతికత పుణ్యమా అని మార్పు అనేది చాలా వేగవంతంగా జరిగిపోతోంది. ఈనాటి చిన్నపిల్లలు ఆరు బయట స్తలాల్లో ఆడుకోవటం తక్కువగా ఉంది. వాళ్ళు ఇప్పుడు "గెలాక్సీల మధ్య" ఆడుకొంటున్నారు. అంటే కంప్యూటర్‌లో ఆడుకొంటున్నారు. కృత్రిమ ఆటలు ఆడుతున్నారని అర్థం. ఇరుగు పొరుగు వారితో ఆటలాడే తీరిక వారికి లేకుండా పోయింది. సాంకేతికత మనకు అన్నీ తెచ్చి అరచేతుల్లో పెడుతోంది. మరి సమస్య ఏమిటి? ఉన్న ప్రతిదానితో మనమే సమస్యలను అనంతంగా సృష్టించుకొంటున్నాం. మనం వాడే సెల్, కంప్యూటర్ వగైరాలన్నీ మానవ మెకానిజం కంటే గొప్పవేమీ కావని గ్రహించాలి. మీరు చెప్పిన మాట మీ పిల్లలు వినటం లేదు అంటే, చెప్పే నైతిక విలువను మీరు కోల్పోయారు అని అర్థం. అధికారంతో వారిని శాసించలేము. నువ్వు వారి నుండి గౌరవం, మర్యాదా కోరుకొంటే అది "వేళాకోళం" అవుతుంది. వారికి అందుబాటులో ఉన్నవన్నీ తెలిసేట్లు చేయండి. సలహా ఇస్తున్నట్లుగా మీరు చెప్పేది వాళ్లకు అనిపించాలి. అప్పుడు వాళ్ళు వినటమే

కాదు, ఏది ఎలా చేయాలని మిమ్మల్ని తరచు వచ్చి అడుగుతూ ఉంటారు. అప్పుడే మీరు చెప్పే దానిమీద వారికి గురి ఏర్పడుతుంది.

### భగవద్గీతపై వ్యాఖ్యానం

భగవద్గీత అన్నది రాజకీయ బోధకాదు. అది ఆధ్యాత్మిక ఔన్నత్యాన్ని బోధించేది. అది రాజకీయమే అయితే కృష్ణుడు అందరికీ చెప్పేవాడు కదా. తన అత్యంత అంతరంగికుడైన అర్జునుడికి ఒక్కడికే ఎందుకు చెప్పాల్సి వచ్చింది? భగవాన్ శ్రీకృష్ణుడు అర్జునునికి గీతను బోధించిన తర్వాత 36 ఏళ్ళు అర్జునుడు జీవించే ఉన్నాడు. కాని దాన్ని ఎవరికీ చెప్పలేదు? అసలా విషయాన్ని ఎవరి వద్దా అతను ప్రస్తావనకు తీసుకురాలేదే. అది నర నారాయణులిద్దరి మధ్య ఉన్న రహస్య విషయం. బయటి నుంచి ఎవరూ వినను కూడా లేదు. అదంతా అతని స్వయం నిర్ణయం, అనుభవానికి సంబంధించిన విషయం. భగవద్గీత హిందువులకు మాత్రమే అనుకోవటం పొరబాటు. అది అందరిదీ. జ్యూ అయిన న్యూటన్ గురుత్వాకర్షణ సిద్ధాంతాన్ని కనిపెట్టాడు. కనుక అది యూదులకు మాత్రమే వరిస్తుందంటే వెర్రితనం కాదా? సనాతన ధర్మం అంటే విశ్వ నిబంధన, చట్టం ధర్మం, న్యాయం. (యూనివరసల్ లా) కృష్ణుడు బోధించినప్పుడు ఆయన హిందువు అని అనుకోలేదు. ఆయనేమీ హిందూ మతాన్ని సృష్టించలేదు. కృష్ణుడు గుర్తు చేసింది "స్వధర్మం"నే. స్వధర్మం అంటే హిందూ ధర్మం అని కాదు. స్వీయమైన, వైయక్తికమైన ధర్మం అని అర్థం. గీత ఒక చక్కని డిబేట్. సందేహాలకు సమాధానాలు. ఈ గ్రంథం ఇలా చెప్పింది, ఆ గ్రంథం అలా చెప్పింది అని శంకలు పనికి రావు. అవన్నీ చిన్న టాంకులో ఉన్న నీరులాంటివి. అసలు అనంత నీటి ప్రవాహమే వస్తే, వీటి ఉనికే వుండదు కదా!

నేను చెబుతున్నవన్నీ, నేను అనుభవ పూర్వకంగా తెలుసుకొన్నవే. మీ స్వధర్మమే అన్నిటికన్నా ఉన్నతమైనది, ఉత్తమమైనది అని మర్చిపోరాదు. అంతశ్శోధన చేసుకోండి. మిమ్మల్ని అప్పుడు మీరే నడిపించుకోగల సామర్థ్యాన్ని పొందగలుగుతారు. ముందుగా దానికి అర్హత సంపాదించాలి. అది ఎలా ఉంటుందంటే చిన్న పిల్లాడు ఐన్‌స్టీన్‌గారి $E=MC^2$ సూత్రాన్ని బట్టీ తనకు సాపేక్ష సిద్ధాంతం అర్థం అయింది అని చెప్పటంలా ఉంటుంది. గీతలోని మాటలకు అర్థ తాత్పర్యాలు తెలిసినంత మాత్రం చేత గీత నీకు అవగాహన అయినట్లు కాదని తెలుసుకోవాలి. నీకు నీ స్వధర్మం అంటే స్వీయ ధర్మం (లా ఆఫ్ ది సెల్ఫ్) తెలియాలి అప్పుడే అది అర్థము అయినట్లు. టెక్నాలజీ నిన్నేమీ "నన్ను ఉపయోగించేకో" అని కోరటం లేదే. అది అందుబాటులో ఉంది. నువ్వు దాన్ని నీ సౌకర్యం కోసం మనసులతో ఏ విధమైన పనులు చేయించుకోవాలో నీకు తెలియదు. అలాగే నీ భావోద్వేగాలను, నీ శరీర ధర్మాన్ని ఎలా నియంత్రించుకోవాలో తెలీని మూర్ఖత్వంలో ఉంటున్నావు. అందుకని నీ చుట్టూ ఉన్న ప్రతిదానిపైనా ఫిర్యాదులు



చేస్తుండటం నీకు అలవాటైపోయింది. ఆధ్యాత్మికత్వం అంటే మింగుడుపడని పదార్థం అనుకొని పొరబడుతున్నావు. అవసరం వచ్చినప్పుడు సాంకేతిక సహాయం తీసుకో. మిగిలిన కాలాన్ని ధ్యానంలో గడుపు. అప్పుడు అంతా స్వచ్ఛంగా కనిపిస్తుంది. టెక్నాలజీన్ని వాడవద్దని ఎవరూ చెప్పరు. అవసరానికే వినియోగించు. జీవితాన్ని అధ్యయనం, పరిశీలనా చేయాలి లేకపోతే బురదలో కూరుకుపోతాం. ఆన్‌లైన్లో అన్నీ చేసుకో ఇబ్బందేమీ లేదు. ప్రపంచంలో అందరికీ అన్నీ చాలటం లేదని ఫిర్యాదు ఉంది. విషయాలకు సమర్థవంతంగా పరిష్కరించే ఆలోచన చేయకపోవటమే లోపం. నువ్వు నిర్మించిన ఇంజనీరింగ్ వస్తువులను గురించి గొప్పగా పొగుడుకొంటావు. కానీ నీలోని ఇంజనీరింగ్ శక్తిని గూర్చిన ధ్యాసే లేకుండా పోయింది. మేము ఇప్పుడు "ఈశా క్రియా" అనే సులభ పద్ధతిని ఉచితంగా అందరికి అందిస్తున్నాం. ఇండియాలో దీనిని 12 మిలియన్ల లను చేసి పంచిపెట్టాం. అమెరికాలో కూడా వీటిని అందించే ఆలోచనలో ఉన్నాము. ఇది నెట్‌లో లభించేటట్లు చేశాం. దాని ప్రకారం రోజుకు కేవలం 12 నిమిషాలు కేటాయించే అవకాశం ఉంటే అలానే చేయవచ్చు. "మేము బిజీ, మాకు సమయం లేదు" అనుకొనే వారికి ఈ "ఈశ క్రియ". ఇది క్రియ అని ఎందుకు అన్నాము అంటే దీనిలో ఉండటం, శ్వాసించటం, వికసించటం (be, breatheand blossom) అనేవి ఉన్నాయి. కనుక దీన్ని అందరు హాయిగా తేలిగ్గా చేయగలరు, చేస్తున్నారు, ప్రయోజనం పొందుతున్నారు కూడా. ఇది సరైన మార్గంలో పడటానికి అతి తేలికైన మార్గంగా రుజువైంది. హాయిగా, తీరిగ్గా కుర్చీలో కూర్చుని చేయచ్చు. ధ్యానం మీద ధ్యాస పెట్టండి. అంతా చకచకా అదే జరిగిపోతుంది. స్విచ్ వేస్తే, బల్బు వెలిగి కాంతినిచ్చినట్లు. అదే మీకు మార్గ దర్శకత్వం చేస్తుంది. ఇందులో తెలీనిది అంటూ ఏమీ ఉండదు. నష్టపోవటం జరగదు. ఏమి చేయాలన్న సందేహాలే మీ దేహానికి రావు. ప్రతి క్షణంలోను మిమ్మల్ని ముందుకు దారి చూపి నడిపిస్తుంది. "The hollow bamboo can turn the passing wind into a sweet song one filled with its own sap will be mute and dumb when all of creation laughs and sangs if the hum of life's sweet song has to be heard Empty. Empty yourself of yourself. The sweetness, the melody, and the fragrance of the Divine Song shall be you when you let yourself be absorbed into the divine will"- Sadguru Vasu Deva.❀

# పీఠికాపుర పీఠాధిపతి-ఉమర్ ఆలీషా కవి

ఉమర్ ఆలీషాగారు కవి, రాజకీయ నాయకులు, ఖిలాఫత్ ఉద్యమ నాయకులు మహర్షి మోహియుద్దీన్ కుమారులు. వంశ పారంపర్య పీఠాధిపతులు. తండ్రిగారు భాషా గురు వరేణ్యులు. కనుక కవిత్వం ఉగ్గుబాలతోనే అలవడింది. తల్లిగారు చాంద్ బీబీ. 28-2-1885న తూర్పు గోదావరి జిల్లా పిఠాపురంలో జన్మించారు. తండ్రిగారు ఉర్దూ, అరబ్బీ, పారశీక సంస్కృతాలలో మహా పండితులు. "శ్రీ విశ్వ విజ్ఞాన విద్యా ఆధ్యాత్మిక పీఠ" సంస్థాపకులు. ఆత్మవిద్యలో మార్గదర్శులు. వీరి పూర్వీకులందరూ ఈ కోవకే చెందినవారు.

ఉమర్ ఆలీషాగారు చిన్నప్పుడే సంస్కృతాంధ్రాలలో నిష్ణాతులయ్యారు. తర్వాత పారశీక, ఆంగ్ల, అరబ్బీ భాషలో ప్రావీణ్యం సంపాదించారు. ఆంగ్లంలో మంచి ఉపన్యాసకులు. ఆంగ్ల పద్య కావ్యాలలో ఏ మాత్రం ప్రవేశం లేదు. వీరికి పోతనలాగా సహజంగానే కవిత్వం అబ్బింది. సహజ కవులుగా కీర్తి గడించారు. పధ్నాలుగవ ఏట "మణి మాల" అనే నాటకం రాసి ప్రచురించారు. ఎంతో మంది ఆలీషా గారికి ఉద్యోగం ఇస్తానని ఆహ్వానించినా ఆశపడని స్వాభిమానులు. భాషా, దేశ సేవలో జీవితాన్ని పండించుకొన్నారు.

ఉమర్‌గారు ఇస్లాం మతస్తులు. మాతృభాష ఉర్దూ. సుమారు యాభై గ్రంథాలు రచించారు. అందులో నాటకాలు, ఖండ కావ్యాలు, పద్య కావ్యాలు, చరిత్ర ఆధ్యాత్మిక గ్రంథాలు, నవలలు అనువాదాలు ఉన్నాయి. నాటకాలలో మణిమాల, విచిత్ర బిల్హణీయం, చంద్ర గుప్త, కౌరవ రంగము, అనసూయా దేవి, కళ ఉన్నాయి. పద్య కావ్యాలలో ఉమర్ఖయ్యాం, మహమ్మద్ ప్రవక్త జీవితం, సూఫీ వేదాంత ధర్మం ముఖ్యమైనవి. సర్గ మాత, పేర్కొన్న దగినవి. ఖండ కావ్యాలలో ముఖ్యమైనది బర్హిణీదేవి. నవలలు, పారశీక రచనల అనువాదాలు చాలా ఉన్నాయి. ఎన్నో సాహిత్య వ్యాసాలూ రాశారు.

అలీగారి రాజకీయ జీవితమూ విశేషమైనదే. ముస్లిం లీగ్‌కు మద్రాస్ విభాగానికి ఉపాధ్యక్షులుగా పనిచేశారు. ఉత్తర మద్రాస్ నుంచి పార్లమెంట్‌కు ఎన్నిక అయి దేశ సేవ చేశారు. 1936-45 వరకు అయిదేళ్ళు పార్లమెంట్ సభ్యులుగా ఉన్నారు. బెనారస్ హిందూ విశ్వవిద్యాలయంలో తెలుగు కవితా విభాగానికి సభ్యుడిగా గౌరవింపబడ్డారు. ఆంధ్ర విశ్వవిద్యాలయం ముస్లిం బోర్డ్ ఆఫ్ స్టడీస్‌లో తెలుగు శాఖకు సభ్యులయ్యారు. ఆలీ బ్రదర్స్‌లో ఒకరైన షౌకత్ ఆలీ, గాంధీజీ ఒకే రైల్‌లో ప్రయాణం చేస్తూ ఉంటే వాల్తేరు స్టేషన్‌లో ఆలీని పోలీసులు అరెస్ట్ చేసి జైలుకు పంపారు. గాంధిగారు అప్పటికప్పుడు స్టేషన్‌లోని జనాన్ని ఉద్దేశించి మాట్లాడి ఆలీ దేశ సేవను మెచ్చారు. ఆ



తర్వాత ఉమర్ ఆలీషా మహోదయులు ఉత్తేజపూర్వక ఉపన్యాసం చేసి అందరిని చైతన్యపరచారు.

ఉమరాలీషా గారిని ఆలీఘుర్ యునివర్సిటి "మౌల్వీ" బిరుదు నిచ్చి సత్కరించింది. ఆంధ్ర విశ్వవిద్యాలయం పండిత బిరుదుతో సత్కరించింది. ఇంటర్నేషనల్ అకాడమి ఆఫ్ అమెరికా 1936లో "డాక్టర్ ఆఫ్ లెటర్స్"తో గౌరవించింది.

వారు రాసిన "తత్వ సందేశం" అనే ఆధ్యాత్మిక గ్రంథం చాలా ప్రాచుర్యం పొందింది. మహమ్మద్ రసూల్ చరిత్ర మంచి పేరు తెచ్చుకొంది. స్త్రీ విద్యను ప్రోత్సహిస్తూ పుస్తకాలు రాశారు. స్వాతంత్ర్య సమరానికి సంబంధించిన విషయాలపై రచనలు చేశారు. అస్పృశ్యతా నివారణ కోసం పాటుబడటమే కాక రచనలూ చేశారు. వరకట్న నిషేధంపై ఉద్యమం నడిపి వ్యాసాలూ రాశారు. ఇక ఫిలాసఫీలో పుంఖాను పుంఖాలుగా వ్యాసాలు రాసి మార్గదర్శనం చేశారు. అటు భాషాసేవ ఇటు మాతృ దేశసేవతో బాటు ఆధ్యాత్మిక గురువుగా, సంఘ దురాచార నిర్మూలన, మహిళాభ్యున్నతికి కృషి చేసి ఉమర్ ఆలీషా గురువరేణ్యులు అందరికి దగ్గరయ్యారు. ఒక శిష్యుని కోరిక మన్నించి నరసాపురం వెళ్లారు. అక్కడే 23-2-1945న అకస్మాత్తుగా "సెరిబ్రల్ హెమరేజి"కి లోనై అరవైయవ ఏట తనువు చాలించారు.

# అంతర్ముఖ మహాయోగి-బెల్లంకొండ రామరాయ కవి

వైష్ణవ సంప్రదాయానికి చెందిన బెల్లంకొండ రామరాయ కవి నియోగి బ్రాహ్మణులు. గుంటూరు జిల్లా నరసారావుపేట దగ్గరున్న పామిడిపాడులో 1876లో జన్మించారు. సంపన్న కుటుంబం. రుక్శాఖకు చెందినవారు. వీరు ఆశ్వలాయన సూత్రబద్ధులు. వీరిది భారద్వాజస గోత్రం. చిన్నతనంలోనే తండ్రిని కోల్పోయిన అభాగ్యుడీయన. మొదట ఆంగ్లంలో విద్యనూ నేర్చుకొన్నారు. పిమ్మట దానిపై విరక్తి ఏర్పడి, సంస్కృతాధ్యనం కొనసాగించారు. వీరు మొదట విశిష్టాద్వైత మతాన్ని అవలంబించారు. హయగ్రీవ ఉపాసనతో సర్వం సాదించుకొన్నారు. చాలా కుశాగ్ర బుద్ధికల వీరు చిన్ననాటే రోజు సంస్కృతంలో కవితలు అల్లేవారు. వీరి సంస్కృత పాండిత్యం కాళిదాసు రఘువంశంలో రెండు, కుమార సంభవంలో రెండు సర్గలతోనే ఆగిపోయింది. మేఘదూతాన్ని విన్నారు. తర్వాత అన్నిటిని చక్కగా అన్వయించుకొన్నారు.

పదహారవ ఏటనే "రుక్మిణీ పరిణయం", "రమా పరిణయం" అనే చంపూ కావ్యాలను రాశారు. నెల్లూరుకు చెందిన సింగరాజు వెంకట రమణయ్యగారి కుమార్తె ఆది లక్ష్మమ్మను పరిణయమాడారు. వీరి మంత్రానుష్టానం చాలా తీవ్రంగా ఉండేది. గొంతువరకు నీటిలో ఉండి మంత్రాన్ని అనుష్టించేవారు. చింతతోటలో అరుగుమీద కూర్చుని ఉపాసన చేసేవారు. ఇంటిలో నిత్యం హయగ్రీవ అర్చన చేస్తూ, విద్యార్థులకు భోజన భాజనాలను సమకూరుస్తూ, సాహిత్యం, అలంకార శాస్త్రాలను విద్య బోధించేవారు. పురిమళ్ళ రామశాస్త్రి, సుబ్రహ్మణ్య శాస్త్రులగార్ల వద్ద తర్క, వ్యాకరణాలను అధ్యయనం చేశారు. వ్యాఖ్యావ్యాకరణాలను స్వయంగా నేర్చిన మేధావి బెల్లంకొండ కవి. సిద్ధాంత కౌముదిపై "శరద్రాత్రి" అనే వ్యాఖ్య రాసిన పండిత ప్రకాండులు.

ప్రతిరోజు వేదాంత గ్రంథ అధ్యయన, అధ్యాపనం చేస్తూ, అద్వైత వేదాంత గ్రంథాలనన్నిటిని స్వంతబుద్ధితో అన్వయించుకొని ఆమూలాగ్రం గ్రహించిన అపర అగస్త్యులు. వంశపారంపర్యంగా వస్తున్న వైష్ణవానికి దూరమై, ఆ గురువులను వదిలేసి అద్వైత సిద్ధాంతంలో నిష్టమ పెంచుకొన్నారు. శంకరాద్వైతానికి పాఠాలు చెప్పారు. అద్వైతం వీరి నర నరానా జీర్ణించుకొని పోయింది. 143 గ్రంథాలను రచించిన మహా రచయిత అయ్యారు. స్వయంగా వారే 30కి పైగా గ్రంథాలను ముద్రించుకొన్నారు. అతి చిన్న వయసులో ఇన్ని గ్రంథాలు రచించిన రచయిత లేదు అనిపించుకొన్నారు.

రామరాయ కవి రచించిన స్తోత్ర గ్రంథాలు చాలా ఉన్నాయి. అలాగే శతక సంఖ్య కూడా ఎక్కువే. అందులో అష్టక స్తోత్రాలు 68 ఉన్నాయి. అన్నిటిలోను అద్వైత సిద్ధాంత ప్రతిపాదనే చేసి అపర శంకరులనిపించారు. భగవత్పాదుల గీతా భాష్యానికి



వీరు వ్యాఖ్య రాశారు. వీరి గ్రంథాలలో ముఖ్యమైనవి - గీతా భాష్యార్క ప్రకాశిక, (శంకర భాష్య టీకా), వేదాంత ముక్తావళి, శంకరాశంకర భాష్య విమర్శ (అద్వైతం) సిద్ధాంత సింధువు (మధుసూదన సరస్వతి గ్రంథానికి వ్యాఖ్య) వేదాంత కౌస్తుభం, అద్వైతాన్య మత ఖండం, శరద్రాత్రి (కౌముదికి వ్యాఖ్య) చంపూ భాగవత వ్యాఖ్య, మురారి రచించిన అనర్ఘ రాఘవ నాటక వ్యాఖ్యానం, సముద్ర మధనం అనే చంపు కావ్యం, కృష్ణ లీలా తరంగిణి అనే కావ్యం.

రామరాయ కవి గ్రంథ రచనను ఒక మహా తపస్సుగా భావించి సాధించారు. కవిత్వం ధారా శుద్ధితో, నిసర్గ రమణీయంగా ఉంటుంది. అంతర్ముఖులైన, సమా విష్టులు అయిన మహాయోగి బెల్లంకొండ రామరాయ కవి. హయగ్రీవ పాసకులకు అసాధ్యమేదీ లేదని నిరూపించిన మహా తపస్సంపన్నులు.

# పార్థివ లింగయోగి-పేరి లక్ష్మీ నారాయణ శాస్త్రిగారు

నిత్య పార్థివ లింగపూజా పరాయణులు బ్రహ్మశ్రీ పేరిలక్ష్మీ నారాయణ శాస్త్రిగారు. 1877లో గోదావరి జిల్లా కోనసీమలో పేరూరు అగ్రహారంలో జన్మించారు. తండ్రిగారు మహా శ్రీ విద్యోపాసకులైన అనంత రామావధానులుగారు. తల్లిగారు వెంకమాంబ. తాతగారు శ్రీ పార్థివ లింగపూజా పరాయణులు, శ్రీ విద్యోపాసకులు, సత్కర్మ పరాయణులు అయిన సుబ్బావధానులు గారు. వీరిది ద్రావిడ బ్రాహ్మణ కుటుంబం.

శాస్త్రిగారి చిన్నతనంలోనే తండ్రి మరణించారు. అమ్మగారే వీరిని కంటికి రెప్పలాగా కాపాడారు. ఎనిమిదవ ఏటనే ఉపనయనం చేశారు. పదహారవ ఏటనే వైయాకరణ చూడామణి బిరుదాంకితులైన మంధా చెన్నయ్యశాస్త్రిగారికి శిష్యులై సంస్కృత కావ్య నాటకాలను, న్యాయ వేదాంత గ్రంథాలను అభ్యాసం చేశారు. తర్కశాస్త్రం మీద మోజు కలిగి అతి దుర్బోధకంగా ఉండే ఆ శాస్త్రాన్ని పంచదార పానకంలా గుటకాయస్వాహాగా పుచ్చుకొని, ఆనాటి మేటి తర్కశాస్త్రజ్ఞులనే ఆశ్చర్యంలో ముంచారు. ఆయన దిపణాదిక్యతకు అందరు ముచ్చటపడ్డారు.

విజయనగర మహారాజ సంస్కృత కళాశాలలో న్యాయశాస్త్ర ప్రధానాచార్యులు అపర గౌతమ బిరుదాంకితులు అయిన గుమ్మలూరి సంగమేశ్వర శాస్త్రిగారి వద్ద న్యాయ శాస్త్రాన్ని పది ఏళ్ళు అభ్యసించారు. దీనికి మెరుగులు దిద్దుకోవటానికి నైయాకరణ సార్వభౌములు అని పిలువబడే పిఠాపుర ఆస్థాన విద్వాంసులైన శ్రీపాద లక్ష్మీ నరసింహశాస్త్రిగారి సమక్షంలో రెండేండ్లు న్యాయశాస్త్రాన్ని చదివి అసాధారణ పండితునిపించుకొన్నారు. పిఠాపురం, ఉర్లాం సంస్థానాలను దర్శించి తమ నిరూపమానమైన పాండిత్య ప్రకర్షను నిరూపించి, శాస్త్రపరీక్షలో నెగ్గి, ప్రథమ స్థానాన్ని పొంది అనేక బహుమానాలను గెలుచుకొన్నారు.

తమ స్వగ్రామంలో న్యాయశాస్త్రాన్ని, వేదాంతాన్ని అనేకమంది శిష్యులకు బోధించారు. వీరి కీర్తి నేల నాలుగు చెరగులా వ్యాపించింది. 1902లో విజయనగర సంస్కృత మహా విద్యాలయంలో న్యాయశాస్త్రాధ్యాపకులుగా నియుకులైనారు. 1913లో సంగమేశ్వర శాస్త్రిగారి నిర్యాణం తరువాత వీరు ప్రధాన న్యాయశాస్త్ర పండితులుగా పదోన్నతి పొందారు. మహా రాజావారి అభ్యర్ధన మేరకు రాజస్థాన్‌లోని జయపూర్ సంస్థానానికి వెళ్లి అక్కడ మహా విద్వత్ సభలో తమ ప్రజ్ఞా, పాండిత్య ప్రతిభను, వాదకౌశలాన్ని ప్రదర్శించి "న్యాయ భూషణ" బిరుదును పొందారు. విజయవాడలోని త్రిలింగ విద్యా పీఠంవారు బ్రహ్మశ్రీ ముదిగొండ వెంకటరమణ సిద్ధాంతిగారి ఆధ్వర్యంలో



"న్యాయస్థాపక" బిరుదునిచ్చి సత్కరించారు. 1937లో లక్ష్మీ నారాయణశాస్త్రిగారు సంస్కృత కళీశాల ప్రధాన పండిత పదవిని అలంకరించారు. అయిదేళ్ళు పనిచేసి విశ్రాంతి పొందారు.

ఆనాటి బ్రిటీష్ ప్రభుత్వంవారు శాస్త్రిగారి విద్వత్తుకు అబ్బురపడి "మహా మహోపాధ్యాయ" అనే అరుదైన బిరుదునిచ్చి సత్కరించారు. వీరికి ముందు నలుగురు మాత్రమే ఈ బిరుదును పొందారు. న్యాయ, వేదాంతాలను జీవితాంతం బోధించటమే గాక మంత్ర, జ్యోతిషాలలో అద్భుత ప్రావీణ్యం సంపాదించారు. చాలా గహనమైన ఉదయానా చార్యుల రచన "కుసుమాంజలి"రి అతి సరళ భాషలో అనువాదం చేసి తమ పాండితీ గరిమను నిరూపించారు. అలాగే గదాధర భట్టాచార్యుల "హేత్వాభాస సామాన్య నిరుక్తి", "సవ్యభిచార సామాన్య నిరుక్తి" అనే నవ్య న్యాయశాస్త్ర గ్రంథాలకు "లలిత" అనే పేరుతో వివరణాన్ని రాసి, తమ న్యాయశాస్త్ర కౌశలాన్ని, ప్రతిభా వ్యుత్పత్తిని ప్రదర్శించి, కోవిదులమన్నన లందుకొన్నారు. మాధవాచార్యుల వారి "సర్వదర్శన సంగ్రహం"లోని అనేక భాగాలకు ఆంధ్రానువాదం చేశారు. అయితే అది అముద్రితమే. డెబ్బది మూడు సంవత్సరాలు ధన్య జీవితాన్ని గడిపిన న్యాయశాస్త్ర కోవిదులైన శాస్త్రిగారు 1949న పరమపదించారు. ❁

# వాస్తుయోగి-వడ్డేపాటి నిరంజన శాస్త్రి

వడ్డేపాటి నిరంజన శాస్త్రిగారు 1877లో గుంటూరు జిల్లా తెనాలి తాలూకా దుగ్గిరాల గ్రామంలో జన్మించారు. తండ్రి కోటయ్యగారు. తల్లిగారు భద్రమ్మ. చిన్ననాడే ఉపనయనం జరిగింది. వెంటనే వేదాధ్యయనం ప్రారంభించారు. వేదం, ఉపనిషత్తులను అభ్యసించారు. సంస్కృతంలోను తెలుగులోను విశేష పాండిత్యాన్ని సంపాదించుకొన్నారు.

వీరు శిల్పర్షి పంచకంలో సానగ రుషి గోత్రానికి చెందినవారు. రుగ్వేద అధ్యయనులు. విశ్వబ్రాహ్మణులు. వంశ వృత్తి అయిన ఇనుప పని, కుమ్మర పనిలో తండ్రిగారి కర్మాగారంలో సరదాగా పనిచేస్తూ మెలకువలన్నీ నేర్చారు. వీరి దృష్టి శిల్ప మీదకు, వాస్తు శాస్త్రం మీదకు మళ్ళింది. వాటిని క్షుణ్ణంగా నేర్చి ప్రవీణులయ్యారు. జ్యోతిషం ఆ తరువాత అభిమాన విషయమైంది. దీనిలోతు పాతులను తరచి నిష్ణాతులనిపించుకొన్నారు. ఇవి ఇలా కొనసాగిస్తూనే వేద, ఆగమ దర్శన శాస్త్రాలలో విశేష ప్రతిభను చాటుకొన్నారు. అందులో ప్రవేశమే కాదు పాండిత్యాన్ని, గడించి వాదనలో సాటిలేరని నిరూపించుకొన్నారు. ఉన్నత విద్యాలయంలో పండిత పదవి వీరిని వరించి వీరి ప్రతిభకు తగిన వరం అయింది.

శాస్త్రిగారు 18వ ఏటనే వీరబ్రహ్మేంద్ర చరిత్రను, "కల్యంధ కౌముది" అనే పేరు తో శ్రవ్య కావ్యంగా రాశారు. కుమారస్వామి తారకాసుర వధను "కుమారాభ్యుదయం" నాటకంగా రాశారు. రెండు మహాప్రౌఢ ప్రబంధాలను కూడా రాసి, పూర్వకవుల సామర్థ్యం తనకూ ఉన్నదని నిరూపించారు. అవి భీష్మోదయం, ధర్మ పాలచరిత్రం. మాఘ మహాత్మ్యాన్ని ఆంధ్రీకరించారు. సూర్య శతకం, సుబ్బరాయ తారావళితో బాటు బ్రహ్మానంద లీలలు అనే నాటకాన్ని కూడా రాశారు. వీరి భాషా పాండిత్య వేద విజ్ఞాన శాస్త్ర ఆగమ దర్శన సిద్ధాతాలకు నికషోపలంగా నిలిచేది వీరు రచించిన "విశ్వకర్మ బ్రాహ్మణ వంశాగమము" అనే మహా గ్రంథం.

వాస్తు శాస్త్రపు గుట్టు మట్టులన్ని ఆకళింపు చేసుకొని యోగ దృష్టితో దానిని ఆచరణలో ఉంచుకొని ఎందరికో మార్గదర్శులై నిలిచారు. వీరు నిర్మాణాలను చేసి, పర్యవేక్షిస్తూ దోష రహితంగా, శాస్త్రబద్ధంగా వాస్తుబద్ధంగా నిర్మాణపు పనులకు మంచి సహేతుకమైన సూచనలిచ్చేవారు. శాస్త్రిగారు గొప్ప సంఘ సేవకులు, సంఘ సంస్కర్తలు. మచిలీపట్నం వాస్తవ్యులు కొండిపర్తి వీరభద్రాచార్యులు గారితో కలిసి వీరు 1908లో కృష్ణా, గుంటూరు మండల విశ్వబ్రాహ్మణ మహాసభలను నిర్వహించారు. "ప్రబోధిని" అనే పత్రికను స్థాపించి నీతి, మత, భాషా, శిల్ప, సాంఘిక విషయాల ఉద్ధరణ కోసం



తీవ్రంగా కృషి చేసి కృత కృత్యులయ్యారు. శిల్ప శాస్త్రంలో ఉన్న అభిరుచి వల్ల తమిళనాడు, ఆంధ్ర, మహారాష్ట్రలలో పర్యటించి, శిల్ప రహస్యాలను గ్రహించారు. అమూల్య విషయాలను సేకరించి శిల్ప పురోగతికి ఎంతో సేవ చేశారు.

నిరంజన శాస్త్రిగారు అనేక యజ్ఞాలను తానే యాజకులుగా ఉండి నిర్వహించారు. ఆంధ్ర ఆంధ్రేతర ప్రాంతాలలో వీరు అనేక చోట్ల నిర్వహించిన "అహింసా యజ్ఞం" ఎందరినో ప్రభావితులను చేసి ప్రేరణనిచ్చింది. దీనివల్ల వేలాది మంది వైదిక ధర్మ పరాయణులుగా మారారు. ఇంతకంటే సాధించాల్సిన్దేమి ఉంది? బ్రాహ్మణ, విశ్వబ్రాహ్మణ వివాదాలలో వాదాలలో గుంటూరు, మద్రాస్, గోకర్ణ క్షేత్రాలలో బ్రాహ్మణ, విశ్వబ్రాహ్మణ ఆధిక్యాన్ని గిర్చి జరిగిన వాదోపవాదాలలో శాస్త్రిగారు సమర్థవంతమైన తమ వాదనను వినిపించి దిగ్గంతులైన పండితులనే ఆశ్చర్యపరిచారు. ఎందరికో స్వయంగా వెళ్లి పండిత సాక్ష్యాలను ఇచ్చి గెలుపొందేటట్లు చేసిన వాదనా నిపుణులు. వారికి అరవై ఏళ్ళు వచ్చేసరికి 1937లో నూరేళ్ళు నిండిపోయాయి. ఒక గొప్ప సామాజిక సేవకుడిని ఆంధ్రదేశం కోల్పోయింది. ❀

# కృష్ణబ్రహ్మ తంత్ర-పరకాల స్వామి

స్వామివారి పూర్వాశ్రమ నామం హోస దుర్గం కృష్ణమాచార్యులు. వీరు వికారి నామ సంవత్సర జ్యేష్ట శుక్ల పంచమినాడు జన్మించారు. తండ్రిగారు శ్రీనివాస తాతాచార్యులవారు గొప్ప ప్రఖ్యాతి చెందిన పండిత కవులు. తండ్రిగారి కీర్తి ఆంధ్ర దేశమంతటా వ్యాపించింది. ఆచార్యుల వారు కర్నూలు మండలిలో పేపలిలో విద్యాభ్యాసం మొదలుపెట్టారు. వీరి ప్రథమ గురువులు వ్యాకరణ శాస్త్రంలో దిట్ట అనిపించుకొన్న అయోధ్య కొండమాచార్యులవారు. అఖండ పాండితీగరిమతో, స్వామివారు అందరి మన్ననలు అందుకొన్నారు.

కృష్ణమాచార్యుల కుమారులు శ్రీనివాస రాఘవాచార్య, దేశికాచార్యులు ఇద్దరు పండిత కవులుగా సుప్రసిద్ధులు. అంటే వీరి కుటుంబమే పండిత కవి వంశం అని తెలుస్తోంది. అనంత పాండిత్య ప్రకర్షతో స్వామివారు వనపర్తి, గద్వాల, ఆత్మకూరు సంస్థానాలను సందర్శించి, తమ కవితా పాండిత్య ధారతో మెప్పించి సత్కారాలను, సన్మానాలను అందుకొన్న శేముషీ దురంధరులు. వనపర్తి ఆస్థానంలో ధర్మాధికారిగా కొంతకాలం పనిచేశారు. అప్పుడే ఆ రాజుగారిపై "రామేశ్వర విజయ చంపు" అనే ప్రబంధాన్ని రచించారు. అలాగే ఆత్మకూరు సంస్థానంలో ఉన్న శ్రీనివాస స్వామి వారిపై "శ్రీనివాస విలాస చంపు" అనే విశిష్ట ప్రబంధాన్ని పండిత జనరంజకంగా నిర్మించారు. వీరు రాసిన "హంస సందేశ వ్యాఖ్య" పండిత ప్రసంశలను పొందింది. హయగ్రీవ ఉపాసకులైన స్వామివారు శతాలంకార లక్ష్య లక్షణ సమన్వయముగా హయగ్రీవ స్వామిని ప్రావీణ్యాన్ని నిరూపించుకొన్నారు.

కార్తీకమాసంలో గద్వాలలో జరిగే ఉత్సవాలను వర్ణిస్తూ "కార్తీకోత్సవ దీపిక" అనే గ్రంథాన్ని రాశారు. లక్ష్మీ సహస్ర వ్యాఖ్య, నృసింహ విలాస చంపువు వీరి అముద్రిత గ్రంథాలు. కృష్ణమాచార్యులు 40వ ఏట ఆశ్రమ స్వీకారం చేశారు. మైసూర్‌లోని పరకాల మఠాధిపతులైన శ్రీ రంగనాథ స్వామివారు ఆచార్యులవారి పాండిత్యం, నీతి నియమాలకు ముగ్ధులై తమ తర్వాత పీఠాధిపతులుగా నియమించారు. అప్పుడే వీరికి కృష్ణపర తంత్ర స్వామి"గా నామకరణం జరిగింది. పరకాల పీఠాధిపతులుగా స్వామివారు 30 సంవత్సరాలు సేవలందించి పీఠం ఉన్నతికి అన్ని విధాలా కృషి చేసి అందరి దృష్టిని ఆకర్షింపజేశారు. ఆశ్రమాధిపతిగా వీరు విజ్ఞాన బీజాలను దేశమంతటా వెదజల్లి, వేద విహిత ధర్మ వ్యాప్తికి ఇతోధికంగా తోడ్పడ్డారు.

స్వామివారి విద్వత్తు, పాండిత్యం నిర్దుష్టమైనవి. శ్రీవారికి "విద్వత్ కవి



సార్వభౌమ", "కవి గండభేరుండ" మొదలైన బిరుదులు లభించాయి. వీరి అపూర్వ గ్రంథాలు కొన్ని ముద్రణకు నోచుకోలేదు. అందులో శ్రీ పరకాల గురు విజయం, రఘునాథ విజయం, రంగరాజ విలాసం, నృసింహ విలాసం, కేశవోత్సవ మాలిక, శ్రీలక్ష్మీ సహస్రం, రసాస్వాదిని, ఆచార్య వేద పాద స్తవ వ్యాఖ్యానం, నవరత్న హార స్తవ వ్యాఖ్యానం, కావ్యోత్కర్ష రక్షా, సరస్వతీ మూలధనం, శ్రీకృష్ణ జయంతీ పౌర్వాపర్య నిర్ణయం, శిష్ట సిద్దాంత పద్ధతి, శూద్రాశీర్నిర్ణయం, కుర్త్రుక్రమ నిర్ణయం, స్వయం వ్యక్త ప్రతిష్టా నిర్ణయం, వివాహ కాల నిర్ణయం, ప్రసన్నాభరణం, వృత్తి ముక్తాహార స్తుతి వ్యాఖ్యానం, సుభద్రా పరిణయం, విశ్రాంత రాఘవం, ఉన్మత్త పాండవం మొదలైన అనేక ఆధ్యాత్మిక, ఆగమ, సిద్ధాంత, కావ్య, వ్యాఖ్య, అలంకార గ్రంథాలను అలవోకగా రచించిన మహానుభావులు. వీరి స్తోత్రాలకు విశేష ప్రాచుర్యం ఉంది.

అహ్నిక రత్నం, మేఘమాల, సమయామృతం, సూర్యోప రాగ దర్పణం, రాజవంశ రత్నావళి, కళ్యాణ గీత మంజరి, ఉత్తర రంగ మహాత్మ్యం, శ్రీ రామాయణ వైభవం, శంభు రహస్యం, శ్రీ శరదంబుజ మాల, శ్రీ రామచంద్ర మంగళ మాలిక, శ్రీ సర్వర్తు కుసుమమాలా, మొదలైనవి శ్రీవారి వేద వేదాంగ, శాస్త్ర, విషయ పరిజ్ఞానానికి మహా శేముషీ వైభవానికి నిదర్శన గ్రంథాలు. ఇంత సాహిత్య సంపదను జాతికి అందించిన పూర్ణ ప్రజ్ఞా చాతుర్యం శ్రీ పరకాల స్వామివారిది. మఠాధిపత్యాన్ని సాధికారికంగా, సాంగంగా, సర్వ సమర్థవంతంగా నిర్వహించి బహుజన హితం కోసం జీవితాన్ని పరిపూర్ణం చేసుకొన్న కృష్ణ పర తంత్ర-పరకాల స్వామి యతీంద్రులు ఆనంద నామ సంవత్సర కార్తీక బహుళ పంచమి నాడు సిద్ధి పొందారు.❁

# జ్యోతిష్టోమ యోగి-మల్లాది రామకృష్ణ చయనులు

మల్లాది రామకృష్ణ చయనులుగారు 1865లో గుంటూరు జిల్లా సత్తెనపల్లి తాలూకా గోరంట్ల అగ్రహారంలో జన్మించారు. తండ్రి రాఘవయ్య, తల్లి అచ్చమ్మగార్లు. వెలనాటి బ్రాహ్మణులు. చిన్ననాటే వీరు హైదరాబాద్ సంస్థానంలో ఒక గ్రామానికి తీసుకొని పోబడి అక్కడ ఒకరికి దత్తత పొందారు. కాని అక్కడి పరిస్థితులు అనుకూలించక తిరిగి స్వస్థలం చేరుకొన్నారు. అయితే తెలంగాణా ప్రాంతంలో ఉండటం వల్ల ఉర్దూ అరబ్బీ, పార్శీ భాషలలో కొద్ది ప్రవేశం లభించింది. గోరంట్లలో సంస్కృతా భ్యాసం చేశారు. 'సంస్కృత కావ్యాల'ను నేర్చారు.

అమలాపురం చేరి అక్కడి ఇందుపల్లి గ్రామంలో ఏలేశ్వరపు తమ్మన్న శాస్త్రిగారి దగ్గర కావ్యాలు నాటకాలు పూర్తిచేశారు. పేరేరుకు చేరుకొని మంధా చెన్నయ్య శాస్త్రిగారి వద్ద తర్కాన్ని, పేరి నరసింహ శాస్త్రిగారి దగ్గర వ్యాకరణ శాస్త్రాన్ని క్షుణ్ణంగా అభ్యసించారు. వీరి జ్ఞాన తృష్ణ తీరలేదు. శ్రీపాద రామశాస్త్రిగారి వద్దా, విజయనగరంలోని భీమాచార్యుల వారి వద్దా అంతే వాసులుగా ఉండి తర్క శాస్త్రాన్ని మధించారు. ఈ శాస్త్రాలన్నిటిలో నిశిత పాండిత్యాన్ని సంపాదించి తిరుగులేదనిపించుకొన్నారు.

చయనులుగారు ఇరవై రెండో ఏటనే కొండవీడులో ఒక సప్తాహం జరుగుతుంటే వెళ్లారు. అక్కడ ఒక ప్రసిద్ధ పండితునితో వాదించాల్సి వచ్చి తన వాదనా సామర్థ్యాన్ని నిరూపించి, ఆ పండితుని ఓడించారు. దీంతో వీరి కీర్తి సర్వత్రా వ్యాపించింది. వెంటనే వారికి అమరావతిలోని గుడిమెల్ల వెంకట సుబ్బయ్యగారు తమ కుమార్తె కృష్ణవేణమ్మనిచ్చి వివాహం జరిపించారు. రామకృష్ణగారు మైసూర్ సందర్శించి అక్కడి పజమాని సుందర రామశాస్త్రిగారి వద్ద బ్రహ్మ సూత్ర శంకర భాష్యాన్ని, వేదాంత పరిభాషను అద్వైత సిద్ధి మొదలైన గ్రంథాలను చదివి ఆధ్యాత్మిక విద్యలో అనితర సాధ్య పాండితీగరిమను సాధించారు. దీనితో ఆగక, బెంగుళూరు సీతారామశాస్త్రిగారి వద్ద తర్కశాస్త్రంలోని అరుదైన గ్రంథ రాజాలను సైతం కరతలామలకం చేసుకొన్నారు. అక్కడి నుండి తమిళనాడు చేరుకొన్నారు. అక్కడ వేద, శ్రౌతాలలోను, షట్ శాస్త్రాలలోను అసమాన ప్రజ్ఞను సాధించుకొన్నారు. అక్కడ వీరి గురువులు ఈ శాస్త్రాలలో దిట్ట అనిపించుకొన్న త్యాగరాజ శాస్త్రిగారు. వాచస్పత్యాన్ని, కల్పతరువును వ్యుత్పత్తి వాదం మొదలైన ఉద్గ్రంథాలను అవలోకనం చేశారు. త్యాగయ్యశాస్త్రిగారు అప్పయ్య దీక్షితులవారికి తొమ్మిదవ తరంవారు. అంతటి గురుమూర్తి వీరికి లభించటం చయనులగారి పూర్వజన్మ సుకృతం.

ఈ విధంగా విద్యా జైత్రయాత్రను దిగ్విజయంగా పూర్తిచేసుకొని గుంటూరు దగ్గరున్న అమరావతి క్షేత్రాన్ని చేరి, స్వగృహాన్ని నిర్మించుకొని స్థిర నివాసం ఉన్నారు.



విజయవాడలో కూడా గృహ నిర్మాణం కావిన్చుకొన్నారు. 36వ ఏట మళ్ళీ దక్షిణ దేశం వెళ్లి, త్యాగరాజ స్వామి నిలయమైన తిరువయ్యురులో, స్థలపురాణం బాలకృష్ణ శాస్త్రిగారి వద్ద శిష్యులై ఉపనిషత్, షట్ దర్శనాలు మరికొన్ని వేదాంత గ్రంథాలను పఠనం చేశారు.

ఈ విధంగా అపార పాండిత్యాన్ని సంపాదించిన రామకృష్ణగారు విశేషంగా దేశ సంచారం చేసి ధర్మ, వేదాంత ప్రబోధాలను చేస్తూ ప్రజలకు ఆధ్యాత్మిక భావన కల్గించారు. చాలాకాలం పుష్ప గిరి పీఠము, విరూపాక్ష పీఠములకు ఆస్థాన పండితులుగా ఉండి తమ ప్రజ్ఞను చాటుకొన్నారు. వీరికి వైదిక కర్మానుష్ఠానంపై ఆసక్తి ఎక్కువ. 1904లో అమరావతిలో జ్యోతిష్టోమాన్ని, 1922లో విజయవాడలో చయనాన్ని చేశారు. అప్పటి నుండి వీరు రామకృష్ణ యాజులని, రామకృష్ణ చయనులుగారు అని ఆహితాగ్ని నామాలతో పిలువబడ్డారు.

శ్రుతి, స్మృతిలలో చెప్పబడిన సనాతన ధర్మాన్ని ప్రజలలో విశేష ప్రచారం చేసిన వీరిలాగా ఉన్న పండితులు అరుదుగా ఉంటారు. వేదాంత శాస్త్రాన్ని సర్వజనులకు సమ్మతమైన రీతిలో భాష్య ప్రవచనం రూపంలోనే కాక, ఉపన్యాస రూపంలో కూడా చెప్పటంలో వీరికి వీరే సాటి అనిపించుకొన్నారు. పండితులలో మహావక్తగా ప్రఖ్యాతి చెందారు చయనులుగారు. పంజాబు రాష్ట్రంలోను పర్యటించి తన వాగమృతాన్ని పంచి "వ్యాఖ్యాన వాచస్పతి" బిరుదునందుకున్నారు. అఖిల భారతంలోను చయనులగారి కీర్తి చంద్రికలు వ్యాపించినాయి. "అఖిల భారత వర్ణాశ్రమ ధర్మసంఘం"లో చయనులుగారు కార్య నిర్వాహక సభ్యులుగా ఉన్నారు. "బాల బోధిని", "భ్రమభంజని" అనే వేదాంత గ్రంథాలను రాశారు. "ప్రాయశ్చిత్త పశు విషయక విమర్శ గ్రంథాలను", "మహా యాగాలలో", ధర్మ ప్రబోధంలో, ఆధ్యాత్మిక గ్రంథ రచనలో నిండుగా గడిపిన జ్యోతిష్టోమ యోగి రామకృష్ణ చయనులుగారు 1941లో పరమపదించారు. ❁

# శ్రీ విద్యోపాసకులు-ఆది భట్టరామమూర్తి శాస్త్రి

బొబ్బిలి తాలూకా మురగడం అగ్రహారంలో 1861లో సుబ్రహ్మణ్య, మహాలక్ష్మమ్మ దంపతులకు ఆదిభట్ట రామమూర్తి శాస్త్రిగారు జన్మించారు. ద్రావిడ శాఖకు చెందిన వీరు స్వగ్రామంలోనే పంచకావ్యాలను నేర్చుకొన్నారు. పిమ్మట శ్రీపాద రామమూర్తి శాస్త్రిగారి వద్ద తర్కశాస్త్రాన్ని, పంచ లక్షణ వ్యధి కారణాన్ని, సిద్ధాంత లక్షణాలను అవచ్ఛేదకత్వ నిరరుక్తిని, పక్షత సామాన్య నిరుక్తి అనే తర్క గ్రంథాలను ఆసాంతం చదువుకొన్నారు. పండితులకు నిలయమైన కాశీ చేరి, కర్నాటక సీతా రామశాస్త్రిగారి దగ్గర నవ్యభిచారం, సత్ ప్రతిపక్షం, అవయవం అనే మహాగ్రంథాలను చదివి తమ తర్క పాండిత్యాన్ని అభివృద్ధి చేసుకొన్నారు. బెంగాలీ పండితులైన వజ్ర కుమార విద్యా రత్న భట్టాచార్యుల వారి వద్ద వ్యుత్పత్తి వాద, శక్తి వాదాలతోబాటు, ప్రామాణ్య వాదం, విధివాదం, ముక్తి వాదం అనే అపూర్వ గ్రంథ రాజాలను తుదముట్టా చదివి తమ వాదనా సామర్థ్యానికి పదును పెట్టుకొన్నారు.

తర్కశాస్త్రంలో ప్రమాణ గ్రంథమైన "మూల చూడం"ను అధ్యయనం చేసి ఎదురులేని పాండిత్యాన్ని కైవశం చేసుకొన్నారు. కలకత్తా వెళ్లి అక్కడి ప్రభుత్వ పరీక్షలో పాల్గొని "తర్క తీర్థ" బిరుదును అందుకొన్నారు. అక్కడ విశేష సన్మానంతో బాటు అయిదు వందల రూపాయల నవరత్న రూప బహుమానాన్ని అందుకొన్నారు. ప్రతిభకు తగిన ప్రతిఫలం వారికి లభించింది. దానితో సంతృప్తి చెందలేదు. కాశీ పండితుల చేత కూడా భేష్ లనిపించుకోవాలనే ఆలోచన కలిగి కాశీ చేరారు. అక్కడ ద్రావిడ సుబ్రహ్మణ్య దీక్షితుల వద్ద వేదాంత సూత్ర శంకర భాష్యంలో చతుస్సూత్రి వరకు అధ్యయనం చేశారు. స్వీయ ప్రతిభతో దశోపనిషత్తుల భాష్యాలను, గీతా భాష్యాన్ని, సూత్ర భాష్యాన్ని,అద్వైత సిద్ధిని, గౌడ బ్రహ్మానందాన్ని తాను అభ్యసించి, శిష్యులకు అధ్యాపనం చేశారు.

వీరి అపూర్వ పాండిత్యం అందరిని ఆకట్టుకొన్నది. కర్నాటక దేశంలోని చిత్రాపూర్‌లోని శంకర పీఠస్వామికి వేదాంతాన్ని బోధించే అరుదైన అవకాశాన్ని పొందారు. వారి ఆదేశంపై అక్కడి విద్యార్థులకు తర్కశాస్త్రం బోధిస్తూ మూడేళ్ళు ఉన్నారు. తమ పర్యటనలలో దర్భాంగా, మండి సంస్థానాలను దర్శించి విద్వత్తును ప్రదర్శించి బహుమానాలను, సత్కారాలను పొందారు. ఉర్లాం జమీన్‌దారు వీరిని తర్కశాస్త్ర పరీక్షాధికారిగా చేశారు. మండపేట, విజయనగరం, రాజమండ్రి సంస్కృత కళాశాలలో పదిహేడు సంవత్సరాలు అధ్యాపకులుగా పనిచేసి ఎందరో శిష్యులకు తర్కశాస్త్రాన్ని



బోధించి, తీర్చిదిద్దారు.

వీరి విద్యా గరిమను చూసి తిరుపతి సంస్కృత కళాశాలలో ప్రధాన ఆచార్య పదవినిచ్చి సత్కరించారు. ఇక్కడ ఎక్కువకాలం పని చేయలేదు. దక్షిణ దేశ సంచారం చేస్తూ విద్వత్ సభలలో రాణిస్తూ వాదాలలో జయభేరి మ్రోగిస్తూ, తర్కంలో అజేయులనిపించుకొని, శాస్త్రార్థ చర్చలలో అద్వితీయులని నిరూపించుకొని జయ కేతనాన్ని ఎగురవేశారు. లుకులాం అగ్రహారాన్ని చేరుకొని, అక్కడ వదాన్యులైన బూర్లె శ్రీ రాములుగారి చేత భూమి, గృహం, వసతులను పొంది నివాసమున్నారు. సుఖ జీవితాన్ని గడుపుతూ విద్యార్థులకు తర్క వేదాంత విద్యనూ బోధిస్తూ గడిపారు. శక్తి వాదంపైన ఒక అపూర్వ వ్యాఖ్యానాన్ని రాశారు కాని ముద్రణకు అది నోచుకోలేదు.

రామమూర్తి శాస్త్రిగారు విద్యార్థి దశనుండి శ్రీవిద్యోపాసకులు. కడ దాకా దాన్ని కొనసాగించిన దీక్షాదక్షులు. అవసాన దశ సమీపించే తరుణంలో శాస్త్రిగారు నదీతీరంలో ఉండాలని సంకల్పించుకొని, రాజమహేంద్రవరం చేరి, గోదావరీ తటాన కొంతకాలం ఉన్నారు. చివరి రోజులలో సన్యాసాశ్రమం తీసుకొని సార్థక జన్ములైనారు. తమ యాభై తొమ్మిదవ ఏట 1920లో ఆదిభట్ట రమమూర్తి శాస్త్రి స్వామి సిద్ధి పొందారు. వారి విద్యా వైదుష్యానికి శ్రీ విద్యోపాసనే తోడ్పడిందని నిశ్చయంగా నమ్మి, ఆమరణాంతం దాన్ని అనుసరించిన ధన్యజీవులు. ❀

# శిల్పయోగి-యలవర్తి ఆంజనేయశాస్త్రి

విశ్వబ్రాహ్మణ కుటుంబానికి చెందిన యలవర్తి ఆంజనేయశాస్త్రిగారు 1877లో బుచ్చయ్య, లక్ష్మి దేవమ్మగార్లకు జన్మించారు. వైదికాచార కుటుంబం వీరిది. యజుర్వేదంలో ప్రసిద్ధమైన శిల్ప శాస్త్ర నిపుణులు. వీరి గోత్రం సువర్ణ ఋషి గోత్రం. శ్రౌతంలోను, స్మార్తంలోను వీరు మంచి అభినివేశం చూపారు. వేదంలో కొన్ని పన్నాలను నేర్చుకొన్నారు. సంస్కృతాన్ని అభ్యసించి కావ్య నాటకాలంకారాలను అధ్యయనం చేశారు. తర్కం, వ్యాకరణం, శిల్పం, వాస్తు శాస్త్రాల లోతులు తరచి చూశారు. ధర్మశాస్త్రాలను అవలోడనం చేశారు. వేదాంతాన్ని క్షుణ్ణంగా నేర్చారు. యోగశాస్త్రంలో వీరి పాండిత్యం గణనీయం. అది జన్మాంతర సంస్కారం వల్ల లభించినదిగా అందరు భావిస్తారు. ఏ శాస్త్రం తీసుకొన్నా దాన్ని ఆసాంతం చదివి, నిష్ణాతులు అనిపించుకోవటం వీరి ప్రజ్ఞ.

తెలుగులో కావలసిన జ్ఞానాన్ని స్వయంగా సాధించుకొన్నారు. సంస్కృతం, తెలుగులలో అలవోకగా కవిత్వం చెప్పటం అలవాటైనది. యమ, నియమ మొదలైన అష్టాంగ యోగం వీరికి అద్భుతంగా అబ్బింది. గాయత్రీ మంత్రానుష్టానంతో కూడిన తపస్సు అంటే వారికి మహా ఇష్టం. నియమం తప్పకుండా దాన్ని శ్రద్ధా భక్తులతో అనుష్టించారు. శక్తులు అలవడినాయి. గృహస్త జీవితం గడుపుతూనే ఉదయమే ప్రారంభించి పదకొండు గంటల వరకు తదేక దీక్షతో అనుష్టానం చేసేవారు. ఆ సమయంలో ఎవ్వరికీ దర్శనం ఇచ్చేవారు కాదు. అంతటి కఠోర దీక్ష వారిది. వారి దీక్షకు అందరు ముక్కున వ్రేలు వేసుకొనేవారు.

వాస్తుశాస్త్రం మీద వీరికి ఉన్న అపార అభినివేశంతో వాస్తు విషయాలన్నీ సేకరించి ఒక ఉద్గ్రంథంగా "వాస్తుపాఠ సంగ్రహం" రాశారు కాని ఆంధ్రుల దురదృష్టమేమో అది ముద్రణకు నోచుకోలేదు. "సంస్కృత సంధ్యా వందన భాష్యం" రాసి సంధ్యావందనం మీద అందరికి అభిరుచి, అభినివేశం కల్పించారు. "విశ్వబ్రహ్మోపనిషత్తులు"ను సంపాదించి, తెలుగు అర్థంతో దాన్ని ప్రచురించారు. యజుర్వేదంలోని "విశ్వబ్రహ్మ సూక్తాది" మంత్రాలను కొన్నిటికి విశేష వ్యాఖ్యానం రాసి ప్రకటించారు. వీరి ప్రతిభకు దర్పణంగా వెలసిన మహా గ్రంథం "దైవజ్ఞ స్మృతి" అనే ధర్మశాస్త్ర గ్రంథం. జానపాటి పట్టాభిరామ శాస్త్రిగారికి, పంచార్షేయులైన విశ్వ బ్రాహ్మణులకు బ్రాహ్మణత్వంపై గుంటూరు న్యాయస్థానంలో జరిగిన పండిత వివాదం సందర్భంలో ఆంజనేయశాస్త్రి గారు అయిదు రోజులు శాస్త్ర వాదం చేసి, పండిత సాక్ష్యాన్నిచ్చి, విశ్వబ్రాహ్మణ బ్రాహ్మణత్వాన్ని నిరూపించి గెలిపించిన వాదనా సామర్థ్యంగల శాస్త్ర నిపుణులు.

వీరి రెండవ భార్య సుందరమ్మ గారికి జీవనోపాధుల కోసం అవసరమైన సమస్తాన్ని ఆమెకు యేర్పాటు చేసి, తన యావదాస్తిని, ఇంటిని సర్వస్వ దక్షిణగా విశ్వబ్రాహ్మణ సంస్కృత పాఠశాలకు దానం చేస్తూ మరణ శాసనం రాసిన వదాన్యులు. 1914లో 37ఏళ్ళ అతి తక్కువ వయసులో మరణించారు. విశ్వబ్రాహ్మణ కులానికి ఏడు గడగా, వెన్నెముకగా నిలిచి వారి శాస్త్ర పరిజ్ఞానానికి ఇతోధికంగా కృషి చేసి శిల్ప శాస్త్రయోగిగా పేరు పొందారు యలవర్తి ఆంజనేయ శాస్త్రిగారు.❁

సిద్ధ యోగి పుంగవులు-34

# న్యూక్లియర్ ఫిజిక్స్ యోగి-స్వామి జ్ఞానానంద

సైన్స్‌కు మతానికి పొత్తుకుదరదని చాలామంది భావన. కాని ఆల్బర్ట్ అయిన్‌స్టీన్, జగదీశ్ చంద్రబోస్, స్వామి జ్ఞానానంద వంటివారు ఆ రెంటికి ఉన్న అవినాభావా సంబంధాన్ని చక్కగా వివరిస్తూ రెండు ఒకదానికొకటి అవసరమని, అప్పుడే మానవా జాతి పురోగతి అని విస్పష్టంగా చెప్పి, ఆచరించి మార్గదర్శనం చేశారు. ఇందులో ముగ్గురు మనవాళ్ళే. అందులో స్వామి మన ఆంధ్రులు. న్యూక్లియర్ ఫిజిక్స్‌లో స్పెక్ట్రోస్కోపి మీద విశేష పరిశోధన చేసి దేశ విదేశాలలో దాన్ని బోధించి హిమాలయాలలో తపస్సు చేసి యోగాభ్యాసం చేసి వేద ప్రాశస్త్యాన్ని నేల నాలుగు చేరగులా ఉపన్యాసాలతో వ్యాప్తి చేసిన మహానుభావుడే మన స్వామీ జ్ఞానానంద.

స్వామి జ్ఞానానంద పశ్చిమ గోదావరి జిల్లా భీమవరం దగ్గర గొరగనమూడి అగ్రహారంలో 1896 డిసెంబర్ అయిదున జన్మించారు. వీరి అసలు పేరు భూపతి రాజులక్ష్మీ నరపింహ రాజు. తండ్రిగారు రామరాజు మహా వేద విజ్ఞానఖని. వేదాలకు ఉపనిషత్తులకు శాస్త్రాలకు సంబంధించిన వందలాది అపూర్వ గ్రంథాలను, ఆయన చదివి గొప్ప గ్రంథాలయాన్ని నిర్మించుకొన్నారు. మాంచి సంపన్నమైన భూస్వామ్య కుటుంబం వీరిది. ఆ వేద భాండాగారాన్ని కుమారుడు లక్ష్మీ నరసింహ రాజు అద్భుతంగా సద్వినియోగ పరచుకొని వేద వేదాంగాలలో ఉత్తమాభి నివేశాన్ని సంపాదించుకొన్నారు. ఆ గ్రంథాలకు సార్ధకత చేకూర్చారు.

నర్సాపురంలోని టేలర్ హైస్కూల్‌లో విద్యాభ్యాసం చేశారు. ఇరవైవ ఏట వివాహం జరిగింది. బుద్ధుని ప్రభావం వారిపైన ఉన్నది. అందుకని నేపాల్‌లోని లుంబినికి వెళ్లి కొంతకాలం గడిపారు. తర్వాత పదేళ్లు దేశ సంచారంలో, పెద్దల దర్శనాలతో జీవితాన్ని చదువుకున్నారు. హిమాలయా పర్వతాలకు చేరి అక్కడ యోగాభ్యాసం చేస్తూ మరో పదేళ్లు సార్ధక జీవనం సాగించారు. వేదాధ్యయనం వారిని విడువలేదు. దానిపై ఉన్న మక్కువతో అన్ని వేదోపనిషత్తుల సారాన్ని జీర్ణించుకొన్నారు. మానసిక వికాసం కలిగింది. ఒక అపూర్వ తేజస్సేదో వారిలో విరాజిల్లింది.

క్రమంగా వీరి దృష్టి భౌతిక శాస్త్రం వైపుకు మళ్ళింది. దేనిమీద దృష్టి పడినా దాన్ని ఆసాంతం కరతలామలకం చేసుకోకుండా ఉండలేదు. అందుకని జర్మని చేరుకొన్నారు. అక్కడి డ్రెస్ డ్రెయిన్లో గణితం, ఫిజిక్సు చదివారు. ఫిజిక్స్ అంటే వీరాభిమానం కలిగింది. అంతే అప్పుడే విస్తరిస్తున్న "హైటెన్షన్ ఎక్స్ రే ఫిజిక్స్"లో రిసెర్చి ప్రారంభించారు. ప్రేగ్‌లోని చార్లెస్ యూనివర్సిటిలో వీరు రిసెర్చ్ కొనసాగించారు. వీరి ఆధ్యాత్మిక గురువు వీరిలోని వేద విజ్ఞానానికి అబ్బురపడి, శిష్యుని వల్ల వేద విజ్ఞానం



ప్రపంచమంతా విస్తరిల్లాలని ఆకాంక్షించి రాజుగారికి "స్వామి జ్ఞానానంద" అనే ఆశ్రమ నామాన్ని ఒసంగి ఆశీర్వదించారు. అప్పటి నుండి స్వామి కాషాయమ్బర ధారిగా జీవించారు. 1927లో మళ్లీ జర్మనీ దేశం వెళ్లారు స్వామి జ్ఞానానంద. అక్కడ హిందూ మతం మీద వేద విజ్ఞానం మీద పుంఖాను పుంఖంగా ఉపన్యాసాలిచ్చి చైతన్యవంతుల్ని చేశారు. ఆ ఉపన్యాసం ఒక గంగా ప్రవాహమే. ఎన్నో తెలియరాని విషయాలను విజ్ఞానంతో ముడివేసి అలవోకగా అందిస్తూ శ్రోతల మనసులను రంజింపజేసేవారు. అదొక తపస్సుగా వెలువడింది. డ్రిస్డేయిన్ వర్సిటి ప్రొఫెసర్ స్వామి ఉపన్యాసాలకు పులకించిపోయాడు. అవి మానవాళికి కర దీపికలన్నాడాయన.

జ్ఞానానందకు అయిన్ స్టీన్‌గారి సాపేక్ష సిద్ధాంతంపై దృష్టిపడింది. అంటే దాన్ని ఆపోసన పట్టినట్లే. 1929లో దానిమీద రెండేళ్లు అధ్యయపం చేస్తూ అండర్ గ్రాడ్యుయేషన్ పూర్తిచేశారు. ఆయన సాధించిన యోగ విధానం మీద 150కి పైగా ప్రసంగాలు చేసి యువతను యోగమార్గం వైపుకు ఆకర్షితులయేట్లు చేశారు. యోగ, విజ్ఞాన శాస్త్రాలు సన్నిహిత సంబంధం కలవని ఆయన చెప్పేవారు. యోగాలో బేసిక్స్ నేర్చుకొంటే మనసు, మెదడు, శరీరాలపై పూర్తి స్వాధీనం కలుగుతుందని సోదాహరణంగా ఉపన్యసించేవారు. స్వామీజీ ఉపన్యాస సారాన్నంతా "పూర్ణ సూత్రాలు" అనే ఉద్గ్రంథంగా వెలువడి యోగ మార్గానికి కరదీపికగా నిలిచింది. ఇది వారి మహోత్రుష్ట రచనగా ప్రశంసలు అందుకొన్నది. తర్వాత ఆయన ప్రొఫెసర్ డొల్షేక్ గారితో కలిసి జర్మని, ఫ్రాన్స్, జెకోస్లోవేకియాలలో పర్యటించారు.

స్వామి జ్ఞానానంద అభిమాన విషయమైన x ray, spectographyలో రిసెర్చ్ చేసి 1936లో D.Sc సాధించారు. ఇంగ్లాండ్, లివర్ పూల్ వర్సిటీలలో న్యూట్రాన్‌ను కనిపెట్టిన జాన్ చాడ్విక్ అనే మహా శాస్త్రవేత్త వద్ద రెండవ ప్రపంచ యుద్ధ కాలంలో పనిచేశారు. న్యూక్లియర్ ఫిజిక్స్‌లో "Spectography of Bita rays radiation"లో అద్భుత పరిశోధన చేసి Ph.D పొందారు. అమెరికా వెళ్లి అక్కడి మిచిగాన్ యూనివర్సిటిలో "రేడియో యాక్టివ్ ఐసోటోపులు" మీద రిసెర్చ్ చేశారు. ఆయన రాసిన "హై వాక్యూం" అనే శాస్త్ర గ్రంథం మేధావులైన ఎంతో మంది శాస్త్రవేత్తలను ఆకర్షించింది.

దాదాపు పాతికేళ్ళు విదేశాలలోనే చదువు, వేదాంత ప్రవచనాలు, యోగా ఉపన్యాసాలు, తీవ్ర పరిశోధనలతో గడిపిన స్వామి జ్ఞానానంద 1947 మాతృదేశమైన భారతదేశం వచ్చేశారు. ఢిల్లీలోని నేషనల్ ఫిజిక్స్ లాబరేటరీలో సీనియర్ సైంటిఫిక్ ఆఫీసర్‌గా తమ అమూల్యమైన సేవలందించారు. ఏడేళ్ళ తర్వాతా స్వామీజీకి భీమవరం వద్ద ఒక ఆక్సిడెంట్ జరిగింది. ఒక కాలుపోయింది. విశాఖ కింగ్ జార్జి హాస్పిటల్‌లో చేరారు. ప్రమాదం తప్పి, ఆరోగ్యం కుదురుకొన్నది. ఆంధ్ర విశ్వవిద్యాలయంలో న్యూక్లియర్ ఫిజిక్స్‌లో సౌకర్యాలు, పరిశోధనా విభాగం ఆ శాఖను తీర్చిదిద్దే బాధ్యతను

ఆనాటి వైస్ చాన్సలర్ సర్వేపల్లి రాధాకృష్ణన్ స్వామి జ్ఞానానందకు పూర్తి బాధ్యతలతో అప్పగించారు. వారు తమ శక్తి యుక్తులను ధారపోసి 1954లో చేరి తీర్చిదిద్దారు. న్యూక్లియర్ ఫిజిక్స్‌కు గొప్ప భవిష్యత్తు స్వామీజీ వల్లనే మన రాష్ట్రంలో కలిగింది. 1-7-1956లో విశ్వవిద్యాలయంలో "న్యూక్లియర్ ఫిజిక్స్ శాఖ"ను స్వామి ఆధ్వర్యంలో ఏర్పడింది. ఎంతో మందిని ప్రోత్సహించి, ప్రేరణ కల్గించి న్యూక్లియర్ ఫిజిక్స్ భవిష్యత్తును చాటి చెప్పి, అందులో విద్య నేర్పటానికి విద్యార్థులను సంసిద్ధులను చేశారు. ఆంధ్ర దేశంలో న్యూక్లియర్ ఫిజిక్స్‌కు పునాదులు వేసి, వ్యాప్తి చేసింది స్వామి జ్ఞానానంద. ప్రొఫెసర్‌గా, న్యూక్లియర్ ఫిజిక్స్ డిపార్ట్‌మెంట్‌లో చేరి, హెడ్ ప్రొఫెసర్‌గా 1965న పదవీ విరమణ చేశారు. రాష్ట్రమంతటా పర్యటించి, వారు వేద వేదాంగ, యోగాశాస్త్ర రహస్యాలను శ్రోతలకు అందించి యోగశాస్త్ర వేద విజ్ఞాన శాస్త్రాల మధ్య ఉన్న సమన్వయాన్ని విశదీకరించేవారు. ఇవి ఒకదానికొకటి వైరుధ్యం ఉన్నవి కావని, పరస్పర సంబంధం కలవని రుజువు చేశారు. ఆంధ్ర విశ్వవిద్యాలయంలో వారి సేవలను గుర్తించి "స్వామి జ్ఞానానంద లేబరేటరీస్ ఆఫ్ న్యూక్లియర్ రిసెర్చ్"ను ఏర్పాటు చేసి ఘనంగా నివాళులర్పించారు.

స్వామి జ్ఞానానంద మతాన్ని సైన్స్‌ను "సింతెసిస్" చేయాలని భావించారు. ఆయన మహా మానవతావాదిగా నిరూపించుకొన్నారు. ❀





# గీతా మకరంద యోగి-శ్రీవిద్యా ప్రకాశానందగిరి స్వామీజీ

వేదాంత ప్రవచనలో ప్రపంచ ప్రసిద్ధి చెందిన వక్తలుగా, నూట ఎనిమిది గీతా యజ్ఞాలను నిర్వహించి రికార్డు నెలకొల్పిన వారిగా, నభూతో అన్నట్లు భగవద్గీతకు "గీతా మకరందం" పేరుతో అత్యద్భుత వ్యాఖ్యానాన్ని రాసి సామాన్యులను మాన్యులు చేసిన వారిగా, వాల్మీకి మహర్షి రచించిన యోగవాశిష్ట బృహద్గ్రంథానికి అతి సరళ సంక్షిప్త తెలుగు తాత్పర్యాన్ని రాసి అరచేతిలో వెన్నముద్దలా అందించిన మహానుభావులు శ్రీశ్రీశ్రీ విద్యా ప్రకాశానందగిరి స్వాములు.

స్వామి పూర్వాశ్రమం పేరు తూనుగుంట్ల ఆనంద మోహన్. తండ్రిగారు రామస్వామి, తల్లి సుశీలా దేవిలకు కృష్ణాజిల్లా మచిలీపట్నంలో 13-4-1914లో అనూరాధా నక్షత్రం మొదటి పాదంలో జన్మించారు. వ్యాసాశ్రమం స్థాపకులు మళయాళ స్వామివారి శిష్యులు. విద్యా స్వామివారి వాగ్ధాటి అమోఘం. దేశమంతా సంచారం చేసి ఆధ్యాత్మిక విషయాలపైనా, యోగా వాశిష్ట వివరణ మీద భగవద్గీతా ఉపన్యాసాలతో ప్రజలను ఉత్తేజపరచిన స్థారక జీవులు గీతకు వీరిలాగా ప్రచారం నిర్వహించిన వారు లేరు అనిపించుకొన్నారు. వారి ప్రసంగాలలో చిన్న కథలు ప్రవాహంలా దొర్లి పోతుంటాయి. వీటిని హాస్య, వ్యంగ్యాలతో మేళవించి విషయ జ్ఞానాన్ని తేలికగా కలిగించే వీరి నేర్పు అద్వితీయం. మానవ జీవిత దృక్పథం అందులో ప్రతి బింబించేది. నిసర్గ రమణీయంగా, సరళ బోధకంగా ఉండి ఆస్తికుల మనసులో భావం స్తిరంగా నిలిచిపోయేది. సామాన్యుని మాన్యునిగా జేసే గొప్ప ప్రక్రియ అది.

తండ్రిగారు కుటుంబాన్ని తెనాలి చేర్చారు. అక్కడ ఆయన పేరు ప్రఖ్యాతులున్న లాయర్. విపరీతంగా సంపాదన వచ్చిపడేది. అయినా వారికి ధనం మీద వ్యామోహం తగ్గిపోయింది. సంపాదించిన చర, స్థిర ఆస్తులను త్యజించి, ఒక పూరి పాక వేసుకొని అందులో కుటుంబంతో గడిపారు. ఆధ్యాత్మిక సాధనలో జీవితం గడిపారు. ధ్యాన తప, యోగా భజన, పారాయణ, అర్చనలతో, వేదాంత చర్చా గోష్టులతో రోజంతా గడిపేవారు. కుటుంబమంతా ఈ వాతావరణంలోనే గడిపింది. బాల ఆనంద మోహన్ కూడా వీరితో బాటే అదే వాతావరణంలో పెరిగి చిన్నప్పటి నుండి ఉత్తమ సంస్కారాలను అలవరచుకొన్నాడు.

ఆనాడే మోహన్ బాల మేధివి. ఆట పాట, క్రీడలు పరుగు, లాంగ్ జంప్, ఈత నడక ఒకటేమిటి అన్నిటా ప్రథమ శ్రేణి సంపాదించేవాడు. ఆధ్యాత్మిక విద్య ఎట్లాగూ ముందే అలవడింది కదా. భర్తృహరి సుభాషితాలన్నీ కంఠోపాఠం. భగవద్గీత అంతా నోటికి వచ్చేసింది. అనేక సభల్లో వాటిని వినిపించి మెప్పు పొందేవాడు. బందరు నోబుల్ కాలేజిలో 1928లో చేరి ఇంటర్, డిగ్రీలను సాధించాడు. రాజమండ్రిలోని

హిందూ సమాజం నిర్వహించిన రాష్ట్రస్థాయి పోటీలలో ఆనంద మోహన్ నగదు బహుమతి పొందాడు. ఆ డబ్బుతో స్వామి వివేకానంద పుస్తక సర్వస్వాన్ని కొని చదివేశాడు. జీర్ణం చేసుకొన్నాడు కూడా. మళయాళ స్వామి మచిలీపట్నాన్ని సందర్శించి నపుడు బాలమోహన్ తండ్రి గారితో అన్నపూర్ణ మఠంలో దర్శనం చేసుకొని ఆయన దృష్టిని ఆకర్షించాడు. మళయాళ స్వామి ఆనందమోహన్‌కు అప్పుడే పంచాక్షరీ మంత్రాన్ని ఉపదేశించారు. దానితో వారి విద్య శరవేగంగా దూసుకుపోయింది. ఆంగ్ల, ఆంధ్రాలలో గొప్ప పాండిత్యాన్ని సంపాదించారు. సంస్కృతం హిందీలలోను మెలకువలను నేర్చాడు. హిందీలో విశారద పరీక్ష రాసి ఉత్తీర్ణులయ్యారు. అప్పుడే జాతీయోద్యమం ఊపులో ఉంది.

ఆనందమోహన్ కాశీ వెళ్లి కాశీ విశ్వపీఠలో చేరాడు. అక్కడే ఈత, వాలీబాల్, ఫుట్‌బాల్‌లో ప్రావీణ్యం సాధించాడు. నిత్యయోగా సాధనలో ప్రాణాయామంలో ఖాళీ సమయాన్ని సార్థకం చేసుకొనేవాడు. విద్యాలయంలోని ఆంగ్ల పత్రికకు సహాయ సంపాదకుడిగా, "తపో భూమి" పత్రికకు సంపాదకునిగా తన సమర్థతను నిరూపించుకొన్నాడు. ఇతని బహుముఖ ప్రజ్ఞ విద్యార్థులను, అధ్యాపకులను విశేషంగా ఆకర్షించింది. ఒక్క ఏడాది కాశీలో ఉండి హిందీ డిగ్రీ పొందారు. కాశీలో ఉండగానే మహాత్మా గాంధీ, పటేల్ రాజేంద్ర ప్రసాద్ లాంటి ఉద్దండ దేశభక్త రాజకీయ నాయకులను చూసే అదృష్టం కలిగింది. గాంధి బస చేసిన చోట ఈ కుర్రాడికి వాలంటీర్‌గా పనిచేసే అవకాశం లభించింది. తర్వాత విజయవాడ చేరారు. ఇక్కడ జీవితం ఒక గొప్ప మలుపు తిరిగింది.

ఒకసారి మళయాళ స్వామి వారు విజయవాడ వచ్చి మోహన్ తండ్రి రామస్వామిగారింటికి భిక్షకు వచ్చారు. అప్పుడు ఆనంద్ ఇంట్లో లేడు. స్వామి తనకున్న అయిదుగురు కుమారులలో ఒకరిని తన ఆశ్రమానికి అందించమని కోరారు. ఏమీ ఆలోచించకుండా ఆనంద్ నిస్తానని చెప్పాడు తండ్రి. అతనే సమర్థుడు ఆధ్యాత్మిక ఉన్నతి ఉన్నవాడు. స్వామిని హరిద్వారంలో తండ్రీకొడుకులు దర్శించారు. స్వామీజీతో ఋషీకేశ్ మొదలైన ప్రదేశాలు, ఆశ్రమాలను సందర్శించారు. ఇక్కడే గొప్ప పరిణామం సంభవించింది. ఋషీకేశ్‌లో గంగా నదిలో పడవలో వెళ్తుంటే ఒక గడ్డిమోపు కొట్టుకొస్తోంది. దాన్ని చేత్తో పట్టుకొని పడవలోకి తీసుకొన్నాడు. ఆశ్చర్యం. అందులో సంస్కృత భగవద్గీత, దానిపై పరిమళ పుష్పాలు కన్పించాయి. అది భగవంతుని కానుకగా భావించి కళ్ళకద్దుకొని తనతో యాత్ర పూర్తి అయ్యేదాకా భద్రంగా ఉంచుకొని విజయవాడ తీసుకొని వచ్చాడు.

అప్పుడే ఆయనకు ఆధ్యాత్మ జీవితాన్ని మళయాళ స్వామివారి ఆశీస్సులతోనే గడపాలని నిర్ణయించుకొన్నాడు. ఆత్మ సాక్షాత్కారం కోసం తీవ్ర తపస చెందాడు. ఇది విని కుటుంబం అంతు చూడాలని నిశ్చయించుకొన్నాడు. కాబోయే స్వామి అయిన ఆనంద మోహన్ 1936 మే 17 ఏకాదశి నాడు నందికొండల దిగువన ఉన్న వ్యాసాశ్రమం చేరి మళయాళ స్వామిని సందర్శించారు. దీనికి దగ్గరలోనే ఉన్న శిష్టాశ్రమం దగ్గర్లో



"గుహాశ్రమం" కేటాయించారు. అక్కడే ఒంటరిగా ఉండి సాధన చేయమని గురువుగారి ఆదేశం. అక్కడ అన్నీ పచ్చికూరలు మితాహారం జపం, తపం, ధ్యానంలతో ఆత్మోద్దీపన కోసం తీవ్రంగా కృషిచేశారు. అప్పుడే వాల్మీకి రాసిన సంస్కృత యోగ వాశిష్టం 32,000 శ్లోకాలను ఆరు సంవత్సరాలు తీవ్ర కృషి చేసి సరళ సుందర సంక్షిప్త ఆంధ్రానువాదం చేశారు. ఇది ఒక బృహత్తర గ్రంథం. ఎందరినో ఆకర్షించింది. బౌద్ధ గ్రంథం "ధమ్మపదం"ను వెలిగించారు. గురువులు మళయాళ స్వామి పతంజలి యోగ శాస్త్రాన్ని, భగవద్గీతను, ఓంకార తత్వాన్ని విశదీకరించారు. ఆరేళ్ళు మౌనవ్రతంలో గడిపారు. 29-6-1947 నాడు మళయాళ స్వామి ఆనంద్‌కు సన్యాసాశ్రమం ఇచ్చి "విద్యా ప్రకాశానందగిని స్వామి" అని ఆశ్రమ నామాన్ని పెట్టారు. బ్రహ్మనిష్టతో గడిపారు. గురువు అనుమతితో వ్యాసాశ్రమం వదిలి చిత్తూరు జిల్లా కాళహస్తి దగ్గన శుక మహర్షి పేరుతో "శుకాశ్రమం"ను 20-1-1950న ఏర్పాటు చేశారు. మళయాళ స్వామి తమ అమృత హస్తాలతో దీన్ని ప్రారంభించారు. ఇక్కడే తర్వాత "ఆనంద ఆస్పత్రి"ని పేదలకోసం నిర్మించారు. వశిష్ట గీతను శుకాశ్రమం నుండే ప్రచురించారు. గీతామకరందం అనే బృహత్ గ్రంథాన్ని రాసి సామాన్యులకు గీత పరమార్థాన్ని తేట తెల్లమయ్యేట్లు రచించారు. దీని వ్యాప్తి తిరుగులేనిది. "వేదాంత భేరి" అనే మాసపత్రికను నడిపారు. 108 గీతా యజ్ఞాలను దేశమంతటా నిర్వహించారు. 100, 108వ యజ్ఞాలను హైదరాబాద్‌లో నిర్వహించి అశేష ప్రజలకు మహదానందాన్ని కల్గించారు. స్వామి ఎక్కడకు వెళ్లి ఉపన్యసించినా వేలాది జన సమూహం చేరి అత్యంత శ్రద్ధ, భక్తితో వినేవారు.

తీరిక లేకుండా నిత్యం దేశ సంచారం, అలుపు లేకుండా ఉపన్యాసాలు, నిష్ఠతో గీతా యజ్ఞాల నిర్వహణతో ఆరోగ్యం దెబ్బతిన్నది. 1994 నుండి తీవ్ర అనారోగ్యానికి గురైనారు. హైదరాబాద్, మద్రాస్‌లలో చికిత్స జరిగింది. మూత్రపిండాలు దెబ్బతిన్నాయని తేలింది. చివరికి 10-4-1998 ఉదయం ఏడున్నర గంటలకు ఎనభై నాల్గవ ఏట సార్థక జీవితం గడిపి సిద్ధి చెందారు. విద్యా ప్రకాశానందస్వామి రచించిన గీతా మకరందం అయిదు భాషల్లో వెలువడి విశేష ప్రాచుర్యం పొందింది. మొత్తం 42 గ్రంథాలు రచించారు. అందులో కొన్ని గీతా మకరందం, యోగా వాశిష్టం, భారత రత్నాకరం, భాగవత రత్నాకరం, ఉపనిష్త్రాకరం, గీతోపన్యాసాలు మోక్ష సాధనా రహస్యం, ఆత్మాను సంధానం,బ్రహ్మానంద వైభవం, భజన కీర్తనలు, అమృత బిందువులు, మధు సూదన సరస్వతి రచన "గూడర్థ దీపిక"కు అనువాదం మొదలైనవి.

చదువుకొనే రోజుల్లో అన్నిటా ప్రథమంగా ఉన్న స్వామి ఆశ్రమ జీవితంలోను ప్రథమ శ్రేణి పరివ్రాజకులుగా, గీతార్థ రహస్య వివరణతో, యోగ వాశిష్ట వైభవ విశదీకరణలో, యోగ సాధనలో ఉపన్యాసామృతాన్ని అందివ్వటంలో చిన్న కథలనాధారంగా అతి గహనమైన వేదాంత రహస్యాలను అందరికి అందుబాటు చేయటంలోను, గీతా యజ్ఞ నిర్వహణలో, వేదాంత భేరిలోను అద్వితీయులై, దీన జనోద్ధరణ, ఆరోగ్య మందివ్వటంలోను సర్వ ప్రథములై చిరకీర్తి నార్జించారు శ్రీ విద్యా ప్రకాశానందగిరి స్వామీజీ. ❁